# భారతి

సాహిత్య మాసపత్రిక

సెప్టెంబరు 1985



భారతీయ శిల్పముల గుహ్యాలు, గణములు

డా॥ ఇంగువ కార్తికేయ శర్మ

విజయ బాపినీడు




బత్తుల వెంకటనారాయణ నాగార్జున ఆర్ట్ పిక్చర్స్

సమర్పించు

# దొంగల్లో దొర

ఎ.సారథి

S.P.బాలసుబ్రహ్మణ్యం • సత్యానంద్ • M.V.రఘు పి.యస్.వి.నరసింహారావు

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

సెప్టెంబర్- 1985
సంపుటము : 62 సంచిక : 9

విడిప్రతి వెల నాలుగు రూపాయలు

# స్వవిషయం!

ఈ నెల నుంచి భారతి ఉత్పత్తిలో కొన్ని మార్పులు మొదలవుతున్నాయి. ఇవి చదువరులకి నచ్చగలవని అనుకుంటున్నాము. రాసేవారూ, చదివేవారూ – వీరి ఆదరణ ఉంటేనే భారతి మరింతగా అభివృద్ధి చెందగలదు!

ఒకప్పుడు భారతిలో కథలూ, నవలలూ పుష్కలంగానే ఉండేవి. ఎందుకో గాని క్రమంగా ఇవి తగ్గుతూ వచ్చాయి. మళ్ళీ వీలయినన్ని కథలని (చిన్నవాటినీ, పెద్దవాటినీ కూడా) వేసి భారతి చదివే వారిసంఖ్యని పెంచాలని అనుకుంటున్నాము!

కవిత్వం, రాజకీయాలూ, చరిత్రా, చర్చలూ, కథలూ, నాటకాలూ, ఆర్థిక విషయాలూ – వైజ్ఞానిక విశేషాలూ – వీటికి సంబంధించిన రచనలూ తగిన పాళ్లలో ఉంటేనే భారతి చెయ్యగలిగిన సాహిత్య సేవ సమగ్రంగా ఉండగలదని మా నమ్మకం.

మాసపత్రికలకి వచ్చే రచనలని పరిశీలించి నిర్ణయాలు తీసుకోవటానికి కొంత ఆలస్యం కాక తప్పదు కాని ఈ నిర్ణయాలని వీలయినంత త్వరగా తీసుకోవటానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

గడిచిన ఆరు దశాబ్దాలలో భారతి తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉండటానికి ప్రయత్నిస్తూ వచ్చింది. తెలుగువారు ఏ విధంగా చూసినా భారతీయులేనని ఈ సందర్భంలో మరొకసారి గుర్తు చేసుకోవచ్చు.టెలివిషన్ వంటి ప్రచార సాధనాల అభివృద్ధితో భూగోళం అంతా ఒక గ్రామంగా మారిపోతోందని ఇటీవలే ఒక పాశ్చాత్య మేధావి అంటే అంతకి కొంచెం ముందు ఒక గొప్ప దార్శనికుడు మానవుడికి విశ్వాన్ని గురించి తెలుస్తున్న దాని పరిధి పెరిగిన కొద్దీ అతని భావాలు మరింత సంకుచితం అయిపోతున్నాయని బాధపడ్డాడు. ప్రపంచం అంతటా చెలరేగుతున్న దౌర్జన్యాలు బెర్ట్రాండ్ రస్సెల్ అన్న మాటలలోనే ఎక్కువ నిజం ఉందని అనిపించేట్లుగా ఉన్నాయి. అయితే, ఇటీవల అకాలీలతోనూ, అస్సామ్ ఉద్యమకారులతోనూ ప్రధాన మంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ సాధించిన ఒప్పందాలు మాత్రం ఆశాజనకంగా ఉన్నాయని అనక తప్పదు. ఇంత వైవిధ్యం కల భారతదేశంలో శాంతియుత సహజీవనం ఈ మాత్రంగా కొనసాగటమే ఒక విశేషం అని కొందరు పాశ్చాత్యులే అంటూ ఉంటారు. కనీసం, ఈ విషయంలోనయినా భారతీయులు ఇతరులకి మార్గదర్శకులుగా ఉండగలరనీ,పంజాబు సమస్య పరిష్కారం కాగలదనీ ఆశపడుతున్న వారికి సంత్ హర్చంద్‌సింగ్ లోంగోవాల్‌ని సిక్కు దౌర్జన్యవాదులు హత్య చెయ్యటం ఒక ఘోరమయిన ఆఘాతంగా తోచకతప్పదు. అయినా, పంజాబులో ఏర్పడిన సంక్షోభంఎప్పటికయినా సమసిపోగలదని ఆశించనివారూఉండరు.

# విషయానుక్రమణిక

## సెప్టెంబర్ : 1985



ముఖచిత్రం :

హేరంబ ప్రభు

చిత్రకారుడు : శ్రీ యస్. కాశీ విశ్వేశ్వరరావు

# భారతి

## చిన్న నవలల పోటీ !

భారతీయ సంస్కృతిలో ఒక భాగమైన తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉంటున్న భారతి సాహిత్య మాసపత్రికలో చిన్న నవలల పోటీ పెడుతున్నామని తెలుపటానికి సంతోషిస్తున్నాము. పోటీలో పాల్గొనే రచయిత్రులూ, రచయితలూ క్రింది నిబంధనలని తప్పనిసరిగా పాటించవలసి ఉంటుంది.

* నవల యితివృత్తం తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి.
* నవల నిడివి అరవై అరటావులకి మించి ఉండరాదు. కాగితానికి ఒక వైపునే యింక్‌పెన్‌తో కాని బాల్‌పెన్‌తో కాని రాయాలి. నవల వ్రాత ప్రతిపైన "చిన్న నవలల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.
* అనువాదాలు, అనుసరణలు, కాపీ నవలలు పంపరాదు. గతంలో ప్రచురించబడిన, ఆకాశవాణిలో ప్రసారం అయిన నవలలని పంపరాదు. ఇతర పత్రికల పరిశీలనలో ఉన్నవాటిని అసలే పంపరాదు.
* రచయిత్రులూ, రచయితలూ వ్రాత ప్రతులతో పాటు రచన తమ స్వంతమేనని పేర్కొంటూ హామీ పత్రం విధిగా జతపరచాలి. హామీ పత్రంలేని రచనలు పరిశీలించబడవు. రచయిత(త్రు)లు కలంపేరు వాడినా తమ అసలుపేరు, పూర్తి చిరునామా స్పష్టంగా రాయాలి.
* పోటీలో గెలుపొందిన రచయిత(త్రు)లు తమ ఫోటో, జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది.
* రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది.

## బహుమతుల వివరాలు

సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన నవలలకు బహుమతులు లభిస్తాయి. బహుమతుల నిర్ణయంలో సంపాదకునిదే తుది తీర్పు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు.

మొదటి బహుమతి : రు. 2500

రెండవ బహుమతి : రు 2000

మూడవ బహుమతి : రు. 1500

పోటీకి అందిన నవలలలో సాధారణ ప్రచురణకి యోగ్యమైనవి ఉంటే వాటిని ప్రచురణకి స్వీకరించి విలువ వెంబడి ప్రచురించడం జరుగుతుంది. ఈ విషయాన్ని ఆయా రచయిత(త్రు) లకి ఉత్తరాల ద్వారా తెలియ జేస్తాము. ప్రచురణకి స్వీకరించబడని నవలలని తిప్పి పంపాలని కోరుకునేవారు తగిన తపాలా బిళ్లలు అంటించిన పూర్తి చిరునామా గల కవరును విధిగా జతపరచవలసి ఉంటుంది.

## నవలలు చేరవలసిన ఆఖరుతేది : నవంబర్ 30

పోటీకి పంపే చిన్న నవలలని సంపాదకుడు, భారతి సాహిత్య మాసపత్రిక, ఆంధ్రపత్రిక కార్యాలయం, గాంధీనగరం, విజయవాడ-520003; అన్న చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పైభాగంలో భారతి- చిన్న నవలల పోటీకి అని మరచిపోకుండా రాయాలి.

* రచయిత్రులూ, రచయితలూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

–సంపాదకుడు

# జనావాసాలలో మృత్యువు నీడలు

ఓశత్రూ!
మానవతా విద్వేషి!....
ఎన్ని బాంబులు కురిసీ
కలకలలాడే ఎన్ని యిళ్ళు కూల్చి
ఎన్నిగుండెల కలనాదాలు విరిచీ
ఎన్ని మాధుర్య మానుషగానాలు చీల్చి
ఏం సాధించావు చివరికి ?
ఏం మిగుల్చుకొన్నావు నీకోసం ?
జిత శ్రేత్రాల రక్తసిక్తవదనాలలో
అజితనేత్రాల దురంతాక్రోశాలు....
జనావాసాలలో మృత్యువు నీడలు....
నగరాల వీథులనిండా
రాబందులు తింటున్న శవాలు....
చర్మం కోల్పోయి తెల్లగా మెరిసే పుర్రెలు....
పురాకృత సంకల్పాలతో లేచి
విజయాలు సాధించచూచే కంకాళాలు....
హే మానవతా విద్వేషి!
ఏం సాధించావు చివరికి ?
అంతటా సంక్షుభిత జీవపదార్థాలు....
విషహాసాల సంక్లిష్టకాలు ష్యార్ణవాలు....
ఇది పునస్సృష్టికి జరిగే క్రతువా ?
కాదు,.కాదు! విషయము వికృతి ;
నిర్ణిద్రంగా సాగే కారుమేఘాలు -
నిరంతరాయంగా కురిసే బీభత్సాలు;
మనిషిని నిర్వీర్యమొనరించే
కర్తవ్యాలను నివృత్తంచేసే
నిస్సహాయ భయోత్పాతాలు....
కృత్తిక నక్షత్రాల క్షతగాత్రాలు....
ఇది సర్వ జీవోత్క్రమణం !
సాంద్రాటవీ గర్భకుహరం !

మనిషి గుండెల్లోని
ఆదిమత్వాల వారసత్వాలు
ఆటవికత్వాలకు ఆవిష్కరణ !
పరస్పర హరణోద్వేగ దురాక్రమణ !
ఆశియా గుండెవంటి మధ్యప్రాచ్యం
కుమిలి కుమిలి ఏడ్చినపుడు,నెత్తురుఓడ్చినపుడు
అనాది ఆర్యత్వం ష్మృగ్యమై
పర్వతాగ్రాల మృగత్వం నిలచినపుడు_
స్మితాధరాల స్మృతిగీతం నశించింది !
అసిత దిగంతాల అసురత్వం జృంభించింది !
ఆత్మ విమర్శమనసును పునీతంచేసే యాగాగ్ని
దాన్ని ఆర్పేసిననాడే మనిషి పశువుగా మారింది
ఆయుధమే సర్వస్వ మనుకొన్నదుర్ముహూర్తంలోనే
అంధసముద్రాల మునిగిపోయాయి మానవాక్షులు....
అహరహం దివ్యలోకాల కెగిరే పక్షులు....
వెదికి వెదికి ఏంలాభం ?
మహా శూన్యాన్ని ? రక్తాశ్రు మాలిన్యాన్ని ?
అచ్చయిన ప్రతి అక్షరమూ సత్యమేననీ
అనతోలియన్ వార్తాసంస్థ అబద్ధాలు చెప్పదనీ
నమ్మేవాళ్ళంతా అమాయకులే కావచ్చు....
ఐనా యిదికాదా ? ఎన్నాళ్ళకీ ఆరనిచిచ్చు....
ఇరాక్ జనావాసాలపై క్షిపణులు నోరుతెరచి
గర్జించినపుడు ఎందరు నిస్సహాయుల ఆహుతి ?
మృతులసంఖ్య ఎంత అనేది కానేకాదు సమస్య
అంత్యాక్షరభేదానికె ఇంత ప్రళయోల్లాసం
జరగాలా అన్నదే ప్రశ్న ! అంతులేని శేషప్రశ్న........
ప్రతిగుండెలలో ధమనుల మధురధ్వానం__
ప్రతిగుండెలలో సిరల విశ్రుతకలస్వరం__
శాంతి....శాంతి....శాంతి....శాంతి........

శ్రీ సోమసుందర్

శ్రీ పంద్రంగి రాజేశ్వరరావు

# మహామేధావి మానవేంద్ర నాథ్ రాయ్

జీవితం వ్యక్తి కేంద్రంగా వికసిస్తుందనే వాదానికి శ్రీ. యమ్. యన్ తార్కాణము. ఎన్ని మార్పులు వచ్చినా ఆయన వ్యక్తిత్వాన్ని కోల్పోలేదు. భయంకర విప్లవ వాదిగా జీవితాన్ని ప్రారంభించి మేటి కమ్యూనిస్టు నాయకుడుగా రూపొంది, మానవతా వాదిగా పరిణతి చెందారు. మూడు ఖండములందలి పన్నెండు దేశాలు ఆయన కార్యరంగము. ఆయన ఆయా దేశాలకు యాత్రికుడుగా వెళ్ళలేదు. అచటి అంతర్గత బహిర్గత వుద్యమాలలో ప్రధాన పాత్రను చేపట్టారు. జాతీయతకు సమతావాదానికి, విజ్ఞానానికి, జిజ్ఞాసకు, మానవతకు మార్గదర్శకులైరి. ఆయన జీవితము ఆశ్చర్య కరమైన సంఘటనలతో నిండి వుంది. అభిప్రాయ భేదం వచ్చినపుడు అరణ్యవాసం చెయ్యటానికి వెనుదీయలేదు. ప్రాథమిక విలువల నెన్నడూ విసర్జించలేదు. విజయం కోసం విలువ నెన్నడూ త్యాగం చెయ్యలేదు. మేధావిగా ఆయన విడచి వెళ్ళిన వారసత్వము నిరుపమానము, ఆయనను గురించి తెలుసుకున్న కొద్దీ వారి ప్రజ్ఞాపాటవాలు, హేతువాదము, స్వాతంత్ర్య ప్రియత్వము అవగాహన అవుతాయి.

ఈయన ది. 21-3-1887 వ సంవత్సరమున సంస్కృత పండితులైన పురోహిత కుటుంబంలో జన్మించారు. తత్రాపి సనాతన సంస్కృతిని, సంస్కారాన్ని పుణికి పుచ్చుకున్నారు. వీరిలో మొదటినుంచి సంస్కరణ బీజాలు కూడా వుండేవి. ఇందుకు కారణం యజ్ఞోపవీతాన్ని విసర్జించిన ప్రముఖ బ్రహ్మసమాజ నాయకుడగు శివనాథశాస్త్రి యీయన తల్లికి పినతండ్రి. మత వాతావరణంలో పెరిగారు. కుస్తీ పట్టటం చదరంగం ఆడటం యీయనకు ప్రీతి పాత్రము. వినాయక దామోదర సావర్కారు విప్లవ చర్యల వల్ల వుత్తేజం పొందారు. బంకించంద్రచటర్జీ 'రచించిన' ఆనందమఠం అనే నవల యీయనను ఆకర్షించింది రామకృష్ణమఠం వల్ల కూడ ప్రభావితులయ్యారు, శ్రీ అరవింద ఘోషు కులపతిగానున్నప్పుడు కలకత్తా యందలి జాతీయ కళాశాలలో విద్యాభ్యాసం చేశారు. యుగంతర్ విప్లవ సంస్థలో సభ్యులై మైనారిటీ తీరకుండానే రాజకీయ దోపిడీలలో పాల్గొని ముద్దాయిగా వుండి పదివేల రూపాయల పూచీ కత్తుపై విడుదలై కోర్టుకు హాజరు కాకుండా పరారీ అయ్యారు.

ప్రథమ ప్రపంచ యుద్ధ సమయమందు భారత విప్లవ కారులకు ఆయుధాలను సేకరించటానికి ఇండోనేషియా చైనా, జపాను దేశాలకు ఫ్రెంచి పాసుపోర్టుతో పాదరు మార్టిన్ అనేపేరు పెట్టుకుని వెళ్ళారు. బ్రిటిషు, చైనా, జపాను, అమెరికా పోలీసులను కన్నుకప్పి అమెరికా చేరుకున్నారు. పోలీసు నిఘాను తప్పించుకునేందుకు ధనగోపాలముఖర్జీ సలహాపై జన్మతః వచ్చిన నరేంద్రనాథ్ భట్టాచార్య అనే పేరును మానవేంద్రనాథ్‌రాయిగా మార్చుకున్నారు. ఈయనను చూడగానే యదార్థమగు విప్లవకారునిగా గుర్తించి అచట ప్రవాసిగా వుండిన పంజాబు కేసరి లాలా లజపతిరాయి ముగ్ధులయ్యారు.

కొలంబియా విశ్వవిద్యాలయ ప్రాంగణంలో సోషలిజాన్ని కూలంకషంగా అధ్యయనం చేశారు. అమెరికా మిత్రరాజ్యాల పక్షాన్ని యుద్ధంలో ప్రవేశించగానే యీయనను బ్రిటిషు ప్రభుత్వముపై కుట్ర పన్నుతున్నారనే ఆరోపణపై అరెస్టు చేశారు. జామీనుపై విడుదలై తటస్థ రాజ్యమైన మెక్సికోకు పారిపోయారు. అచట సోషలిష్టు పార్టీని నిర్మాణముచేసి దానిని రష్యా వెలుపల ప్రథమ కమ్యూనిష్టు పార్టీగా రూపొందించారు. మెక్సికో అధ్యక్షుడైన కరంజాకు అనధికార సలహా దారుడుగా వుండటాన్ని చూచి జర్మనీ ప్రభుత్వం యీయనకు నిధులను అందచేసింది. జాతీయాభిమానానికి తిలోదకాలిచ్చి అంతర్జాతీయతను అలవరచుకున్నారు. మెక్సికో యందలి విప్లవంలో పాల్గొని అచటనే స్థిరపడటానికి నిశ్చయించుకున్నారు. విప్లవాలు మేధావుల వల్లనే వస్తాయి. జాతీయ, భాషా, మతశక్తులు వారిని అడ్డగించలేవు.

ప్రతి విషయాన్ని పరిశీలించి ఆకళింపు చేసుకునేవారు. ఇంగ్లీషుతో బాటు స్పానిష్, జర్మన్. ఫ్రెంచి, రష్యను భాషలను నేర్చుకున్నారు. అన్నిరంగాలలోను వస్తూన్న మార్పులను క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్నారు. ఆయన శైలి ఆదర్శాలతో సరితూగేది. అన్ని విషయాలలోను నిష్ణాతులనిపించుకున్నారు. కాని ఏ అభిప్రాయాలకు వ్యవస్థకు బానిస కాలేదు. ఆరడుగుల పొడవేగాక పుష్టికరమైన శరీరము. వచ్చిన అవకాశాలను సద్వినియోగంచేస్తూ శక్తియుక్తులు దీక్షాదక్షతలుగల అసాధారణవ్యక్తిగారాణించారు. ఆయన మాటలలోను వ్రాతలలోను హేతువాదం పెనవేసుకు వుండేది.

లెనిన్ యీయనను ముప్పదేండ్ల యువకునిగా కాక కాకలుతీరిన ప్రాచ్యదేశపు మేధావిగా గుర్తించి రష్యా తీసుకురమ్మని మైకేల్ బోరోడిన్‌ను మెక్సికో పంపారు. దౌత్యపత్రాలతో యూరప్ మీదుగా రష్యాలో జరుగుచున్న రెండవ అంతర్జాతీయ కమ్యూనిస్టు సమావేశానికి హాజరయ్యారు. ఈయన తూర్పుదేశాలకు విప్లవ జ్యోతిగా మన్ననలు పొందారు. వలస రాజ్యాలలో సోషలిజాన్ని పైస్థాయినుంచి దిగుమతి కావాలనే లెనిన్ అభిప్రాయాన్ని ఖండించి జాతీయోద్యమంలో సమతావాదం తక్కువపాలుగా వుంటుందని వాదించారు. లెనిన్, స్టాలిన్‌ల హయాములో ప్రముఖ కమ్యూనిష్టుగా పరిగణింపబడ్డారు. తార్కికుడుగా గణుతికెక్కుటచేత పార్టీ పత్రిక యగు "ప్రావ్దా"కు ప్రామాణిక వ్యాసాలను వ్రాసేవారు. అధ్యక్షవర్గ సభ్యులుగా ఎన్నుకోబడిన వీరిని తాష్కెంటులో విప్లవాన్ని విజయవంతం చేయడానికి పంపారు. కమ్యూనిజం వ్యాప్తికి, రాయి వేసిన పథకాన్ని లెనిను మెచ్చుకున్నారు. విప్లవమనేది దిగువస్థాయిలో ప్రారంభం కావాలని వీరివాదం. ప్రమాదంలో చిక్కుకున్న భారతీయులను ఆదుకుని రహస్య పోలీసు బారి నుంచి రక్షించారు.

ఆలోచనా పరుడుగా యీయన స్థానం కాట్‌స్కీ, హిల్ఫర్‌డింగు, లెనిన్ ప్రభృతుల సరసన వుండేది. మార్క్సిజాన్ని ఆర్థిక, రాజకీయ దృష్టితోనేకాక తాత్విక దృష్టితో పరిశీలించేవారు. వీరి వాదన హృదయాన్ని గాక మేధస్సును ఆకట్టేది. ఇంద్రియ లోలత్వానికి బానిసలయ్యే భౌతిక

వాదాన్ని ఖండించేవారు, జ్ఞాన, విజ్ఞానాల పురోగతిపై భౌతికవాదం ఆధారపడాలని చెప్పేవారు. న్యాయ, వైశేషిక వాదాలను భౌతికవాదంతో సమన్వయపరచారు. సాంఘిక తాత్విక పరిణామమే మార్క్సిజమని చెప్పారు. మార్క్సుని యూదు ప్రవక్తల సరసన చేర్చారు.

భారతదేశంలో సరిహద్దు నుండి విప్లవానికి సారథ్యం వహించేందుకు యీయనను ఆఫ్గనిస్థానానికి తమ రాయబారిగా పంపాలని రష్యను ప్రభుత్వం తలచింది. లెనిన్ మరణానంతరము రష్యా యందలి కమ్యూనిస్టు నాయకులతో యీయనకు అభిప్రాయ భేదాలు వచ్చాయి. 1926లో చైనా విప్లవాన్ని క్రమబద్ధం చేయటానికి వెళ్ళారు. అనుచరులుకాక, సహచరులుగా పని చేయుటకు ప్రయత్నించి విఫలులయ్యారు. ఇందుకు కారణం ప్రతి విషయంలోను తుది నిర్ణయం రష్యనులది కావటం.

కమ్యూనిజంలోని మతావేశము భౌతికవాదానికి వ్యతిరేకమని నిర్ధారించారు. స్వాతంత్ర్య ప్రియత్వం, నిజాయితీ, ధైర్యము, యీయన వాదంలో వ్యుట్టిపడేవి. వ్యక్తులను, విషయాలను, యుక్తియుక్తంగా అంచనా వేసేవారు. అజ్ఞానాన్ని భేషజం క్రింద దాచే కమ్యూనిస్టు నాయకులను ఘాటుగా విమర్శించారు. ఔచిత్యాన్ని, నీతి, నిజాయితీలను బలిపెట్టినందుకు స్టాలిన్ విమర్శించారు. ట్రాట్‌స్కీ ప్రజానీకానికి దూరంగా వుంటూ వారిచేత తన వాక్‌చాతుర్యమువల్ల మెప్పు పొందాలని తహతహ పడేవాడు. లెనిన్ క్రైస్తవము ప్లేటో సిద్ధాంతాల సముచ్ఛయమని ఆయన స్థాయికి వచ్చేవారు తక్కువ అని చెప్పారు.

ఆస్తికవాదాన్ని సంస్కృతిని వర్గ పోరాటాన్ని సమపాళంలో అంచనా వేశారు. సనాతన సంస్కృతి అన్ని వత్తిడులను తట్టుకోగలదని నమ్మారు. వర్గాలనడుమగల విపక్షతను.విచక్షణను సునిసితంగా బేరీజు వేశారు. స్వతంత్రంగా ఆలోచించినందుకు యీయనను పార్టీనుంచి బహిష్కరించారు. స్టాలిన్ కనీసం దర్శనమివ్వటానికి తిరస్కరించారు.

యూరప్‌లోని మిత్రుల వారించినా 1930లో డాక్టరు మహమ్మదు అనే మారు పేరుతో ఇండియా వచ్చారు. ఇందుకు, తయ్యతు షేకు, సుందర కబాడి, బ్రిజేస్ సింగు సాయపడ్డారు. కుమారి మణి బెన్ కారా కార్మికుల తరపున అండగా నిల్చారు. కరాచీలో జరిగిన కాంగ్రెసు వార్షిక సమావేశమునకు హాజరై ప్రాధమిక హక్కులపై తీర్మానం చేయటానికి దోహదం చేశారు. అభిప్రాయ భేధాలున్నా జవహర్‌లాల్ నెహ్రూ యీయనను అభిమానించేవారు. రౌలట్ రిపోర్టులోను పెక్కు కుట్ర కేసులలోను యీయన ప్రస్తావన ప్రముఖంగా వుండి. అహమ్మదాబాదు గయా కాంగ్రెసు సమావేశాలలో యీయన ప్రచ్ఛన్న హస్తం, ప్రమేయం వుంది. పెషావరు, లాహోరు, మీరట్ కుట్రకేసులలో వీరి పాత్ర వుంది. కాన్‌పూర్ కుట్రకేసులో సిగారువేలుచెట్టి ప్రభృతులతో ముద్దాయిగా వున్నారు.

చివరకు యీయనను ది. 21–7–1931వ తేదీన అరెస్టు చేసి కాన్‌పూర్ కుట్రకేసులో ముద్దాయిగా విచారించి పన్రెండు సంవత్సరాలు కారాగార శిక్ష విధించారు. ఈయన వ్రాసిన "తత్వశాస్త్రము - అధునిక విజ్ఞానము" అనే వ్యాసాన్ని ఆల్‌బర్టు ఐన్‌స్టీన్ చదివి ముగ్ధులై యీయనను విడుదల చేయవలసినదిగా విజ్ఞప్తి చేశారు. అలహాబాదు హైకోర్టుకు అప్పీలు చేయగా శిక్షను ఆరు సంవత్సరాలకు తగ్గించారు. ది 20–11–1937న విడుదల కాగానే భారత జాతీయ కాంగ్రెసులో సభ్యులుగా చేరారు. గాంధి టోపీని ధరించి నూలు వడకటం ప్రారంభించారు. గాంధీజి విప్లవానికి సంస్కరణలతో అడ్డుగట్టు వేస్తున్నారని విమర్శించారు. చివరకు హరిపుర కాంగ్రెసు సమావేశంలో గాంధిజీని కలుసుకుని మాట్లాడినా ఉభయుల నడుమ సమైక్య ఏర్పడలేదు. లక్నో కాంగ్రెసు అధ్యక్ష పదవికి పోటీ చేసి ఓడిపోయారు. త్రిపురి కాంగ్రెసు పిమ్మట సుభాష్ చంద్రబోసు పదవీచ్యుతు డయ్యాక బోసు గాంధిజీల నడుమ నడచిన ఉత్తర ప్రత్యుత్తరాలలో బోసు తరపున వ్రాసినది యీయనే అని వాదనా పటిమతను బట్టి అభిజ్ఞవర్గాల అంచనా. మేధావులను సాదాసీదా జనం నమ్మరు. నమ్మినా అనుకరించరు. అట్టివారి జోక్యాన్ని సహించరు. ఇది లోకంతీరు.

నైతిక పిరికితనాన్ని, యిచ్చకాలాడటాన్ని వ్యక్తి ఆరాధనను ఏవగించుకునేవారు. అహంకారము, పవిత్రుడననే అహంభావము యీయనకు లేవు. ఎట్టి పంజరంలోను యిమడలేకపోయారు! రాబోయే పరిణామాలను దూరదృష్టితో తు. చ. తప్పకుండా అంచనా వేసేవారు. హిట్లరు ప్రతిపాదించిన జాతీయ సమతావాదము అర్ధరహితమని సిద్ధాంతీకరించారు. అందుకు కారణం సోషలిజం అంతర్జాతీయంగాని జాతీయంకాదు. నాజీ జర్మనీ రెండవ ప్రపంచయుద్ధం మొదటి ఘట్టంలో సోవియట్ రష్యాతో చేసుకున్న స్నేహసంధి త్వరలోనే విచ్ఛిన్నమవుతుందన్న వీరి జోస్యం యదార్ధమైంది. ప్రతి విషయాన్ని అంతర్జాతీయ



దృష్టితో అంచనావేసేవాను, రెండవ ప్రపంచ యుద్ధానంతరము సామ్రాజ్య పెట్టుబడిదారీ దేశాలు బలహీనపడతాయని తత్రాపి ఆసియా, ఆఫ్రికా దేశాలకు స్వతంత్రం వస్తుందని చెప్పారు. అట్లాగే జరిగింది. అగ్రరాజ్యమైన అమెరికా రష్యాల నడుమ పోటీ తప్పదని అందువల్ల చిన్న దేశాలన్నీ అటో యిటో వుండక తప్పదన్నారు.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో మిత్ర రాజ్యాలను బలపరచి ప్రభుత్వానికి తమ సహకారాన్ని అందించారు. గవర్నరు జనరలుగా వుండిన వేవలు ప్రభువు యీయనను తమ కార్య నిర్వాహక సంఘ సభ్యులుగా ఎంపిక చేద్దామని అనుకున్నట్టు తమ దినచర్య పుస్తకంలో వ్రాశారు రాడికలు డెమోక్రటిక్ పార్టీని, ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరును, "ఇండిపెండెంటు ఇండియా" అనే ఇంగ్లీషు వారపత్రికను తమ అభిప్రాయాలను వెల్లడించేందుకు స్థాపించారు. ప్రాంతీయులలో ఎవరు ఎవరో ఆయనకు పూర్తిగా తెలుసు. తమ పత్రికకు వ్యాసకర్తగా సహకారమిమ్మని కోరుతూ నాకు వ్రాసిన ఉత్తరాన్ని చూచి ఆశ్చర్యపోయాను. రష్యనులు 1942లో అంతర్జాతీయ కార్మికగీతాన్ని విస్మరించి జాతీయగీతాన్ని ఆలాపించటం ప్రారంభించగానే ఆశ్చర్యచకితులై విచారించారు. భారతదేశానికి రాజ్యాంగాన్ని, అభివృద్ధి ప్రణాళికను తయారుచేశారు.

చివరకు నూతన మానవతావాదానికి నాంది పలికారు. భౌతిక నైతిక ప్రపత్తులను సమన్వయం చేసి సాంఘిక దృక్పథాన్ని రూపొందించారు. మానసికశాస్త్రాన్ని శాస్త్రవిజ్ఞానంతో జోడించారు. ఏ స్థాయిలోను హేతువాదాన్ని విస్మరించలేదు. నవ మానవతావాదము వ్యక్తిత్వానికి పట్టం కడుతుందని హెచ్చరించారు. ఈ దృక్పథము కమ్యూనిజానికి అతీతమైనది. సంఘాన్ని తీర్చిదిద్దేది మానవుడు. మానవుల సముచ్చయమే సంఘము.

ఈయన పెక్కు గ్రంథాలు వ్రాసినా అవి అన్నీ ఆణిముత్యాలే. ఒకదానికొకటి ఏ విధంగాను తీసిపోదు. తొలుత జర్మను భాషలో "ఇండియా ఇన్ ట్రాన్సిషన్" ప్రచురింపబడిన యీయన గ్రంథము. లక్ష కాపీలు అమ్ముడుపోయాయి. "ఫాసిజము" "స్పిరిట్ ఆఫ్ ఇస్లాము" "మెటీరియలిజం మరియు సైంటిఫిక్ పొలిటిక్సు" "రీజను, రొమాంటిసిజం, మరియు రివల్యూషన్" "రివల్యూషన్ మరియు కౌంటరు రివల్యూషన్" అనే గ్రంథాలు వీరి జ్ఞానవిజ్ఞానాలకు తార్కిక శక్తికి గీటు రాళ్ళు. వీరు ఎచటను విద్యాభ్యాసము చేయకుండా బహు భాషాకోవిదులు తత్త్వవేత్తలు కావటం రాహల్ సాంకృత్యాయననుగుర్తు చేస్తుంది. నేటి క్లిష్ట పరిస్థితులకు కారణం అనాగరికమైన భౌతిక వాదానికి భద్రతకు, జాతీయత్వానికి, వ్యక్తిత్వానికి నడుమగల అగాధమే అని చెప్పారు.

ఈయన కుటుంబ జీవితాన్ని గురించి బైట ప్రపంచానికి తెలిసినది బహుస్వల్పము. బాల్యమందే స్వజనానికి దూరమయ్యారు. 1916లో అమెరికాయందు స్టాన్ ఫర్డు విశ్వవిద్యాలయమందు విద్యార్థినిగా వుండిన ఎల్విన్ ట్రెంటును వివాహమాడారు. ఆమె శాంతాదేవి అనే పేరు పెట్టుకుంది. 1927 లో యీయనకు దూరమై మాస్కో నుంచి అమెరికా వెళ్ళిపోయింది. 1928–29ల నడుమ జర్మనీలో ఎల్లెనుకు సన్నిహితులయ్యారు. ఈమె పోలు జాతీయురాలు. ఫ్రాన్సులో జన్మించింది. జర్మనీలో పెరిగింది. 1937 లో యీయన జైలునుంచి విడుదలకాగానే ఇండియావచ్చి వీరిని వివాహం చేసుకుంది. వీరిది ఆదర్శప్రాయమైన దాంపత్యము. ఈమె కారల్‌మార్క్సు భార్యయగు జెన్నీని, జీన్‌పాల్ సార్త్రే భార్య అగు సైమొనేని గుర్తు చేసేది, తోడునీడలా వుండి యీయన సౌకర్యాలకు ఎట్టిలోటు రాకుండా వెయ్యి కళ్ళతో చూచేది. ఆయన మరణానంతరము ఈమె ది. 18-12-1960 అర్థరాత్రి హత్యచేయబడ్డది.

ఈయన 1952 జూన్ ప్రాంతమందు అమెరికా పర్యటనకు వెళ్ళటానికి నిర్ణయించుకున్నారు. డెహ్రాడూన్‌కు సమీపమందు గల ముస్సోరి కొండపై నడుస్తూ క్రిందకు పడిపోయి సెరెబ్రల్ థ్రోంబసిస్‌కు గురి అయ్యారు. 1953 ఆగష్టులో ఆరోగ్యం తిరిగి వచ్చింది. ది. 25-1-1954 నాటికి ప్రమాద కరమై మరణించారు. వీరికి చరమ దశలో ప్రధాని నెహ్రూ, అధ్యక్షులగు రాజేంద్రప్రసాద్ ఆర్థికంగా సాయం చేయటమే గాక తదితర సౌకర్యాలు ఏర్పాటు చేశారు, వీరు వివిధ తత్త్వాలను జీర్ణించుకున్నా వ్యక్తిత్వాన్ని కోల్పోలేదు. సంఘాన్ని సంస్థలను సృష్టించేది వ్యక్తి. క్రమేపీ సంఘము, సంస్థలు వ్యక్తిని మరుగుకు నెట్టి నిర్వీర్యుని చేస్తాయి. కనుక మానవతా వాదమే యిందుకు తరుణోపాయము.

మహామేధావి, తత్వవేత్త తార్కికుడు ఐనా, నాయకుడుగా విజయాన్ని సాధింప లేకపోయాడు. ఇందుకు కారణం ఆయన మందిలో యిమడలేదు. వ్యక్తిగతంగా ఏకాకి కావటం చేత అనుచరుడుగా సహచరుడుగాను రాణించలేదు. అహంకార, అహం భావములకు అతీతుడుగా ప్రవర్తింప లేకపోయాడు. ఇందుకు తోడు సాంఘిక రాజకీయ వాతావరణం యీయనకు అనుకూలించలేదు. మేధావిగా విత్తనాలు చల్లినా అవి మొలిచి వికసించ లేదు. సమాజానికి, కాలానికి, అతీతంగా ఆలోచించి ప్రవర్తించాడు. సంఘటనల సముచ్చయమే చరిత్ర. ఈయన తీసుకు రాదల్చుకున్న మార్పు తీసుకు రాలేకపోయాడు. కాని ఈయన ధ్యేయము సమగ్ర వ్యక్తిత్వ వికాశము, విప్లవ వాదిగా, మేధావిగా, తత్వవేత్తగా, విజ్ఞాన నిధిగా చరిత్రలో యీయన స్థానము నిరుపమాన మైనది శాశ్వతమైనది.



వచ్చే సంచికనుంచే

## శ్రీ మధురాంతకం నరేంద్ర రాసిన

# "సహగమనం"

## సీరియల్ ప్రారంభం!

# పెద్దలకు మాత్రమే

ఇచ్ఛాపురపు రామచంద్రం

చాలా కాలంనుంచీ నన్నొక సందేహం పట్టి పీడిస్తూంది. అదేమిటంటే మనిషి ఎప్పుడు - ఎన్నేళ్ళకి పెద్దవాడౌతాడా అని. సందేహ నివృత్తి కోసం ఎందరినో అడుగుతూ వొచ్చాను.

"నలభై దాటితే మగవాడు పెద్దవాడైపోయినట్లే లెక్క. ఎందుకంటే" అప్పటికతనికి మనసులో శృంగారమూ, వొంట్లో ఓపికా సూలన పడిపోతాయి." అన్నాడు జీవితానికి శృంగారమే కొలబద్దగా చేసుకున్న ఓ పెద్దమనిషి. "నలభైలో పునర్ యౌవనం ఆవిర్భవిస్తుందంటారు కదా" అంటూ నేనతని మాటలను ఖండించలేదు. ఎందుకంటే- నాకు కావలసింది విషయం కాని వాదన ఎంత మాత్రమూ కాదు.

మరొక పెద్దవారి నడిగాను నా మనసులోని సంశయం.

"చిక్కు ప్రశ్నేనోయ్. రహస్యం చెప్పేసేదా !" అన్నాడాయన కొంటెగా చిరునవ్వు నవ్వుతూ.

"సెలవివ్వండి దయచేసి" అన్నాను వినయంగా.

"ఏమనిషీ - తన దృష్టిలో తానెన్నటికీ పెద్దవాడు కాడు పెద్దవాడు కావడమనేది- మనిషికి- తప్పు చేసినట్లో, శిక్ష అనుభవించడంలాగో అనిపిస్తుంది. అందుకు" అన్నాడాయన గంభీర వదనంతో.

వారి మాటలలో నిజం లేకపోలేదనిపించింది కాని.... పెద్దల మాటను ధిక్కరించటం కాదుకానీ.. ఆయన వాక్రుచ్చిన దానిలో అబద్ధమూ లేకపోలేదేమో అనిపించింది.

పట్టువదలని విక్రమార్కుడిలా నేను నా ప్రశ్నకు నాకు నచ్చే జవాబు కోసం ప్రయత్నించడం మాత్రం మానలేదు.

"భార్య ఉండగా భర్త పెద్దవాడు కాడోయ్. ఎందుకంటే సరస శృంగార వేళల ఆమె అతన్ని- 'మీకేం, బాలాకుమారులు' అంటూ ఉంటుంది అతనికి పళ్ళూడిపోయినా, తల పండిపోయినా." అని వొకరంటే;

"షష్టిపూర్తిని వృద్ధాప్యానికి- ఆదే - పెద్దరికానికి ప్రారంభంగా భావించవొచ్చునోయ్" అన్నారు మరొకరు.

కొందరరవై అంటే- మరి కొందరు ఏభై ఎనిమిదన్నారు. ఏభై ఐదన్న వారూ ఉన్నారు. వీళ్ళందరూ - ప్రభుత్వం నిర్ణయించిన పదవీ విరమణ వయస్సుని పెద్దరికంగా భావించి చెప్పినవారు. నాకు సంతృప్తి కలగలేదు.

నామట్టుకు నాకు- నేను కిందటి సంవత్సరం చిన్నవాడిననిపిస్తుంది. పుట్టిన రోజున మా ఆవిడ తలంటుపోస్తూ నా వయసు గుర్తుచేస్తూంటే. నాకు నలభై ఐదు



వొస్తే- నలభై నాలుగు చిన్న వయసనిపించింది. ఏభై రెండు వొస్తే- ఏభై వొకటి చిన్న వయసనిపించింది. అందుకే- నేను- ఏండిన సంవత్సరాలనే తప్పు వొచ్చిన యేళ్ళను చెప్పను. ఇది బలహీనత అని ఆత్మ వంచనమీ నాకూ తెలుసు. కాని యీ విషయంలో నన్ను నేను జయించుకోలేక పోయాననే వొప్పుకోవాలి.

పుట్టెకు పుట్టిన బుద్ధిలాగే మనసుకి పట్టిన సందేహమూ, తీరే వరకూ వొదలదు కదా.

పుస్తకాలను.... పెద్దలను.... పిన్నలను.... ఎందరినో అర్థించాను నా ప్రశ్నకు బదులేదని.

పుస్తకాలూ, వారూ జవాబు చెప్పలేదని కాదు; చెప్పాయి. చెప్పారు. కాని ఆ జవాబులలో ఏ ఒక్కటి నాకు నచ్చలేదు. అదీబాధ. మానవ బలహీనతే అది మరి. జవాబు దొరికితే చాలదు. అది మన మనసుకి నచ్చాలి. అంత వరకూ అన్వేషణే. తప్పదు.

* * *

ఆడవాళ్ళకి పుట్టినిల్లు మెట్టినిల్లు లాగే మగవాడికీ రెండిళ్ళుండవచ్చు మొదటిది జన్మభూమి(పుట్టినవూరు). రెండవది జాబు భూమి(ఉద్యోగం చేసేవూరు). బదిలీ మూలంగా నా ఉద్యోగం వూరు మారింది. కొత్తవూరు చాలా విధాల పాత వూరిలాగే ఉన్నా యీ వూరికొక ప్రత్యేకత వుంది. అదేమిటంటే- క్లబ్బు. ఈ క్లబ్బులో ప్రత్యేకమయిన ప్రత్యేకత ఉంది. ఒక వంక పేకాట.... మరో వంక టేబుల్ టెన్నిస్ .... ఓ గదిలో క్యారమ్స్.... అపక్కన చదరంగం....

ఎవరికేం కావాలంటే అది.... ఏ వినోదానికావినోదానికి ఇతరులతో సంబంధం లేకుండా కేటాయింపుగా గదులు. ఆరుబయట - దూరంగా టెన్నిస్ కోర్టు. ఇవ తలగా- న్యూస్ పేపర్లు. చిన్న గచ్చు వేదిక. పెద్దవాళ్లు ఆ గచ్చు వేదిక వద్ద కుర్చీలు వేయించుకుని.... వేదిక మీదకు కాళ్ళు జాచి .... పేపరు పఠనమూ.... కబుర్లూ . ఇక్కడంతా ఏభై దాటినవారే. ఇదో గ్రూపు. నేనూ దీనిలోనే చేరాను మొదటి రోజే—

ఆయన నన్నాకర్షించేరు. ఆయనపేరు మాధవరావ్‌ట. నిమ్మపండు రంగు. పొట్టి పొడవు కాని విగ్రహం. తిల తండులాలు కలబోసినట్లు పండీ పండని జుత్తు. ముఖ్యంగా ఆయన మాటలు. ఎంతో సరదాగా, ఉత్సాహంగా.... క్షణం విరామం యివ్వకుండా... అందరినీ ఆకట్టుకుంటూ.... నవ్విస్తూ.... నవ్వేస్తూ.... యీ వృద్ధులమధ్య....కొంగలలో హంసలాగ ప్రత్యేకంగా గోచరించారు నా కంటికి....

మెల్లగా పరిచయం సంపాదించాను. స్నేహం పెంచాను.ఆయన ప్రవర్తనలో ఏమీ మార్పులేదు. సాయంత్రమయ్యేసరికి క్లబ్బుకి రావడం... ఉత్సాహంగా ఉల్లాసంగా కబుర్లు చెప్పటం....నవ్వులు కురిపించడం.... చీకటి పడేసరికి మేమంతా యిళ్ళకి వెళ్ళిపోగా తానేమో ఓగంట పేకాటాడుకుని యింటి ముఖం పట్టడం.

స్నేహం కొంచెం ముదిరాక అడిగాను. "మీరు యింత ఉత్సాహంగా కుర్రాళ్ళకంటె కుర్రాడిగా ఉంటారే.... మరి - యీ ముసలివాళ్ళ మధ్య కెందుకు వొస్తారు ?"

ఆయన- నవ్వేశాడు.... "నిజమే. నేను చిన్నవాణ్ణే. కాని...." ఏదో చెప్ప బోయి అంతలోనే మానేసుకున్నట్లు ఆగి — "అదంతేలే..." అని తేల్చి వొది లేశారు.




నేను మాత్రం వొదిలెయ్యలేదు.

ఎందుకో— నా ప్రశ్న కీయనవద్దే జవాబు దొరకవచ్చునని నా అంతరాత్మ మరీమరీ చెప్పింది.

నిరీక్షిస్తున్నాను.

నెలలు గడిచాయి.... కార్యక్రమంలో ....క్లబ్బులో సాయంత్రాలలో ఏమీ మార్పు లేకుండానే.

హటాత్తుగా... ఆ సాయంకాలం.... మా గచ్చువేదిక బోసిపోయింది. నా మిత్రులు మాధవరావుగారు- రాలేదు.

ఆవేళేకాదు... మరో పన్నెండు రోజులవరకూ ఆయన క్లబ్బుకి రాలేదు

మేమంతా.... ఎవరికివాళ్ళం.... మన్నుతిన్న పాముల్లా... నిరుత్సాహంగా...






నిశ్చైతన్యంగా.... స్తబ్దుగా.... గడిపాం. మాధవరావ్‌గారు లేరు. మా గ్రూప్‌కి జీవకళా లేదు.

ఏమయిందాయనకి ?

ఎందుకు రాలేదు ?

ఎవరికి తెలియదు. ఆయనది- రెండుమైళ్ళ దూరంలోని పల్లెటూరు. వెళ్ళి కనుక్కొనేవారు లేకపోయారు. అందుచేత ఆయన కబుర్లు తెలియలేదు.

ఇవేళ కూడ చూసి.... ఆయన రాకపోతే- రేపాదివారమే కనుక నేనే వారి వూరు వెళదామని నిశ్చయించుకున్నాను, క్లబ్బులో అడుగుపెడుతూ.

ఇంకా ఎవరు రాలేదు. కుర్చీ వేయించుకుని ఒంటరిగా కూర్చుని.... క్లబ్బు గేటువేపు చూస్తున్నాను. ఇవాళైనా- మాధవరావుగారు- ఎప్పటిలా- తెల్ల లాల్చీ వేసుకుని.... గ్లాస్కోపంచె కట్టుకుని.... యువకుడిలా.... చకచక.... చరచర.... చెప్పులు చప్పుడు చేసుకుంటూ.... నవ్వుతూ.... వొచ్చి పలకరిస్తారేమో అని ఆశ. పలకరించాలన్న కోరిక.

ఐదు నిమిషాలు గడిచాయేమో.

గేటుముందు రిక్షా ఆగింది. ఆశ్చర్యపోయాను. సాధారణంగా మా క్లబ్బు ముందర రిక్షాలాగవు. ఆగినా- దానిలోంచి దిగినవారు మావేపు రారు. పేకాట గది వేపు పోతారు.

ఎవరో వృద్ధుడు.

తలంతా ముగ్గుబుట్ట. చర్మమంతా ముడతలుపడి.... నడుమువొంగి... నడవలేక నడవలేక నడుస్తూ.... కర్ర పట్టుకుని...

ఎవరీయన ?

ఇంత పండు ముసలికి క్లబ్బులో ఏంపని ? ఏ మనవడికోసమో, కొడుకు కోసమో వస్తున్నారేమో.

ఆయనకి నడక శ్రమ తగ్గించి.... కావలసినమాట చెబుదామని.... ఎదురు వెళ్ళాను.

తలవొంచుకుని.... నేలమీదేచూస్తూ.... నడుస్తున్నారు ఆయన. శరీరం- వళ్లూ.... కమిలిపోయి.... ముడతలుపడి ఉంది.

"ఎవరుకావాలి తాతగారు ? ఏం కావాలి ?" అడిగాను.

ఆయన.... ఒక్కసారి.... శక్తిని కూడగట్టుకుని.... తలెత్తి.... కళ్ళద్దాలు పడిపోకుండా సవరించుకుని వొణుకుతున్న గొంతుతో.... బాధగా.... పెన్నిధి కోల్పోయిన పేదకంటె దీనంగా.... మెల్లగా అన్నారు- కళ్ళల్లో నీళ్ళతో "నేనోయ్ మాధవరావుని"

నివ్వెరపోయాను.

నేను చూస్తున్నది.... వింటున్నది.... నిజమేనా అనిపించింది. నమ్మలేక పోతున్నాను. ఒక మనిషిలో.... మాధవరావుగారివంటి మనిషిలో.... కేవలం పదిహేను రోజులలో- యింత మార్పు.... మనిషినే గుర్తుపట్టనివ్వనంత మార్పు- సాధ్యమేనా ? సంభవమేనా ?

అయితే... యింతమార్పుకి- కారణమేమై ఉండాలి ?

"జబ్బు చేసిందా ? మీ గురించి ఏమీ తెలియలేదిన్నాళ్లూ...." ఆర్ద్ర హృదయంతో పరామర్శించి- ఆయనకు ఆసరాగా చేయి అందించాను.

"జబ్బు కాదోయ్. నాకు జబ్బేమిటి ? అంతకంటే భయంకరమైనదే. విపత్కరమైనదే...." ఆయన కంఠం వొణికిపోతూంది.

తీసుకువెళ్ళి.... కుర్చీలో కూర్చోబెట్టి.... మంచినీళ్ళందించి.... అప్పుడడి గాను మెల్లగా. ఏం "జరిగిందండీ అసలు ? "

ఆయనొకసారి ఆకాశంవేపు చూశారు.

"నేను పెద్దవాడినై పోయానోయ్.... అంటే.... అదే నేను.... కావాలని కాలేదు.... మా అమ్మ నన్ను హటాత్తుగా పెద్దవాణ్ని చేసేసింది."

నాకేమీ అర్థం కాలేదు వారి మాటలు. అది గ్రహించినట్లే అన్నారు వారు. "ఎప్పుడో అడిగావు కదూ, మనిషినిజంగా ఎప్పుడు పెద్దవాడౌతాడని ! ...."

"....ఊఁ ...."

"అమ్మ చనిపోతే ఔతాడోయ్. మా అమ్మ చనిపోయింది. ఆక్షణం నుంచే నేను పెద్దవాడినయ్యాను.... చూస్తున్నావుగా...."

అవాక్కయి పోయాను.

ఆయనను చూస్తూంటే ఆయన నిగ్గు తేల్చిన విజ్ఞానాన్ని తన మీదే సోదాహరణగా నిరూపిస్తూంటే— ఇంకేమనగలను ?

నిజమే అనిపించింది.

మనిషి— వయసు వల్ల పెద్దవాడు కాడు. అమ్మ ఉన్నంత కాలం ఆ అదృష్టవంతుడు చిన్నవాడే ఎంత వయసు వచ్చినా వొంటి మీదకి !

# ఆకాశనేత్రం

## "శిఖామణి"

వృక్షాలు చీకటి దుప్పట్లు కప్పుకుని
శీతా కాలపు నిద్రలా మత్తుగా నిద్రపోతుంటాయి.
అప్పుడప్పుడూ ఆవేశం పట్టలేక వేగంగా వచ్చి
భుజాలు పట్టుకుని కుదిపేసినట్టు ఊపేస్తుంది గాలి
మళ్ళీ కునకబోతుంటాయి చెట్లు
ఇంతలో పండుటాకులు రాలిన శబ్దానికి ఉలిక్కిపడ్తాయి.
మళ్ళీ నిద్ర—
అందమైన కల కంటూ ఉండగా
రెండు పక్షులు రెక్కలు టపటపా కొట్టుకుంటాయి
కల చెదరిపోతుంది.
బయట ఎవరో తలుపు తట్టినట్టు
వడ్రంగి పిట్ట టక్ టక్‌మని కొడుతుంది
బెరడు కన్నువిప్పి చూస్తుంది చెట్టు
చీకటితప్ప ఏం కనిపించదు.
ఇంకా తెల్లవారక మునుపే
పక్షిగడియారాలు ఆగకుండా కూతల అలారాలు మ్రోగిస్తాయి
బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటాయి చెట్లు.
పక్షుల రూపంలో బద్ధకం చెట్లమీది నుంచి ఎగిరిపోతుంది.
మంచు బిందువుల పళ్ళపొడితో
కొమ్మలపిల్లలు చిగురులపళ్ళు తోమేసుకుని
ఆకలితో తూర్పువంక ఆశగా చూస్తాయి
వస్తూనే ప్రతి ఆకుకు ఆకలి తీరుస్తాడు సూర్యుడు.
స్నానాలగదిలో స్నానంచేస్తూ కూనిరాగం తీసినట్లు
పువ్వుగా విచ్చుకుంటున్న మల్లెమొగ్గ
తనలో తాను పరిమళపు పాట పాడుకుంటుంది.
పడక వేర్పుకుంటున్న పసిపిల్లాడు
రెండడుగులు వేసి బోర్లా పడిపోయినట్లు
భూమ్మీదపడ్డ మొట్టమొదటి సూర్యకిరణం
ఛల్లున చిట్లిపోయి, ఆ ముక్కలు
మధ్యాహ్నానికల్లా భూమంతా వ్యాపించి
చురుకు చురుక్కున గుచ్చుకుంటాయి
కనుబొమల వృక్షాలకు
కలల దుప్పట్లు కప్పుకుని
నేత్రఫలాలు వేలాడుతూ నిద్రపోతుంటాయి
చిరుగాలికే పండుటాకు రాలినట్లు
చిన్న అలికిడికే విచ్చుకుంటుంది కన్ను.
తెల్లనికాంతి కిరణం గాజుపట్టకాన్ని కావలించుకుని
సప్తవర్ణాల్ని వెదజల్లినట్లు
ఒక వెలుగురేఖ నాకంటి రెటీనాపై
ఫొటోకోసం కూర్చున్నట్టు కూర్చుంటుంది.
అప్పుడు లోకమంతా కన్నులో ప్రతిఫలించి
కన్నే ఆకాశమైపోతుంది.
ఊలోగా సర్కస్‌లో మాదిరిగా
మండుతున్న వలయాకారపు పెదవుల మధ్య నుండి
గాలివీరుడు సాహసంగా దూసుకువస్తాడు.
అప్పుడు. రెండు కళ్ళలోనూ
రెండు సముద్రాలు గిర్రున తిరుగుతాయి.
రెప్పవాల్చానా — కన్నీరు బొట్లు బొట్లుగా రాలి
లోకాన్ని ముంచెత్తుతాయి.
అందుకే నా నేత్రానికి
రెప్ప వేయడం కాని
మూతపడడంకాని లేనేలేదు—

# మా వూరు

## డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

వరిచేల పట్టుపుట్టం కట్టుకొని
సిరిసంపదల ఆభరణాలు పెట్టుకొని
చెఱకు తోటల జిలుగు దుప్పటి కప్పుకొని
నిత్య కల్యాణం పచ్చతోరణంగా హొయలు చూపుతూ
కన్నతల్లి కళ్ళలోని చల్లని ప్రేమలా ఉంది మావూరు!

దాయాదుల పగలతో
కుల ద్వేషాల పొగలతో
గ్రామ కక్షల గచ్చ పొదలతో
బోదెగట్ల నీటి తగాదాలలో చిట్లిన తలల నెత్తుటి మరకలతో
పేదరికపు పెంట కుప్పలతో
మాల మాదిగల ఆకలి డప్పులతో
నిరక్షరాస్యపు పుట్టలతో
అంటరానితనం వేప రొట్టలతో
గ్రామదేవత సంచారంతో
దేవదాసీ వ్యభిచారంతో
అంకాళమ్మ జాతరలో నరికిన దున్నపోతు మెడలావుంది
మావూరుకి
తాటిపండ్ల ఈగలతో
ఊర చెఱువు దోమలతో
పురుషుల బుడ్డలతో
స్త్రీల బోదకాళ్ళతో
మురికి కూపాలతో
బ్రతుకు శాపాలతో
పొలిమేరల బహిర్భూముల
ప్రజామార్గ పార్శ్వాల
పాకీ కూప నదీ తీరాల వికసించే
పరమాసహ్య ఉదయ సంధ్యా దృశ్యాలతో
పెద్దరోగం వచ్చిన బిచ్చగత్తె ముందుకు చాచిన
వ్రేళ్ళు రాలిపోయిన మొండిచెయ్యిలావుంది మావూరు!!
అయినాసరే మావూరును నేనెంతో ప్రేమిస్తాను
అందమైన పగలాడి పెళ్ళాన్నివదలలేని ముసలిమొగుడులాగ!




(గతసంచిక తరువాయి)

## 19

జగదీశ్వరమ్మలో రానురాను అశాంతి, ఆందోళనలు ఎక్కువైపోతున్నాయి. కారణం — ఈ మధ్యకాలంలో హేమంత్ వ్యవహరిస్తున్నతీరు — ఎక్కడ తిరుగుతున్నాడో, ఏం చేస్తున్నాడో — బొత్తిగా ఇంటికి రావటంలేదు. వచ్చినవాడు కాసేపు కూర్చున్నా - ఏమిటో తీవ్రంగా బాధపడుతున్నట్లు కనిపిస్తాడు.

ఏమిటి వాడిలోని బాధ ?.... రజనిని గురించేనా ?.... కాకపోవచ్చు.... రజని అంటే వాడు నిరాశచేసుకొని చాలాకాలమైంది. దాన్ని గురించిన ఆలోచన వాడిలో చోటుచేసుకోవటమూ అసంభవమే....మరి దేన్ని గురించి - కృంగిపోతున్నట్లు ?

భగవంతుడు తమకు తరగని ఆస్తి ఇచ్చాడు. పరప్రసాదంగా ఓ కొడుకునూ ఇచ్చాడు.... కానీ, తనకు మనశ్శాంతి నివ్వక పోయాడేం ?— ఇలా పరితపిస్తూంటుంది ఆవిడ అస్తమానమూను.

అలాగే ఆవేళ ఉదయమూ - వంట చేసే పనికూడా మరిచిపోయి హాల్లో కూర్చొని ఆలోచిస్తోంది జగదీశ్వరమ్మ.

అదే సమయంలో ఓ యువతి చొరవగా లోపలికివచ్చి "జగదీశ్వరమ్మగారంటే మీరేనా, పెద్దమ్మగారూ ?" అని అడిగింది.

ఆమె మాటలకు ఉలిక్కిపడ్డట్లై అటు చూసింది జగదీశ్వరమ్మ తలెత్తి - చాలా ఆశ్చర్యంగానూ.

"నేనే....మీ దేవూరు ?.... ఏం పనిమీదవచ్చావ్ ? కొంచెం చిరాకుపడుతూ అడిగింది.

"మాది హైద్రాబాదండీ....రజని నా స్నేహితురాలే...." అంది.

హైద్రాబాద్...రజని మాట ఎత్తేసరికి జగదీశ్వరమ్మ మనసు ప్రఫుల్లమైంది

"అలాగా !.... వచ్చి కూర్చో అమ్మా....ఇంతకూ నీ పేరేమిటో చెప్పలేదు ?" అంది.

"కళ్యాణి....ప్రత్యేకించి రజనే పంపింది నన్ను....తన మనసులోని మాట మీకే చెప్పమంది....మీ అబ్బాయి హేమంత్‌గారు ఇంట్లో లేరుకదండీ ?" —అని అడిగింది అనుమానంగా అటూ ఇటూ చూస్తూ.

"లేడులే....నువ్వు చెప్పదలుచుకున్నదేమిటో చెప్పమ్మా....అయ్యో, నా మతిమండా అంత దూరంనుంచీ ప్రయాణం చేసివచ్చావు....కనీసం మంచినీళ్ళు కావాలా అని కూడా అడగలేదు...."

"అవేం అక్కరలేదులెండి పెద్దమ్మగారూ....మాకు ఈ పక్క పట్నంలో బంధువులు ఉన్నారులెండి....రాత్రి వచ్చి వాళ్ళింట్లోనే దిగాను....కాఫీ టిఫిన్ అన్నీ అక్కడే పూర్తిచేసుకొని వచ్చాను లెండి..." అంటూ అసలు విషయం చెప్పకొచ్చింది కళ్యాణి - తన ప్లాను ప్రకారం.

కళ్యాణిది హైద్రాబాద్ కాదనీ, ఆమె తన చెల్లెలు కూతురేననీ తెలియదు జగదీశ్వరమ్మకు.... శ్రీలక్ష్మికి ఓ ఆడపిల్ల, మగపిల్లడని తెలుసు కాని—వాళ్ళ పేర్లు, వయసులు తెలియవు. చెల్లెలి మీది అక్కసుతో అలాంటి వివరాలు తెలుసుకొనే ప్రయత్నమే చేసెరగదు ఆవిడ.

* * *

ఆ రాత్రి ఇంటి మీద గాలి మళ్ళి పట్నంనుంచీ రామానగరం బయలుదేరాడు హేమంత్. తల్లికి కనిపించక అప్పుడే నాలుగురోజులైంది....అదీ కాకుండా జేబులోడబ్బు అయిపోయింది. అమ్మను చూసినట్లూ ఉంటుంది. అవసరమైన డబ్బు అడిగి తీసుకోవచ్చు - రెండు విధాలుగా ఆలోచించి ఇంటికి వచ్చాడు.

తీరాచూస్తే - ఇంటికి తాళం పెట్టిఉంది. అదిరిపోయాడు హేమంత్.

"బాబుగారూ !....ఉదయం హైదరాబాద్ నుంచీ ఎవరో అమ్మాయిగారు వచ్చి అమ్మగారికి ఏమిటో చెప్పారు....ఆ అమ్మాయిగారు వచ్చిన కాసేపటికే ఎళ్ళిపోయింది.... ఎందుకొరకో అమ్మగారు మధ్యాహ్నం ఉన్నట్లుండి హైదరాబాద్ ప్రయాణం అన్నారు—వార్ని నేనే బస్సెక్కించి వచ్చాను....మీరొస్తే తాళాలు ఇచ్చి, ఆ విషయం చెప్పమన్నారు" అంటూ తన బొడ్లో ఉన్న తాళాల గుత్తి తీసి హేమంత్‌కు ఇచ్చాడు నౌకరు కొండయ్య.

"అలాగా !" అని—ఆలోచిస్తూ వెళ్ళి యధాలాపంగా తలుపులు తీశాడు హేమంత్.

హైద్రాబాద్ నుంచీ వచ్చిన అమ్మాయి ఎవరు ?.... అమ్మకు ఆమె ఏం చెప్పిఉంటుంది ?.... ఇదీ రామచంద్రరావు మామయ్య ఆడుతున్ననాటకమే. తను వాళ్ళ మాట వినడని తెలిసి—తల్లికి ఏవో కల్లబొల్లి మాటలు చెప్పి—ఆమె ద్వారా ఏవైనా సాధిద్దామనుకుంటున్నారేమో ? కావచ్చు....కానీ, తను మాత్రం ఇంకా వెనకటి అమాయకస్థితిలో లేడని - వాళ్ళకు అర్థం కాలేదేమో ?

....వెళ్ళనీ....అమ్మకూ తెలిసివస్తుంది వాళ్ళనైజం...రజనిలో మార్పు వచ్చినట్లు మామయ్య చెబుతున్నాడు...అదెంతవరకు నిజమో అమ్మే అర్థంచేసుకొంటుంది అనుభవపూర్వకంగా ....కరుడుకట్టిన రజని పాషాణహృదయం కరగడం—అంతసులభమా ?....

...నిజానికి కళ్యాణి ఎంత పనిచేసింది ?....'నిజమేమిటో శారదకు తెలియ చెప్పేస్తున్నా నన్నయ్యా' అని ముందుగా తనకు మాట మాత్రమైనా చెప్పకుండా వెళ్ళి పుసపుస చెప్పేసి— వాతావరణాన్ని కలుషితం చేసింది....ఇప్పుడు శారద తన ముఖం చూడటానికి ఇష్టపడటం లేదు. ఆమెను చూడందే ఉండలేకపోతున్నాడు తను... వాళ్ళ నాన్నగారు పోయినప్పుడు...తను పరామర్శించటానికి వెళ్ళినరోజు శారద వ్యవహరించిన తీరును తను మరచిపోలేకుండా ఉన్నాడు. ....ఇపుడు శారద పౌరుషంగా ఉద్యోగం కూడా చేస్తోందని విన్నాడు.

...తనకు శారద కావాలి. ఆమెను ఒంటరిగా కలుసుకొని క్షమాపణ చెప్పుకోవాలి... ఇంత జరిగాక తిరిగి శారద తన్ని నమ్ముతుందా ?... ఆమెకు తనమీద నమ్మకం కలగటం కోసం ఏమైనా చేయాలి.... ఏం చేయాలి ?.... తనకు శారద కావాలి...ఆమెను పొందటం ఎలా ?...

...స్వంత చెల్లెలికన్నా మిన్నగా చూసుకుంటుంటే — ఆ అన్నయ్యనే పిచ్చివాడిగా మార్చాలని చూసింది కళ్యాణి...'కళ్యాణీ....అంతా నువ్వు చేసిందే !

—ఆలోచనలతు, ఆవేశానికి తట్టుకోలేక—పట్నంనుంచీ ప్రత్యేకించి తెచ్చుకున్న విస్కీబాటిల్‌ను ఖాళీచేయటం మొదలు పెట్టాడు - ఆ ఇంత ఇంట్లో ఒంటరిగా మిగిలిన హేమంత్. పనివాడు కొండయ్య బయట వరండాలో పడుకొని-అప్పుడే నిద్రలోకి జారుకున్నాడు.

* * *

"మొత్తానికి మన ప్లాను ప్రకారమే జరిగి పోయింది ప్రసాద్‌గారూ...నాది హైదరాబాద్ అనీ, రజని స్నేహితురాలనీ - తేలిగ్గానే నమ్మేసిందిపెద్దమ్మ... రజనిలో వచ్చిన పరిమార్పును గురించి నేను చెప్పింది శ్రద్ధగావిన్నది... 'సరే. నీ మాట మీద ఈ ఒక్కసారీ హైదరాబాద్ వెళ్తాను — ఈ సారి మాత్రం తాడోపేడో తేల్చుకు వచ్చేస్తాను....మా హేమంత్ మానసికంగా కృంగిపోవటాన్ని నేనూ చూడలేకుండా ఉన్నాను...ఏదో ఒక నిర్ణయానికి రావటం మాకూ అవసరమే' అంది. 'మంచిది పెద్దమ్మగారూ....రజనిలో పరిమార్పే నిజమైతే మీరు నేను చెప్పినట్లు నడుచుకోవాలి ! అని ఆఖరకు చెప్పవలసింది చెప్పి వచ్చేశాను... బహుశా పెద్దమ్మ హైదరాబాద్ వెళ్ళేఉంటుంది ఈ పాటికి" అంటూ మర్నాడు వివరంగా చెప్పుకొచ్చింది కళ్యాణి.

"అలాగా !.... అయితే రజని విషయంలో మీ పెద్దమ్మ సంతృప్తి చెందటం ఖాయం....హేమంత్, రజని కలిసి పోయినట్లే ఇక... అయితే.... పాపం, శారదకే అన్యాయం జరిగిపోతోంది. ఇంకా మనం ఆమెను మభ్యపరచటంలో ఔచిత్యం లేదు కళ్యాణీ....మూర్తికూడా వేరే అమ్మాయిని పెళ్ళాడబోతున్నానని చెప్పాడు . . ." అంటూ కొంచెం ఆవేదన పడ్డాడు ప్రసాద్.



"నిజమేనండీ ... అన్నయ్య తనని పెళ్ళాడక పోవటానికి పెద్దమ్మ కారణ మనుకొంటోందే తప్పితే దానికి అసలు సంగతి తెలియదు ... మనం నిజం దాచి నందువల్ల అది ఇంకా నష్టపోయే అవకాశంఉంది ... మరి కొంత కాలానికైనా పెద్దమ్మ కొడుకుమాటవిని, తనని చేసుకోవటానికి అన్నయ్యకు అనుమతిస్తుందే మోనని లోలోపల ఆశ కొట్టుకులాడుతూనే ఉంటుంది దానికి ... అలా కాకుండా ఉన్నయదార్థాన్ని చెప్పేస్తే - తన భవిష్యత్తును నిర్ణయించుకొనే అవకాశాన్ని మనం కల్పించి నట్లౌతుంది శారదకు.. నిష్ఠూరమే అయినా నిజం చెప్పేస్తాను దానికి" అంది కళ్యాణి ఒ నిశ్చయానికి వచ్చినట్లు.

## 20

ఆవేళ మధ్యాహ్నం ఇంట్లో ఒంటరిగా ఉంది శారద... తమ్ముడు, చెల్లాయి ఎటో ఆటలకని వెళ్ళారు. తల్లి మూర్తి వాళ్ళ ఇంటికి వెళ్ళింది. పెళ్ళి పనులలో రాజమ్మత్తయ్యకు సహాయపడటానికి... ఆదివారం కాబట్టి ఆఫీసుకు వెళ్ళేపనేలేదు.

'జాగ్రత్త' అని చెప్పి తల్లి వెళ్ళింది మొదలు-శారద కూర్చున్న చోటు నుంచి లేవనేలేదు. మనసు ఒక ఆలోచనల పుట్ట అయింది... తనకు హేమంత్ మనసులో చోటు దొరికిందని తెలిసినప్పట్నుంచీ ఎన్నో ఆశాసౌధాలు నిర్మించు కొంది ఆమె.. అతణ్ణి పెళ్లాడితే తనకు ఈ పేదరికంనుంచి విముక్తి దొరుకు తుందనీ, ఓ లక్షాధికారికి ఇల్లాలిగా సంఘంలో సగర్వంగా తిరగ గలుగుతుందని- సర్వవిధాల తను సుఖపడటమే కాకుండా పేదరికంలో మగ్గుతున్న తన వాళ్ళకు కూడ ఇంత సహాయపడితే - వాళ్ళు కొంచెం అభివృద్ధిలోకి వస్తారని - ఎన్నో విధాలుగా కలలుకన్నది. తనవంటి అదృష్టవంతురాలు ఈ భూమ్మీద ఉండదేమోనని గర్వపడింది... అయితే చివరికి జరిగిందేమిటి ?... 'నీ దరిద్రపు మొఖానికి అంతటి ఉచ్చదశ ఎలా ప్రాప్తిస్తుంది ?' అన్నట్లు మారిపోయాయి పరిస్థితులు... తనని ఆకట్టుకోవటంలో, వాగ్దానాలు చేయటంలో ప్రదర్శించిన ధైర్యం, తెంపు-తల్లి విష యంలో ప్రదర్శించలేకపోయాడు హేమంత్. అతడంతటి పిరికివాడనుకొంటే తను ఆకర్షణలకు లొంగేదేకాదు.

మూర్తికి తనంటే ఇష్టమే. అయితే తనే అతణ్ణి తృణీకరించింది... చివరికి మూర్తి తన ఆశలు నెరవేరవని మనసును గట్టిచేసుకొనే - వేరే వివాహానికి అంగీ కరించాడు... హేమంత్ తనను వివాహమాడే విషయంలో తల ఎత్తిన వ్యతిరేక పరిస్థితులగురించి అతడికి తెలియదు.., తెలిస్తే... పెళ్ళి ముహూర్తాన్ని మరికొంత కాలం వాయిదావేయమని అవతలవాళ్ళకు చెప్పేసేవాడేమో ?...

...ఇప్పటికైనా తనని వివాహమాడే విషయంలో - తల్లిని ఒప్పించి లేకపోతే ఆమెను ఎదిరించి వస్తే బావుణ్ణు హేమంత్... అదృష్టం బావుంటే చివరికి అలాగే జరుగుతుందేమో ? తండ్రి పోయిన దిగులులో - ఆనాడు అతణ్ణి అనవసరంగా మాటలన్నది... అవన్నీ మనసులో పెట్టుకోడుకద ?...

—అలా ఆలోచించుకుపోతున్న శారదకు, నిశ్శబ్దంగా లోపలికివచ్చిన కళ్యాణి కనిపించింది.

కళ్యాణి కనపడగానే, ఆమెను హేమంతే రాయబారం పంపాడేమోనన్న ఆశ తళుక్కుమన్నది శారద మనసులో. అయినా పైకి పొక్కకుండా,

"రావే కళ్యాణీ.... వచ్చి కూర్చో" అంటూ తన పక్కన చోటిచ్చింది కళ్యాణికి.

"శారదా ! .... నన్ను క్షమిస్తానంటే — నీకో ముఖ్య విషయం చెబుతాను" అంది కళ్యాణి కొద్ది సేపటి తర్వాత... కళ్యాణి వాలకం చూశాక ఊపిరాడనట్లు శారద

"నీకూ, నాకూ మధ్య క్షమాపణలేమిటి గాని— ఆ చెప్పదలుచుకున్న విషయమేమిటో చెప్పెయ్.... నువ్వేం చెప్పినా నామనసు చలించదులేవే. అది బండ బారిపోయి చాలా రోజులైంది" అంది.

".... శారదా.... ఈనాడు నీ పరిస్థితి ఇలా మారటానికి కారకురాల్ని నేనేనే.... ప్రాణస్నేహితురాలివని చూడకుండా నీకు ద్రోహం చేయ తలపెట్టాను.... అంతా స్వయంకృతాపరాధం అని నేను అనలేను— అయితే పరిస్థితులు నాచేత అలా చేయించాయి.... "అంటూ హేమంత్‌కు పెళ్ళైనతీరు, అతడి విషయం రజని ప్రవర్తించిన విధానం— తర్వాత రామచంద్రరావు హేమంత్‌కు కల్పించిన స్వేచ్ఛ— తను ఏ పరిస్థితిలో నిజం దాచిపెట్టిందీ, చివరికి ఏం నాటకం ఆడి హేమంత్‌ను, శారదను వేరు చేసిందీ వివరంగా చెప్పింది.

"ఎంత నమ్మదగ్గ వ్యక్తి అయినా ప్రసాద్‌గారు రజనిలో పరిమార్పు వచ్చి నట్లు చెప్పినా నమ్మలేదు .... అన్నయ్యను నిన్ను, తాత్కాలికంగా కలుసు కోకుండా చేయాలన్న మొదట్లో నాఉద్దేశ్యం.... అన్నయ్య చెప్పినదాన్ని బట్టి— రజనిలో ఈ జీవితంలో మార్పు వస్తుందని నేను అనుకోలేదు. చివరిగా ఆమె విషయం. రూఢి చేసుకొన్న తర్వాత— మీ ఇద్దర్నీ తిరిగి ఒకటి చేయాలన్నదే నా సంకల్పం.... అయితే.... ఇదుగో ఈ ఉత్తరం చదివాక రజనిలో మార్పు వచ్చిందన్న నిజం రుజువైంది .... చూడు.... రజని ఆంతర్యం నీకూ బోధ పడుతుంది"— అంటూ తను కావాలని తెచ్చిన— ప్రసాద్‌కు రజని రాసిన ఉత్తరాన్ని శారదకు ఇచ్చింది కళ్యాణి.

దాన్ని అప్రయత్నంగానే చదివింది శారద ... రజని దానిలో రాసిన 'నూతన దంపతులు కాబోతున్న హేమంత్, శారదలకు నా శుభాకాంక్షలు తెలుపు, అన్న వాక్యాన్ని ఒకటికి రెండుసార్లు చదివిన శారదకు కనులు మెరిశాయి .... తప్పితే పైకి ఎలాంటి వ్యాఖ్యానం చేయకుండా - ఆ ఉత్తరాన్ని తిరిగి కళ్యాణికిచ్చి వేసింది.

".... ఇకనైనా నన్ను మన్నించు శారదా... నన్ను క్షమించానని చెప్పవే" అంటూ కన్నీటి పర్యంతమై శారద రెండు చేతులూ పట్టుకొంది కళ్యాణి.

'జరిగిన దానిలో ఎవరి తప్పూలేదు.... అంతా విధి ఆడిన నాటకం.... నా అత్యాశే చివరికి నన్ను మోసం చేసింది. అంతేనే.... అటువంటప్పుడు నువ్వు నన్ను క్షమించమనడంలో అర్థంలేదు. కళ్యాణీ" — అంటున్నప్పుడు శారద కంఠం వణికి.... కళ్ళు సజలమయ్యాయి.

".... మూర్తిగారు పెళ్ళిచేసుకోబోతున్నారట — ఈ సంగతి నీకు తెలుసా శారదా ? " అనడిగింది కళ్యాణి తర్వాత మాటగా.

"పిచ్చిగూల.... ఒకే బజార్లో ఉంటున్నాం, దగ్గిర బంధువులం— అతడి పెళ్ళి నాకు తెలియకుండా ఎలా ఉంటుందే ?.... మా అమ్మకూడా అతడి పెళ్ళి పనుల్లో సహాయ పడటానికేగా ఇందాక వాళ్ళ ఇంటికి వెళ్ళింది ?"— తేలిగ్గానే అనేసింది శారద.

"నేను మరికొంత ముందే నీకి నిజం చెప్పేసినా బాగుండేదేమోనే.... మూర్తిగారు కూడా— ఇంత కాలమూ ఆగి ఇప్పుడే పెళ్ళిచేసుకోవటానికి నిర్ణ యించుకోవాలా ?" అంది కళ్యాణి.

"అందులో తప్పేముంది ?... అతడిపెళ్ళి- అతడిష్టం... ముందే నిజం తెలిసినంత మాత్రాన అతడికి, నాకు పెళ్ళి జరిగేదంటావా ? లేదే.... నేను ఆకాశంలో ఉన్నాను. అతడు నేలమీద ఉన్నాడు— ఈ అంతరాలు మమ్మల్నె ప్పుడూ ఒకటి కానివ్వవు.... అయితే కళ్యాణీ, నాకోమాట ఇవ్వాలి... వివాహం జరిగిపోయేదాకా నాకు తెలిసిన నిజాన్ని మూర్తికి మాత్రం తెలియనివ్వకు .... ఎందుకంటే నేనంటే అతనికి వెర్రి వ్యామోహం....నావల్ల మరో కన్నెపిల్ల బ్రతుకు నగుబాట్లుకాకూడదు...." అంటూ— అలా కళ్యాణి దగ్గిర మాట తీసుకొంది శారద.

## 21

మర్నాడు సాయంత్రం ఆఫీసునుంచి బయటికి వచ్చేటప్పుడు — తన మనసుకు ఎంతో ప్రశాంతత లభించినట్లు అనుభూతి కలిగింది శారదకు. కారణం ఆమె మనసులో ఇప్పుడు ఎలాంటి ఆశలు, వాటికి సంబంధించిన ఆందోళనలూ లేనేలేవు ....

ప్రసాద్‌తో కలిసి కొంత దూరం వచ్చాక అతడు చీలిపోయాడు. ఒంటరిగా ఫుట్‌పాత్‌మీద నడుస్తోంది శారద....

ఈరోజు ఉదయం ఆఫీసుకి వచ్చింది మొదలు — చాలా సందర్భాలలో తనకు జరిగిన అన్యాయాన్ని ఎత్తిచూపి— ఎంతో సానుభూతి వ్యక్తం చేశాడు ప్రసాద్. అతడిలో తనపట్ల మొదట్నుంచీ సానుభూతే! కాబట్టే తనకి ఉద్యోగం దొరికింది.... ఎప్పుడూ కాదుగాని ఈవేళ అతడి మాటలు చాలా తేలిగ్గా తీసుకొంది... "నాసంగతేమోగాని— ముందు మీ సంగతి చూసుకోండి... లేకపోతే మా కళ్యాణి బాధపడుతుంది" అంటూ జోక్ వేసింది నవ్వుతూ. తర్వాత, "ఎంతో చనువుగా ఉంటున్నారు కాబట్టి కళ్యాణి, మీరు ఒకటై తీరాల్సిందే ... అందుకోసమే నేను ఎదురు చూస్తుంటాను" అంటూ తన ఆకాంక్షను వెల్లడించింది. దాని మీద, "నాకూ అలాంటి అభిప్రాయముందనుకోండి ... అయితే సమయం కలిసి రావద్దూ ?"— అన్నాడు కొంత సిగ్గును అభినయిస్తూ. దాంతో ప్రసాద్ మనసు అర్థమైంది. కళ్యాణి ఎంతో అదృష్టవంతురాలనిపించింది.

... ఆవేళ్టి సంగతులను గురించి అలా ఆలోచిస్తూ నడుస్తున్న శారద పక్కగా హేమంత్ కారువచ్చి ఆగటం చూసి— తనూ టక్కున ఆగింది ... స్టీరింగ్ ముందు డీలాగా కూర్చున్నాడు. అతణ్ణి చూశాక జాలి అనిపించిందే తప్పితే– ఏ విధమైన ఆవేశం కలగలేదు.

"ప్లీజ్ .... కమిన్ శారదా... " అంటూ డోర్ తెరిచి పట్టుకున్న హేమంత్ మాటను తీసివేయలేనట్లే వెళ్ళి కారులో కూర్చొంది.

"... నామీద కోపం పోయినట్లేనా శారదా ?"

"అసలు నాకు ఎవరిమీదా కోపంలేదు...."

"సంతోషం శారదా.... ఇంత కాలానికి నీతో మనసువిప్పి మాట్లాడ గలిగే భాగ్యం కలిగింది... దగ్గరలో ఏదైనా హోటల్‌కు వెళ్దాం .. కాఫీ త్రాగుతూ తీరుబడిగా మాట్లాడుకోవచ్చు .."

"మీఇష్టం .."

మరికొద్ది సేపట్లోనే.... హేమంత్, శారద ఓ ఖరీదైన హోటల్ ఫామిలీ రూములో— కూర్చొని ఉన్నారు.

ఎదురెదురుగా కూర్చొని ఉన్న ఇద్దరికీ మాటలు దొరకలేదు ముందు.

ఈలోగా బేరర్ వచ్చాడు. టిఫిన్ ఆర్డరిచ్చాడు హేమంత్

"నీపట్ల నేను చేసినది నేరమే కావచ్చు.... అయితే ఏ పరిస్థితిలో అలా చేయవలసి వచ్చిందీ...." అని చెప్పబోతున్న హేమంత్‌ను అడ్డుకొంది శారద.

"అంతా తెలుసు నాకు. నిన్ననే కళ్యాణి మీగతజీవితం గురించి పూస గుచ్చినట్లు చెప్పింది."

"నిన్ననా .... మరి అంతకు ముందు ?"

"నాకు తెలియదు.... కేవలం మీ అమ్మగారు మన వివాహానికి ఇష్ట పడటం లేదని, ఆస్తిపాస్తులు వదులుకొని బయటికి రావడం ఇష్టంలేక— మీరు నన్ను వేరేగా పెళ్ళి చేసుకొని సుఖపడమని సలహా యిచ్చారని మాత్రమే చెప్పింది...."

".... మరి కళ్యాణి నీకు నాగురించి పూర్తిగా చెప్పేశానని చెప్పింది ?..."

అందుకేగా శారదా, నేను నీ దగ్గిరికి ధైర్యం చేసి రాలేకపోయింది.

అసలు".... సంగతి తెలియకే నేనూ— మానాన్నగారు పోయినప్పుడు పరామర్శించటానికి వచ్చిన మిమ్మల్ని కటువైన మాటలతో బాధించ గలిగాను.. . పెద్దల కారణంగా ప్రేమించిన వ్యక్తికి ద్రోహం తలపెడుతున్నారేమో - అన్నదే అప్పటి నా అక్కసు.... నిన్న కళ్యాణి నిజమేమిటో విశదం చేశాక– జరిగి పోయిందానికి బాధపడ్డాను .... అందుకే ఇప్పుడు మీరు రమ్మనమనగానే వచ్చేశాను."

"నిజంగా కళ్యాణి నమ్మదగ్గవ్యక్తి కాదు శారదా.... ఆమె చెప్పే వన్నీ అబద్ధాలే...."

"లేదండీ కళ్యాణి మంచి మనసు గల వ్యక్తి....నిజమేమిటో నాకు తెలియ పరచటం ద్వారా తన తప్పును తాను సరిదిద్దుకొంది.... ఇప్పుడు నాలో ఎలాంటి ఆశలు. ఆందోళనలు లేవు.... మీరు ఏ పరిస్థితిలో నన్ను మభ్య పరచగలిగిందీ అర్థం చేసుకున్నాను. కనుకే మీరంటే నాలో ఎలాంటి దురభిప్రాయమూ లేదు...."

"నన్ను, నా జీవితాన్ని అర్థంచేసుకున్నావు కనుక చెబుతున్నాను శారదా... ఇప్పటికైనా నిన్ను పెళ్ళాడటానికి సిద్ధంగానే ఉన్నాను.... రజనికి, నాకు పొసగటం, ఈ జీవితానికి అసంభవం."

"అలా అని మీరు ఆమె దగ్గర్నించీ చట్టరీత్యా కాగితం తెచ్చుకోండి, అప్పుడు నాకు ఎలాంటి అభ్యంతరమూ ఉండదు" అనేసింది శారద.

"సరే శారదా... మా అమ్మగారు కూడా ఇప్పుడు హైదరాబాద్‌లో ఉంది అసలు ఈపాటికి వచ్చే ఉండాలి.... ఈ రాత్రి నేను ఇంటికి వెళ్ళి - రేపటికల్లా నీకు రిజల్టు చెప్పేస్తాను."

"అయితే ఓ షరతు.... ఒకళ్ళు చెప్పినదాన్ని బట్టిగాక మీ అంతట మీరు రజని దగ్గరికి వెళ్ళండి.... ఆమెలో మార్పు రాకపోతే - అలా కాగితం రాసి ఇవ్వమనండి... అదే ఆమె మిమ్మల్ని క్షమాభిక్ష అర్థిస్తే.... మీ అర్ధాంగిగా స్వీకరించి గౌరవించండి.... తోటి ఆడదానికి అన్యాయం చేసి జీవితంలో నేను బావుకొనేది లేదు."

–శారద మాటలకు — ఆనందంగా అంగీకారం తెలిపాడు.

టిఫిన్ వచ్చింది. తిన్నారు....కాఫీకూడా త్రాగటం అయ్యాక బయటికి వచ్చేశారు. హేమంతే బిల్లు చెల్లించాడు.

"మీ ఇంటి దాకా కారులో డ్రాపుచేస్తాను" అన్నాడు హేమంత్ "కాదు నడిచే వెళ్తాను" అంది శారద ఇద్దరూ అక్కడే వేరయ్యారు.

రజనిలో పరిమార్పు అసంభవం అన్నది హేమంత్ నమ్మకం....శారద తనది కావటంలో ఇక ఎలాంటి ఆటంకం ఉండబోదన్నది అతడి విశ్వాసం.... ఎక్కడలేని ఉత్సాహంతో. సరాసరి రామానగరం వైపే పోనిచ్చాడు కారును.

ఇంటికి వెళ్ళేసరికి చాలా ఆదుర్దాగా ఎదురొచ్చాడు కొండయ్య.

"బాబుగారూ !.... మీకు టెలిగ్రామ్ వచ్చింది నిన్న పొద్దున....మీరు ఎక్కడ ఉండేదీ తెలియలేదు రాత్రి మీరు ఇంటికే రాలేదు....అప్పట్నుంచీ ఎప్పుడు వస్తారా అని మీ కోసమే ఎదురు చూస్తున్నాను...." అంటూ టెలిగ్రామ్ కాగితం ఇచ్చాడు.

"మదర్ సీరియస్ ....స్టార్ట్ ఇమ్మీడియట్లీ - రామచంద్రరావు" అని ఉంది అందులో.

"అమ్మకు సీరియస్సా ?" - అప్రయత్నంగా దుఃఖం వచ్చింది. కాసేపు కాళ్ళుచేతులు ఆడలేదు....తర్వాత నిబ్బరం తెచ్చుకొని, "ఇల్లు జాగ్రత్త

కొండయ్యా...నేను హైదరాబాద్ వెళ్తున్నాను...." అని చెప్పి వెంటనే కారు వెనక్కి తిప్పాడు.

పట్నంవెళ్ళి శ్రీలక్ష్మి, కళ్యాణిలకు చెప్పాడు ఆ విషయం.

"అలాగా, అన్నయ్యా....మరినేను ఆఫీసులో శలవుపెట్టలేదు....నువ్వే రాత్రికి వెళ్ళిపో అన్నయ్యా....రేపు నేను, అమ్మవస్తాం" అని చెప్పింది కళ్యాణి తాపీగా.

అలా అన్నవాళ్ళను గురించి ఏ మాత్రం పట్టించుకోకుండా - ఏదో విధంగా తన తల్లిని దక్కించుకోవాలన్న తపనతో - బయలుదేరాడు మరో క్షణం కూడా ఆగకుండా.

* * *

దాదాపు ఉదయం ఎనిమిది గంటల ప్రాంతంలో— నారాయణగూడాలో రామచంద్రరావుగారి ఇంటి ముందు ఆగింది హేమంత్‌కారు. అసలు రాత్రికి రాత్రే వచ్చేయాలన్నది అతడి ఉద్దేశ్యం....అయితే నార్కట్‌పల్లి దగ్గరికి వచ్చేసరికి కారు ట్రబులిచ్చింది....డిఫెక్ట్ తెలుసుకొని దాన్నితిరిగి కండిషన్‌లో పెట్టేసరికి తెల్లవారింది.

కారుదిగి ఆందోళనగా లోపలికివెళ్ళాడు...హాలులో తనతల్లి, రామచంద్ర రావు, సీతమ్మలు కూర్చొని కులాసాగా కబుర్లు చెప్పుతుంటూండటంతో అతడి మనసు స్థిమిత పడింది.

"ఇప్పుడెలా ఉందమ్మా, నీ ఆరోగ్యం ?" తల్లి కనిపించగానే ఆతృతగా అడిగాడు హేమంత్.

"నా ఆరోగ్యానికేంరా! నిక్షేపంలా ఉంటేనూ...." అంది జగదీశ్వరమ్మ కొడుకును చూసి.

హేమంత్ రాకను, గమనించిన రామచంద్రరావు, సీతమ్మల కళ్ళలో కొత్త వెలుగు వచ్చింది. అల్లుణ్ణిచూసి గౌరవంగా నిలబడ్డారు. కానీ, వాళ్ళను పట్టించుకో లేదు అతడు.

"నీ ఆరోగ్యం బాగానే ఉంటే - ఆ టెలిగ్రామ్ ఇచ్చిందెవరు ?" అనడి గాడు కోపం తెచ్చుకొని.

"నిన్నిక్కడికి రప్పించాలని నేనే అలా ఇప్పించాను...." అంది జగ దీశ్వరమ్మ కుండ బద్దలు కొట్టినట్లు.

"ఏం మాట్లాడవలసిందీ తోచనట్లు ఊరుకుండి పోయాడు.

"హేమంత్, నిలబడే ఉన్నావ్, ఇలావచ్చి కూర్చో" అన్నాడు రామచంద్ర రావు ఆప్యాయంగా.

"ఉండుబాబూ, కాఫీతెచ్చిస్తాను..." అంటూ లోపలికి వెళ్ళబోయింది సీతమ్మ.

"మీ మర్యాదలు, మన్ననల కోసం రాలేదు....కేవలం నన్ను ఇక్కడికి రప్పించటం మీ ఉద్దేశ్యం కావచ్చు. ఆ ప్రకారమే వచ్చాను...వచ్చిన పని అయి పోయింది వెళ్ళిపోతున్నాను" — అంటూ వెనక్కు అడుగు వేయబోతున్న - అతడి కాళ్ళమీద పడింది అమాంతంగా, రజనివచ్చి.

అహాలాత్పరిణామానికి దిమ్మెరబోయింది హేమంత్ మనసు.

"నువ్విలా రావాలని - వస్తావని ఎంతో కాలంగా ఎదురుచూస్తున్నాను... నా కోర్కె ప్రకారమే వచ్చావు....అర్హతలేక పోయినా అడుగుతున్నాను. నన్ను క్షమించు బావా !" అంది రజని కన్నీరు మున్నీరుగా.

ఆ మరుక్షణంలోనే—అయోమయం నుంచీ తేరుకున్న హేమంత్ హృద యంలో అమృతం వర్షించింది. చిన్నప్పట్నుంచీ రజని అంటే ఎంత ఇష్టమో !... ఆమె కోరితే ఏమైనా చెయ్యాలనిపించేది...రజని అతడికి దూరమవ్వాలని చూసిందేతప్పితే —హేమంత్ ఏనాడూ ఆమెనుంచీ వేరవ్వాలనుకోలేదు... పరి స్థితులను బట్టి చివరికి రజని అంటే విరక్తి చెందక తప్పలేదు అతడికి ..కాబట్టే శారద....

"లే రజనీ...." అంటూ తన చేతులతోనే ఆమెను లేవదీసి. "నువ్వు తప్పు చేశావని నేను అనను... నీ మనసుకు నచ్చిన పనిచేయాలనుకున్నావు .. జీవితా లను గురించి అర్థం చేసుకోలేని వయసులోనే మనద్దరికి పెళ్ళిచేసిన పెద్దలదే తప్పంతా" అన్నాడు ఓదార్పుగా.

"బావా !... నిజంగా నీదెంత మంచి మనసు ? .... నిన్ను అర్థం చేసు కోకుండా మూర్ఖంగా ప్రవర్తించాను .... తర్వాత తెలిసి వచ్చింది బావా యదార్థం.... " అంది రజని పరితాపంగా.

—వాళ్ళిద్దర్నీ అలా చూస్తుంటే కనుల పండువుగా వుంది పెద్దలకు.

"....గతాన్ని వదిలిపెట్టు రజనీ .... ఇప్పటికైనా నీలో మార్పు వచ్చింది.... ఈ క్షణంలో నాలో ఎంత ఆనందంగా ఉందో తెలుసా ?"— రజనిని తన కౌగిలిలోకి తీసుకోవాలనుకున్నాడు కాని- ఎదురుగా పెద్దలు ఉండడం చేత ఆగిపోయాడు.

".... నావల్ల పాపం, నిన్ను నమ్ముకున్న శారదకే అన్యాయం జరిగి పోయింది బావా" అంది రజని తర్వాత మాటగా.

"శారద అలా భావించుకోవటం లేదు రజనీ.... నీ స్థానం నీకే వదిలేయ టానికి ఆమె మనస్ఫూర్తిగా అంగీకరించింది..." అన్నాడు హేమంత్- నిన్నటి సాయంత్రం శారద హోటల్లో అన్న మాటలను మననం చేసుకొంటూ.

"అంతటి త్యాగశీలా శారద !....ఆమెని చూడాలని వుంది బావా" అంది రజని.

"తప్పకుండా రజనీ.... " అన్నాడు రజనిమీద చేయివేస్తూ.

సీతమ్మ కాఫీ పట్టుకొచ్చింది.

"మొత్తానికి కళ్యాణి మా మంచిపనే చేసింది." అంది జగదీశ్వరమ్మ. మధ్యలో.

"...అవును హేమంత్ మాది హైదరాబాద్, రజని స్నేహితురాలినని చెప్పి- మీ అమ్మగార్నిక్కడికి పంపింది....నిన్నిక్కడికి రప్పించాలంటే సీరియస్ టెలిగ్రామ్ ఇవ్వమని కూడా ఆమే సలహా యిచ్చింది కళ్యాణి సలహాను అక్ష రాల పాటించింది మీ అమ్మ.... అందుకే ఈవేళ మాయింట్లో పండువులా ఉంది" అంటూ అసలు విషయం చెప్పుకొచ్చాడు రామచంద్రరావు.

ఎంత మంచిపని చేసింది కళ్యాణి.... ! అనుకున్నాడు హేమంత్.

"....నా యింటికి వచ్చినప్పుడు అది నాచెల్లెలు శ్రీలక్ష్మి కూతురని అను కోలా.... ఆ సంగతే తెలుసుంటే...." అంటున్న జగదీశ్వరమ్మ మాటకు అడ్డు వచ్చాడు హేమంత్,

"అర్థమైన మాటలూ అని వెనక్కుతిప్పి పంపేదానివి " అని దెప్పి పొడిచాడు.

"అంతేరా అబ్బాయ్ నువ్వు నన్ను అర్థం చేసుకున్నది.... చిన్న తనం నుంచీ శ్రీలక్ష్మి అంటే నాకు ఎంత ప్రేమో తెలియదు.... అయితే అది చేసిన పనే- నాకు కోపం తెప్పించింది.... ఆవేళ అది ఎంతో కాలానికి కనిపించబట్టి నా అక్కసంతా వెళ్ళగక్కాను....తర్వాత నాలో నేను ఎంత ఇదయ్యానో తెలుసా ?.... అందుకేగా నామాట కాదని దానింటికి వెళ్తున్నా నిన్ను నేను ఏమీ అనకుండా ఊరుకొంటోంది?....మొన్న మనింటికి వచ్చింది నాచెల్లెలు కూతురే అని తెలియదు.... తెలిస్తే నాకు కూతుళ్ళు లేని లోటు తీర్చమ్మా అని అడిగేదాన్ని....

ఇప్పటికీ మించి పోయిందేమిటిలే.... రేపు మనం అంతా వెళ్ళటంవెళ్ళటం ముందు మా శ్రీలక్ష్మి వాళ్ళింటికే వెళ్దాం. " అంది జగదీశ్వరమ్మ.

రజనిలో మార్పు.... తల్లిలో మార్పు.... హేమంత్ సంతోషానికి అవధులు లేవు.

ఆ సాయంత్రానికి కళ్యాణి, ప్రసాద్ కలిసి వచ్చారు హైదరాబాద్ ఆ యిద్దరూ జంటగా కలిసి రావటాన్ని చూసిన— అందరికీ ఏదో తీయటి భావం కలగ సాగింది.... చూడముచ్చటైన జంట.... "వీళ్ళిద్దరికీ పెళ్ళి చేసేస్తే ఎలా ఉంటుంది ?" పెద్దల తర్కంలోకి వెళ్ళిందా విషయం.

## 22

మూర్తి వివాహం ఎల్లుండే. పెళ్ళి పనులన్నీ సజావుగా జరిగి పోతున్నాయి శారద తల్లి అనసూయమ్మ మూర్తి వాళ్ళింట్లోనే ఉండి పోతోంది. ఎందుకో తల్లితో పాటు తనూ అక్కడే ఉండటానికి మనస్కరించటం లేదు శారదకు. కాకపోతే తప్పని పరిస్థితుల్లో— మూర్తి వాళ్ళ ఇంటికి భోజనానికి వెళ్ళి వెంటనే వచ్చేస్తోంది. తమ్ముడు, చెల్లాయి కూడా అక్కడే ఉంటున్నారు దాదాపు.

అలాగే ఆ సాయంత్రం ఆఫీసునుంచీ ఇంటికి వచ్చి- తన దగ్గిర ఉన్న డూప్లికేట్ 'కీ' తో తాళం తీసి లోపల కూర్చుంది విశ్రాంతిగా .... కొంచెం దూరంలో ఉన్న ఆఫీసు నుంచీ నడిచి వచ్చేసరికి బడలిక అనిపించింది మొదట.... కొంచెం సేపటి తర్వాత తప్పదన్నట్లే లేచి బావి దగ్గిరికి వెళ్ళింది....

అన్ని పనులూ ముగించుకొని వచ్చి తీరుబడిగా ఏదో పుస్తకం తీసుకొని చదువుదామని మొదలు పెట్టింది ముందు గదిలో కూర్చుని.

అదే సమయంలో వచ్చాడు మూర్తి అక్కడికి .... అప్పుడతడి మొఖం అదోలా ఉంది....

"మూర్తీ ! ... కమాన్.... రా.... రా" అంటూ మర్యాద పూర్వకంగా ఆహ్వానించింది.

"నీకు తెలియని విషయం ఒకటి చెప్పాలని వచ్చాను శారదా"— అన్నాడు కూర్చొంటూ.

"ఏమిటి అది ?" - ఏమాత్రం చలించకుండా అడిగింది శారద.

"హేమంత్ విషయంలో నువ్వు మోసపోయావు.... అతడికి అది వరకే పెళ్ళైంది ! నా మ్యారేజికి ఆహ్వానించటానికి కళ్యాణి వాళ్ళ ఇంటికి వెళ్ళాను.... అక్కడ సతీ సమేతంగా కనిపించాడు హేమంత్.... ఒక విధంగా కళ్యాణి నిన్ను మభ్యపరచినట్లే శారదా" – ఆ సంగతి చెబుతున్నప్పుడు చాలా బాధగా ధ్వనించింది మూర్తి కంఠం.

"అలాగా ! .... అయితే హేమంత్‌తో జీవితాన్ని పంచుకోవటానికి రజని అంగీకరించి వచ్చిందన్నమాట ! ....పోనీలే, అతడి జీవితమైనా ఓ దారిలో పడింది...నా కదే సంతోషం....ఓ మంచి వార్తే తెచ్చావు మొత్తానికి అంది శారద.

ఆమె మాటలకు కొయ్యబారి పోయినట్లయ్యాడు మూర్తి.

"నీకు అన్ని సంగతులూ ముందే తెలుసా శారదా?"అడిగాడు ఆశ్చర్యంగా.

"ముందే తెలిసి ఉంటే- పెళ్ళిమాటల దాకా ఎందుకు వచ్చేది వ్యవహారం ?.... మొన్ననే తెలిసింది అతడి గత చరిత్ర ...." అంటూ .... హేమంత్ పెళ్ళి - దరిమిలా జరిగిన వృత్తాంతం కళ్యాణి ఆడిన నాటకం - అంతా - తనకు తెలిసినంత వరకు చెప్పి, "మొత్తానికి కథ సుఖాంతమే అవుతుందిలే మూర్తీ" అంది.

"మగవాడు ఏవిధంగా జరిగినా మొత్తానికి అతడి కథ సుఖాంతమే అయ్యేది, చివరికి...మరి...నువ్వు ?... ఆడదానివి... హేమంత్ ప్రేమికురాలిగా నలుగురి దృష్టిలో పడ్డావు....ఇక నీ జీవితం ఏమైపోవాలి ?"

## మనోసంజీవని

నాకస్నిటి ఇటుక నొక్కొక్కటే పేర్చిపేర్చి
ఒంటరి తనపు సమాధిలో
అనుక్షణం క్రుంగిపోతున్న వేళ
ఇంకా ఎగరడం చేతకాని పసికూనను
తన వెచ్చదనపు రెక్కల సందిటలో
ఆప్యాయంగా ఇముడ్చుకొనే తల్లి పక్షిలా
నన్నూరడించి సమాశ్వాసించేది సాహిత్యం
ప్రచండ గ్రీష్మకాలంలో జ్వలించే భాస్కరుణ్ణి
నా కలశంలో పిండి
బాధల మధువును తాగితాగి
ఇంకా దాహం తీరని వేళ
చందన సుగంధ వాయుస్పర్శలా
నా మేనిసోకి నన్నలరించి
అమృతం వర్షం కురిపించేది సాహిత్యం.
జీవితం సకల రంగాలలోను
వ్యాపారం ప్రచ్ఛన్నంగా ప్రవహిస్తూ
అర్థమే అగ్రాసనాధిపత్యం వహిస్తున్నప్పుడు
అనుభూతులకు తావులేక
అపారమైన భావుకత్వానికి
విపరీతమైన సున్నితత్వానికి
నిలయమైన నా గుండె తట్టుకోలేక
ఒక్కసారిగా విస్ఫోటనమైనపుడు –
నా అధరంపై చిరుహాసం నర్తిస్తే
తనలో ఆనంద మధువని విరబూస్తుందని
నా నేత్ర గవాక్షం నుండి
ఒక్క బాష్ప బిందువు తొంగి చూచినా
తన హృదిలో తమాలవనాలు
అనంతంగా జన్మిస్తాయని భావించి
కేవలం నా కోసమే జీవించే
మంచి నేస్తంలా నన్నానందింప జేసి
ఆహ్లాదపరచేది సాహిత్యం.
నిజంగా రసహీనమైన
మృతప్రాయమైన
ఈ కృత్రిమ ప్రపంచంలో
మనోసంజీవనిలాంటి
సాహిత్యం లేకపోతే
మానవ జీవన గమనంలో
అడుగడుగునా ఎన్ని
ఆత్మహత్యా పరంపరలో !

—శ్రీమతి మందరపు హైమవతి

—మూర్తి నిలదీసి అడిగే సరికి సమాధానం చెప్పలేకపోయింది శారద.

"ఇప్పటికి మించి పోయింది లేదు శారదా !...నీకూ తెలుసు మొదట్నుంచీ. నామనసేమిటో... నేను జీవితంలో ప్రేమించిన మొదటి వ్యక్తివి నువ్వు !... నాలో ధైర్యం చాలకనో, పరిస్థితులు అనుకూలించకనో, నీకు వ్యక్తీకరించ లేక పోయాను నా ఆకాంక్షను....అయితే అనుక్షణమూ నీ ఆరాధనే నాలో...కాకపోతే హేమంత్‌ను మీయింట్లో చూసిన నాటి తర్వాత నా మనసును బలవంతానా మరల్చుకున్నాను... ఎందుకంటే ఏకపక్షంగా జనించే ప్రేమకు అర్థం ఉండదని నాకూతెలుసు... ఆటు పైన మామయ్య పోవటం జరిగింది....మానవత్వం చేతనైతేనేం, బంధుత్వం చేతనైతేనేం - నాకు తోచిన విధంగా సహాయపడ్డాను...అప్పట్నుంచీ నాపట్ల మార్పు పొడసూపింది నీలో... అది ఆపత్సమయంలో మీ కుటుంబానికి నేను చేసిన మేలుకు -కృతజ్ఞతా సూచకం కావచ్చనుకున్నాను... తప్పితే నా విషయంలో – మానసికంగా నీలో పరిమార్పు వచ్చిందని నేను అనుకోలేదు... అందుకే నీమీద నిరాశ చేసుకొని, మా అమ్మ ఆనందం కోసం ఈ పెళ్ళికి ఒప్పుకున్నాను... శారదా ! ఇప్పటికీ నా మనసు నీ మీదే ఉంది... నువ్వు కనుక అంగీకరిస్తే - ఎల్లుండి అదే ముహూర్తానికి నీ మెళ్ళోతాళి కడతాను... నేను మనసారా కోరుకున్న స్త్రీ నాకు భార్య కావటం కన్నా-జీవితానికి మరి కావలసింది ఏముంటుంది ?" అంటూ తన మనోగతాన్ని చివరిసారి అన్నట్లు వెల్లడించాడు మూర్తి.

ఆ మాటలు శారదను క్షణకాలం పాటు చలింపజేశాయి.

పుట్టింది మొదలు తను పేదరికాన్నే అనుభవించింది... ఆడపిల్లగా ఏ అచ్చట ముచ్చట తీర్చలేకపోయారు తల్లి దండ్రి...అందుకే ఆత్మాశకుపోయింది.... కావాలనే తను ధనవంతుడైన హేమంత్ దృష్టిలోపడింది....సుఖమయ జీవితాన్ని కోరి అతణ్ణి ప్రేమించింది....కాబోయే గొప్పింటి కోడలిగా ఎన్నో గాలిమేడలు కట్టుకొంది బ్రతుకుమీద....అయితే నిజానిజాలు తెలిసిన భగవంతుడు తనకు తగిన శిక్షే వేశాడు....ఇప్పుడు తను ఊహాలమైకంలోంచి వాస్తవంలోకి వచ్చింది.

నిజంగా మూర్తి మానవత్వం ఉన్నమనిషి. మంచి ఉద్యోగం కూడా ఉంది....ఎంతో అదృష్టముంటేనేగాని అతడివంటి వ్యక్తి భర్తగాలభించడు....తను మొదట్నుంచీ మూర్తిని సరిగా అంచనావేసుకో లేకపోయింది....పైగా తనని ప్రేమించేందుకు అతడు అనర్హుడని విడిచి పడిపోయింది... కైవల్య శిఖరాలను చేరుకుందామని బయలుదేరి పాతాళంలోకి జారిపోయింది....

—ప్రస్తుతానికి మూర్తి మరో యువతికి భర్త కాబోతున్నాడు.... ఇంకో నలభై ఎనిమిది గంటలలో ఆమెను అగ్నిసాక్షిగా పెళ్ళాడ బోతున్నాడు.... అందరూ అన్ని ప్రయత్నాలూ చేసుకొని, ముహూర్తం దగ్గిరపడ్డతర్వాత - ఇప్పుడు - ఇలా మాట్లాడుతున్నాడేం మూర్తి?...తన స్వార్థం కోసం మరోకన్నె పిల్ల జీవితాన్ని సందిగ్ధంలో పడవేయటమా?-ఈ పాపం కూడా తను భరించవలసిందే?... వీల్లేదు...

"మూర్తీ! ఓ పక్కనుంచీ నువ్వే అంటున్నావ్ - ఏక పక్షంగా జనించే ప్రేమకు అర్థంలేదని... అప్పుడే కాదు ఇప్పుడూ అంతే నా మనసు... జీవితంలో నేను ఓడిపోయినమాట నిజమే....అయితే నా ఓటమిని నీ గెలుపుగా అర్థం చేసుకోకు.... నా మనసు తెలుసుకోకుండానే నీవు చాలా పెద్ద పెద్ద మాటలు మాట్లాడేస్తున్నావు?" అంది శారద పైకి బింకంగా.

"సారీ...అయామ్ సో సారీ, శారదా... ! నేనేమైనా తప్పుగా మాట్లాడితే నీ మనసు నొప్పించి ఉంటే...క్షమించు.... ఏమిటో కాదనుకుంటున్నా - నీకు అన్యాయం జరిగిందని తెలిసి - అలా పోయింది నా మనసు.... పోనీలే శారదా....ఇవేవీ మనసులో పెట్టుకోకుండా ఎల్లుండి నా వివాహానికి తప్పకుండా రావాలి.." అనిచెప్పివెళ్ళిపోయాడు చరచర..

"మూర్తీ..." అంటూ అతడు వెళ్ళినదిక్కే చాలా సేపు బాధగా చూస్తుండిపోయింది శారద.

* * *

పెళ్ళి పీటలమీద కూర్చొని ఉన్నాడు మూర్తి. పురోహితులు తంతు నడిపిస్తున్నారు....

అక్కడికి కొంచెం దూరంగా నిలబడి ఉంది శారద.... మనసు బాగుండక పోయినా మూర్తి మీది గౌరవంతో, అతడు ఎక్కడ నొచ్చుకుంటాడోననే వచ్చింది తల్లి, తమ్ముడు, చెల్లెలితోపాటు. జీవితంలో మరి పెళ్ళి అనేది తలపెట్టుకోకుండా తమ్ముణ్ని చదివించి, చెల్లెలికి పెళ్ళి చేసి - తల్లిని పోషించుకుంటూ శేషజీవితం గడిపేయటం జీవిత ధ్యేయంగా నిర్ణయించుకొని గుండె రాయిచేసుకొంది శారద.

చదువుతున్న మంత్రాలు ఆపేసి పెళ్ళికూతుర్ని తీసుకువచ్చి పీటలమీద కూర్చోబెట్టమన్నారు పురోహితులు.

....దాంతో అక్కడ గగ్గోలు పుట్టింది 'పెళ్ళికూతురు కనిపించటంలేదు' అని. ఏమైంది?.... ఎక్కడికి వెళ్ళింది? - అని ప్రశ్నించుకుంటున్న పెద్దలకు గదిలో టేబిల్ మీద ఓ చీటీ కనిపించింది, నన్ను గురించి వెతికించే ప్రయత్నం చేయవద్దు.... నేను మనసారా ప్రేమించిన వ్యక్తితో వెళ్ళిపోతున్నాను... నా ప్రేమ వ్యవహారం గురించి ఎంత చెప్పినా వినిపించుకోకుండా ఇష్టం లేని పెళ్ళి జరిపించటానికి పూనుకున్నారు మీరు. అందుకు తగిన శాస్తిచేయటం కోసం ముహూర్తం దగ్గిర పడేవరకు నేను మిమ్మల్ని మభ్యపరిచాను....ఇప్పుడు నలుగురిలోనూ తలవంచుకొని ఏడవండి.... మిమ్మల్ని చూశాకైనా - ఇటువంటి తప్పులు చేయకుండా జాగ్రత్త పడతారు కొందరు ఆడపిల్ల తల్లిదండ్రులైనా –" అంటూ ఘాటుగా రాసి పెట్టిపోయింది పెళ్ళికూతురు పద్మ.

అందరూ లబోదిబో అంటున్నారు - దిక్కు తోచక అటూ ఇటూ తిరుగుతున్నారు.

ఇదంతా నిజమా, కలా అన్నట్లుంది మూర్తికి.... పెళ్ళికూతురు పద్మ ఎంతమంచి పని చేసింది!- అతడి కళ్ళలో ఓ విధమైన వెలుగు ప్రవేశించింది....ఆ వెలుగు కిరణాల్లో శారద మరింత దేదీప్యమానంగా కనిపించసాగింది.

ఏమాలోచించాడో మూర్తి చటుక్కున లేచి వెళ్ళి - ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"మూర్తీ....!"- ఓ ప్రక్క అతడి చెయ్యి అందుకొనే అవకాశం రావటం అదృష్టంగానే భావించుకుంటున్నా, మరోపక్క తన వాళ్ళు - తన ధ్యేయం గుర్తు వచ్చి ఒక అడుగు వెనక్కు వేసింది.

"ఇది మనం కోరుకున్న సంఘటన కాదు శారదా.... అంతా భగవత్సంకల్పం! నాకు తెలుసు- నీకు తల్లి, చెల్లి, తమ్ముడు ఉన్నారు. వాళ్ళ పోషణాభారం నీమీద ఉంది....నువ్వు నా అర్ధాంగివైతే నీ బరువు బాధ్యతల్లో సగభాగం నావి కావా?.... పెళ్ళైనతర్వాత కూడా ఉద్యోగం చేస్తూనే ఉండు శారదా.... మనిద్దరం కలసి మనందరి కోసం కష్టపడదాం.... ఒక్క అమ్మతప్ప నాకెవరున్నారు ....? నీ వాళ్ళే నావాళ్లూను...." అంటూ పరిస్థితిని అర్థం చేసుకొని - ధైర్యం చెప్పాడు మూర్తి.

అతడు మాట అంటే చాలు.... దానికి జీవితాంతం కట్టుబడి ఉంటాడు.... మూర్తిలో నీతి, నియమం ఉన్నాయి.... ఈనాటి పరిస్థితులు రేపు ఉండవు... తను మాత్రం జీవితాంతం ఒంటరిగా బ్రతకాలంటే ఎలా సాధ్యపడుతుంది?.... అలా బ్రతికిన జీవితానికి మాత్రం అర్థం ఏ ముంటుంది?

తనని గురించి, హేమంత్‌తో తన ప్రేమను గురించీ అన్నీ తెలిసిన వాడు మూర్తి.... ఓ విధంగా హేమంత్‌దీ, తనదీ ప్రేమకాదు, వయోపరంగా జనించిన వ్యామోహం.... అతడి ఆస్తిపాస్తులకు తను ఆశపడితే, తనవయసుకు, అందానికి అతడు ఆశపడ్డాడు - అవన్నీ తెలిసి కూడా తనపట్ల అనుకూల భావంతో మాట్లాడుతున్నాడు మూర్తి.... తనని చేసుకోవటమే కాకుండా తన బరువు బాధ్యత

లలో కూడా పాలు పంచుకుంటా నంటున్నాడు... మరి తననుండి అతడు ఆశిస్తున్న దేమిటి? వయసు, అందమూనా?- అవే ముఖ్యమైతే ఒంటరిగా ఎన్నోసార్లు తారస పడింది మూర్తికి, అప్పుడు బలవంతంగా అనుభవించకపోయాడూ?.... అతడి దృష్టి అదికాదు.... తనంటే ఆరాధనా భావం ! అందుకే ఎంతోకాలం తన అనుమతి కోసం నిరీక్షించాడు.... చివరికి తనమొండితనానికి విసిగి పోయి, కన్నతల్లి పోరు పడలేకే - అయిష్టతతో ఈ పెళ్ళికి అంగీకరించాడు - అయితే విధి వశంగా తప్పి పోయింది పెళ్ళి.... నిజానికి మూర్తికి తనపట్ల వ్యామోహం కాదు-ప్రేమ !.... అతడు తనకోసం ఏం చేయమన్నా చేస్తాడు.... ఇటువంటి వ్యక్తి భర్తగా పొంద గలిగే తను - నిజంగా ఎంతటి అదృష్టవంతురాలు! .... మూర్తిని వివాహం చేసు కుంటేనే తన జీవితానికి ఓ అర్థం అంటూ ఏర్పడుతుంది !....

—అలా ఆలోచించిన మరుక్షణం అతడి పాదాలమీద వాలిపోయింది శారద.

లాలనగా ఆమెను లేవదీసి పెళ్ళి పీటంవైపు నడిపించాడు మూర్తి.

అదేపెళ్ళిపందిరిలో - అదే ముహూర్తానికి శారద, సుందర మూర్తిల వివాహం జరిగిపోయింది.

సరిగ్గా మూడు ముళ్ళుపడే సమయానికి ప్రసాదీ, కళ్యాణి, హేమంత్, రజని-వాళ్ళతో పాటు పెళ్ళికూతురు పద్మకూడా వచ్చింది.

మూడుముళ్ళు అయిపోయాక నలుగురితోపాటు అక్షింతలు వేస్తున్న వాళ్ళం దర్నీ చూసిన మూర్తి, శారదలలో కొంతసేపు చలనం లేకుండా పోయింది.

ఈలోగా "ఏమే, నలుగురిలో మమ్మల్ని నవ్వులాట్లు చేసి ఏం ముఖం పెట్టుకువచ్చావే పాపిష్టిదానా" అంటూ పద్మతండ్రి వచ్చి ఆమె జుట్టు పట్టుకో బోయాడు. కానీ ప్రసాద్, హేమంత్ ఆయన్ని వారించారు....దాంతో ధైర్యం తెచ్చుకున్న పద్మ,

"....నాకు ఇప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు....ఇంకా చదువుకుంటాను మొర్రో అన్నాను. కానీ, నామాట వినిపించుకోలేదు. చదివిన చదువు చాలు పెళ్ళి చేసుకో అని మీరు బలవంతం చేశారు....తప్పదన్నట్లే ఒప్పుకున్నాను నేను ఇష్టం లేక పోయినా....అయితే మూర్తిగారి మనసు శారదగారి మీదే ఉందని తెలియ జెప్పారు ఓ రోజు ప్రసాద్‌గారు, కళ్యాణీవచ్చి ... మనసు ఒకచోట, మనుగడ ఒకచోట - మూర్తిగారిని చేసుకున్నందువల్ల మేమిద్దరమూ అశాంతిపాలు కావటమే నని అర్థం చేసుకున్నాను...అదీకాకుండా శారదగారి దీన ప్రేమగాథ తెలిసింది ....ఆమె గతం తెలిసిన మూర్తిగారు తప్ప-మరొకరు శారదగార్ని ధైర్యం చేసి వివాహం చేసుకోలేరని అనిపించింది....ఏదో విధంగా వాళ్ళిద్దర్నీ ఒకటి చేయటం కోసం నేను ఎవర్నో ప్రేమించినట్లు నటించటం జరిగింది—ఈ సలహా యిచ్చిందీ ప్రసాద్‌గారే....మొత్తానికి కథ సుఖాంతమైంది....నా పెళ్ళిగురించి మీరు ఖర్చు పెట్టినదబ్బు ఎంతైందో చెప్పండి....వీరు ఇస్తామన్నారు" అంటూ ప్రసాద్, హేమంత్‌లను చూపించింది పద్మ.

కూతుర్ని ఏమీ అనలేక, మరేమీ చెయ్యలేక దిక్కు తోచనట్లు నిలబడి పోయాడు పద్మతండ్రి.... పెళ్ళికి వచ్చిన మిగతా బంధు వర్గమంతా ముక్కు మీద వేలు వేసుకొని చూస్తుండి పోయారు వింతగా.

మూర్తి లేచి వచ్చి - సజల నేత్రాలతో ప్రసాద్ , హేమంత్ చేతులు పట్టుకున్నాడు.

రజని స్వయంగా వెళ్ళి, "ఈ అన్ని అనర్థాలకు మూలం నేనే శారదా.... నీకు అన్యాయం చేయాలని భావకు లేదు.... నీగురించి ఆయన బాధపడని నిముషం లేదు.... నామాట నమ్ము" అంటూ శారదను అర్థించింది.

"అవును శారదా ! నిన్ను మోసం చెయ్యాలని లేదు అన్నయ్యకు..." అంటూ ఒంత పలికింది కళ్యాణి....ఆ వెంట ప్రసాద్,

"ఒక స్నేహితుడిగా— మూర్తి మనసేమిటో నాకు తెలుసు శారదగారూ అతడు మీగురించి ఎంత ఆరాట పడేవాడో చెప్పలేను.... హేమంత్ మీద ఆశలు పెంచుకొని - నిజం తెలిశాక మీరు ఎలా రియాక్ట్ అవుతారో అని చాలా ఆందోళన పడ్డాం మేం. ప్రేమ భగ్నమైందని తెలిశాక సగటు ఆడపిల్లలా ఏ హత్యో చేసుకుంటే హేమంత్, రజని మనశ్శాంతిగా బ్రతుక గలిగే వారా ?... నిజం తెలిసీ మీరు చలించి పోలేదు. తొందరపడి నిర్ణయం తీసుకోలేదు.... మీ గుండె నిబ్బరానికి మా ధన్యవాదాలు.... మీరు తనకు దక్కదనుకొనే మూర్తి పద్మను చేసుకోవటానికి అంగీకరించాడు.... ఇప్పుడు మీ పరిస్థితి ఈవిధంగా మారిందని తెలిసి- రేపు వాడు చేసుకున్న పెళ్ళాంతో హాయిగా బ్రతుకగలడా?... బాగా ఆలోచించే అన్ని వివరాలు పద్మకు తెలియచేశాం. ఆమె మాకు ఎంతో సహకరించింది.. మా కోర్కె ప్రకారం మీరిద్దరూ ఒకటవుతున్నారు. మాకదే సంతోషం" అన్నాడు.

హేమంత్ ముఖం ఎంతో దైన్యంగా వుంది. అతడి సజల నేత్రాలు శారదను క్షమాభిక్షను అర్థిస్తున్నాయి. అది గమనించి శారద తన మాటేమిటో చెప్పింది,

"మీరెవరూ పొరబాటు చేశారని నేను భావించటం లేదు.... అందుకే ఒకర్ని క్షమించే ప్రశ్నలేదు.... మనం విధి చేతుల్లో కీలుబొమ్మలమే అయినా - మన జీవితం మన చేతుల్లోనే వుంది .... హేమంత్‌గారి వల్ల వంచించ బడ్డానని నిజ మేమిటో కళ్యాణి తెలియ జెప్పిన రోజున అనుకున్నమాట యదార్థమే. అంతేకాదు ఇందాక ప్రసాద్‌గారు అన్నట్లు ఈ అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకుం దామా అన్న తీవ్ర ఆలోచన తట్టింది.... కాకపోతే వివేకం ఒక అడుగు వెనక్కు వేయించింది నాచేత.... పరిస్థితులు ఏవైతేనేం మొత్తానికి నేను ప్రేమించి వంచింప బడ్డాను.... అసలు ఎందుకు జరిగింది ఇలా ? .... ఒక ధనవంతుడికి ఇల్లాలినై భోగభాగ్యాల్లో తేలిపోదామన్న ఆశ్యాశ, వైరివ్యామోహం .... తెలిస్తే ఎక్కడ కాదంటారో అన్న స్వార్థంతో సర్వకాల సర్వావస్థల్లోనూ నా శ్రేయస్సునే కోలే నా తలిదండ్రుల ముందు కూడా నిజం దాచి వాళ్ళను మభ్యపరిచాను... అదే హేమంత్‌గారు నన్ను ఇష్టపడుతున్నానని చెప్పిన రోజునే నేను మర్మం విడిచి నాతల్లిదండ్రులకు చెప్పివుంటే పరిస్థితి ఇంత వరకూ వచ్చేదా ?.... ఆనాడే అన్ని వివరాలు రాబట్టివుండేవారు మానాన్న, యదార్థం ఆనాడే తెలిసిపోయేది.... కానీ, నేటి అందరి ఆడపిల్లలలానే నేనూ మనసులో ఏవో కలలు పెట్టుకొని వాళ్ళకు చెప్పలేకపోయానని.... మరోమాట... మానాన్న నా కారణంగానే పోయారని నేను భావించుకొంటున్నాను.... ప్రస్తుతానికి ఇంటికి పెద్దదాన్ని కనుక మా కుటుంబ భారం నామీదేవుంది .... ఈ పరిస్థితి అర్థంచేసుకున్నట్లున్నాడు.... మూర్తి... పెళ్ళయ్యాక కూడా నా వుద్యోగం నేను చేసుకోవచ్చన్నాడు. నా కుటుంబానికి నేను పూర్తిగా సహాయ పడవచ్చన్నాడు.... పూర్తిగా హామీయిచ్చాడు కనుకే నేనీ వివాహానికి తలవొగ్గుతున్నాను. మావివాహానికి ఇందరు ఇన్ని విధాల ప్రయత్నించి నందుకు నాహృదయ పూర్వక కృతజ్ఞతలు. " అంది.

దాంతో అందరి మనసులూ ప్రశాంతంగా మారాయి.

"నే మాట యిచ్చిన ప్రకారం నడుచుకుంటాను శారదా ... కావాలంటే ఇక్కడున్న అందరిమీదా ప్రమాణం" అన్నాడు మూర్తి.

"నాకా నమ్మకం ఉందిలే మూర్తీ" అని ప్రసాద్‌వైపు తిరిగి. "ప్రసాద్ గారూ, మీరు, కళ్యాణి నాస్నేహితులుగా - మన అందరి పరిచయాలు ఇలాగే కొన సాగాలన్నది నాకోరిక.... నాకంటే కళ్యాణి ముందు వివాహం చేసుకుంటుం దనుకున్నాను.... " అంది శారద.

"మేమూ త్వరలోనే ఒకటి కాబోతున్నాం శారదగారూ." అన్నాడు ప్రసాద్.

పద్మతండ్రికి హేమంత్ జేబులోంచి తీసి డబ్బు ఇవ్వటం అక్కడ అందరూ చూశారు.

(అయిపోయింది)

# జెండా ఓ ఖైదీ!

ఖ్రమొద్దీన్

నోరుండీ ప్రశ్నించలేరు
పిడికిళ్ళుండీ గొడ్డలిపెట్టు కాలేరు
కొక్కొక్కొరు హోరెత్తగల మహార్ణవాలేకాని
గుండె ఘోషను వ్యక్తపరచడానికి
మౌనభాషను ఎంచుకున్నారు !
తమలోకి అస్తమిస్తున్నసూర్యుడిని మూర్ఖంగామూసేస్తూ
చీకటిలో చిత్ర వధలకు చిక్కి, శల్యమవుతున్నారు !
అరుదుగా దయచేసే కలల్లోమాత్రం
కల్లోల తుఫానులై బీభత్సం సృష్టించి,
ఉలిక్కి పడుతున్నారు !
ఉసూరు మంటున్నారు ! !

ఈ నేల మాత్రం...?
కంపించి, బ్రద్దలై ఈ సమస్తాన్ని
తనలో ఐక్యం చేసుకోగలదు కానీ
విశ్రి సహనంతో

దుబ్బుమాత్రం రేపుతోంది !
పట్టిపోయి నిరాశలో ముంచి
ఈ సకల చరాచరాలన్నిటిని
మలమల మాడ్చనూగలదు కాని
మనిషికి లేని ఔదార్యంతో క్షమతో,
దున్నే ట్రాక్టర్లకు అనుకూలంగా సాగ్గొతూ
చల్లే విత్తులకు సారవౌతూ
పరమ విశ్వసనీయంగా నవ్వుతోంది !

ఇంక ఈ వ్యవస్థ...?
స్వాతంత్ర్యానికి స్వార్థమని
సంకుచితంతో సరికొత్త అర్థం చెప్తూ
ఇన్నేళ్ల 'పాటచ్చర యామిక న్యాయం'లో
బాహాటంగా ఏపుగా ఎదిగి
నల్లగా, వికృతంగా రాటుదేలింది !
రంగూ రూపుల దేముందనుకుంటే

వాసనలేని పూలు పూసింది—
ఆశలు తీర్చని కాయలు కాసింది—
కొమరి కొమరి వించి కత్తులు దూస్తూ
తుమరి చెట్టుగా నిలిచింది !
ఫ్ ! ! !......

కడుపు నింపుకోవడం కోసమే
బతుకుతున్న, బాధల్ని భరిస్తున్న, దారుణంగా బలౌతున్న
కొన్ని అమాయకపు మేకల్లా
'దాన్నే గొప్ప వరం'గా భావించి,
ఆ పూలకోసం ఆ కాయలకోసం మునికాళ్ళెత్తక
అనువంతుగా చైతన్యగీతాలు ఆలపిస్తున్న
సాహిత్యం, కళలూ నిషేధించ బడుతున్నాయి!
తమ బాధ్యతగా, కప్పివేయబడుతున్న పచ్చినిజాల్ని
ఎత్తిచూపుతున్న
మేధావులు నిర్బంధించబడుతున్నారు!
ఈ ముళ్ళ వ్యవస్థను కూల్చడమే
తమ ఆశయంగా గొడ్డలిపెట్టులై విజృంభిస్తున్న
అన్నలు అక్కలు బందీలౌతున్నారు!
ఉరితీయబడుతున్నారు!!
ఖండించినవారు చీకటి గదుల్లో
చిత్రహింసలకు గురౌతున్నారు! ష్—

కంఠశోషతో పడిపోకుండా
ఆ మృతవీరుల ఆఖరి కోరికల ఉగయాలు
ఆసరాయిచ్చి, ఆదుకుంటాయని
కలం ధైర్యం— కానీ;

జాతీయ జెండామాత్రం ఏం చేస్తుంది?
ఈ కుళ్ళు వ్యవస్థలో అదీ ఓ ఖైదీయే—
ఏ చెయ్యో చెరవిడిపిస్తే తప్ప
ఆకాశంలో రెపరెపలాడదు; అంతవరకు ఆనందంతో
పిల్లలదండు జాతీయగీతం గిపెట్టదు!!

# ప్రేమ - కామం

శ్రీ రామినేని ఫణి

వెన్నెల్ని
దోసిళ్ళతోపట్టి
ఎవరికో యిద్దామని బయల్దేరాడు
వాడు !
ఊరికినే యిస్తానంటే
వెలలేని వెన్నెలమాకొద్దు
దొంగ చీకట్లు కలిసిన
అమావాస్య వెలుతుర్ని యివ్వు
యివ్వాలనుకుంటే అన్నారు.
ఎవరు తీసుకోని
వెన్నెలదోసిళ్ళను విదిల్చేసాడు

వెన్నెల వెర్రిదానిలా వ్రేళ్ళకొనల్నుండి
జారిపోయింది
తూర్పుదిక్కుల వెలుగులో
చేతులు కడుక్కొని
చిక్కని చీకటుంది, కొంటారా ?
అని వర్తకపు వీధికి
చీకటిన అమ్ముకోవటానికి వెళ్ళిపోయాడు
వాడు.
వాడి వెనుక
అపార జనసందోహం

వచ్చేసిందిక! భారతదేశపు మొట్టమొదటి
'మాయిశ్చర్ బ్యాలన్స్‌డ్' సబ్బు

# క్లియర్-టోన్

## చర్మ సంరక్షణ సబ్బు

అరచెట్టకుండా శుభ్రపరుస్తుంది. జిడ్డులేకుండా మృదువుగా చేస్తుంది







క్లియర్-టోన్ సబ్బులో ప్రత్యేకమైన పదార్థాలున్నాయి— అవి శాస్త్రీయంగా నరిసమానమైన తీరులో వున్నాయి. అవి మీ చర్మంలోకి చొచ్చుకుపోయి శుభ్రపరచి, దాంతోటే మీ చర్మాన్ని మృదువు పరచడం కోసం క్లియర్-టోన్‌లో గల పేరెన్నికగన్న "మాయిశ్చరైజర్" ముఖ్యమైన ద్రవ పదార్థాలతో మీ చర్మానికి పోషణనిస్తూంటే. మరి దీనిలో గల సౌందర్యంపండే నురుగ మీ చర్మాన్ని శుభ్రపరుస్తూ, నున్నబరుస్తుంది. క్లియర్-టోన్‌తో కడుక్కోవడంతో మీ చర్మానికిక హిమ బిందువు లాంటి తాజాదనపు స్వచ్ఛత, సహజంగా వుండే ఆ లక్షణమూ వస్తుంది—పొడిపొడిగా, జిడ్డుగా వేలా కాదు. మరి దాంతోటే క్లియర్-టోన్ సబ్బుకే ప్రత్యేకంగా గల, అంటిపెట్టుకుని జీరాడే ఫ్రెంచి సుగంధం కూడాను. క్లియర్-టోన్ సబ్బు. దీంతోయిక మీ చర్మం మరింత తాజాగా, మృదువుగా, ఆరోగ్యవంతంగా రూపొందుతుంది.

**క్లియర్-టోన్**

చర్మ సంరక్షణ సబ్బు

లండన్ • పారిస్ • న్యూయార్క్

# మొదలెట్టండి యివాళే-
# 6 వారాల్లో చూడండిక-

వంటిఛాయను మెరుగుపరిచే క్రీమ్

# క్లియర్-టోన్

మీ రంగురూపాల్ని కొత్తదనంతో రూపొందిస్తుందిక

**1వ వారం**




కోమలమైన చర్మం కేవలం
మూడు రోజుల్లో!

**2వ వారం**



మొటిమల గుర్తులు పోతున్నాయి...
అబ్బ ఎంత హాయి!

**3వ వారం**



చూసావా, మోచేతులు
నిగనిగలాడుతున్నాయి అప్పుడే.

**4వ వారం**



"నీ ముఖానికి ఛాయవచ్చి మెరుస్తోంది."
అంది ఓ మిత్రురాలు.

**5వ వారం**



ఎండలోకెళ్ళినా, వాడదిక చర్మం.

**6వ వారం**



ఇప్పుడు నేనున్నా క్లియర్-టోన్
బృందంలో!

క్లియర్-టోన్‌లోని అద్వితీయ సూత్రీకరణ, మీ చర్మానికి మరింత మెరుపునిస్తూ మరింత మెరుగైన ఛాయతో రూపొందిస్తుంది. సున్నితంగా. అంతేకాదు. క్లియర్-టోన్‌లో గల ఒక ప్రత్యేకమైన పదార్థం, అసహ్యమైన ఆ మచ్చల్ని పోగొడుతుంది. దీనిలోగల ప్రభావమైన 'మాయిశ్చరైజర్' మీ ఛాయను యితరులు మెచ్చుకునేటంతగా మెరుపునూ, మృదుత్వాన్నీ యిస్తుంది.
ఇదంతా కేవలం 6 వారాల్లో!
చక్కని ఆ ఫలితాలు అలాగే వుండటానికోసం క్లియర్-టోన్‌ని రోజుకు రెండుసార్లు రాసుకుంటూ వుండండి. యింట్లోనూ, ఎండలో బయిటికి వెళ్ళినప్పుడూను.




**క్లియర్-టోన్**

లండన్ • పారిస్ • న్యూయార్క్

daCunha/CLS/14/85/TEL

"ఠి"

# ప్రాచీన గ్రీకుల అహేతుక భావసరణి

**ఉపోద్ఘాతము**

గ్రీకులు (వీరినే మనవారు "యవనులు" అన్నారు) పేరువినగానే మనకు చప్పున తట్టే భావం ఏమంటే తత్వం, హేతువాదం, శాస్త్రీయత, సౌందర్యం (గ్రీకు భాషలో "కలోస్"=కళ), క్లాసిసిజం అని సాహిత్యంలో ఏ ధోరణని అంటామో, దానికి మాతృక ప్రాచీన గ్రీకు సాహిత్యమే. క్లుప్తత, సౌందర్యం, అంగాంగ సంశ్లిష్టత, అచ్చుకట్టుతనం మానవత గ్రీకు సాహిత్య లక్షణాలు. గ్రీకులు శాస్త్ర పారీణులు శాస్త్రీయ సూత్రీకరణానికి మూలమైన "ఇండక్టివ్" పద్ధతి[1] గ్రీకులే ఆద్యులు. గ్రీకులు తర్కం, గణితం[2], రేఖాగణితం కనిపెట్టిన వారని పాశ్చాత్య చరిత్ర కారుల కథనమైయున్నది. యవనుల శాస్త్ర పారంగత్వం మన ప్రాచీనుల ప్రశంసలందుకొన్నది.

గర్గుడంటాడు :

> మ్లేచ్ఛాహి యవనాస్తేషు
> సమ్యక్ శాస్త్ర మిదం స్థితం
> ఋషివ త్తేపి పూజ్యంతే
> కింపున ర్దైవ విద్ద్విజః :

యవనులు మ్లేచ్ఛులయినంత మాత్రమేమి? వారిలో స్థిరపడిపోయిన, శాస్త్రం వారిని ఋషులనువలె పూజనీయుల చేయదా అని హోమరు, సాఫోక్లీసు అరిస్టాటిలు వంటి వారిని లెక్కలోకి తీసికొంటే, ప్రాచీనగ్రీకులు సమచిత్తులనీ హేతువాదులనీ అనిపించడం సహజమే. కానీ, వీరే సమస్తగ్రీకులుకారు, కదా! గ్రీకుల ఇతిహాసాలలో, కావ్యాలలో, నాటకాలలో, శాసనాలలో, శాస్త్రాలలో తొంగిచూస్తున్న ఆదిమజాతి మనస్తత్వాన్ని, హేతురాహిత్యాన్ని గ్రీకుచరిత్ర కారులు కళ్లుమూసుకొని కప్పదాటువేసినారు. పసిఫిక్ దీవులలో నివసించే ఆదిమ నివాసులను, తమ మానవశాస్త్ర పరిశోధనలకు గురిచేసిన పరిశోధకులు, గ్రీకులకు మాత్రం "శుద్ధ చీటిని" ఎందుకిచ్చినారు? గ్రీకుల దైనందిన జీవితంలో శారసపద్ధ మూఢవిశ్వాసాలు, గుడ్డి ఆచారాలేవి? గ్రీకుమేధావుల ఆలోచనా సరణిలో అహేతుకత ఎంత మోతాదులో వుంది? మున్నగు ప్రశ్నలు వస్తాయి.

ఇ. ఆర్. డాడ్సు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో గ్రీకు ప్రాచార్యుడు "గ్రీకులు - అహేతుకత"[3] అనే పుస్తకాన్ని 1950లో ప్రచురించినాడు. అందులో ప్రాచీన గ్రీకుల మనస్సులలో, వచనాలలో, చేతలలో కన్పడిన అహేతుకతను వివరిస్తాడు. ఆ పుస్తక సారాంశమునే ఈ వ్యాసంలో పాఠకులకు నివేదిస్తాను. ఇప్పుడు నేను వ్రాయబోయేదీతి, డాడ్సుతానే తెలుగులో వ్రాసినట్లుంటుంది. ప్రధాన వ్యాసంలోని ఉత్తమపురుష ("నేను") సర్వనామం, క్రియాపదం, ఇ. ఆర్. డాడ్సుకే చెందుతాయికాని ("ఠి")కి కాదు. నేను (అంటే "ఠి")గా ఏమైన చెప్ప వలసిందివుంటే, అధోజ్ఞాపికలలో ధావత్ వ్యాఖ్యాన ప్రాయంగా వ్రాస్తాను. పఠితల ఆసక్తి కోసం మూలగ్రీకు వాక్యాలనే ఉద్ధరిస్తాను. ఈ వాక్యాలు డాడ్సు ఉటంకించినవే. నేను చేసిందెల్లా గ్రీకులిపిని అర్థం చేసికొని తెలుగులిపిలో వ్రాయడం మాత్రమే ఇప్పుడు హేతువాదం, అహేతుకత అనే పదాల అర్థం తెలుసు కోవలెను. అహేతుకతను ఈలాగు నిర్వచిస్తాను.

(i) ఏ విషయం న్యాయ (తర్క) సూత్ర పరిభాషలో చర్చింపబడదో,

(ii) ఏ పదార్థం ఇంద్రియ జ్ఞానానుభవం చేత తెలియరాదో,

(iii) ఏ ప్రక్రియ శాస్త్ర ప్రయోగాల ద్వారా పరీక్షింపబడి, సరియని స్థిరీకరణం గానీ తప్పు అని నిరాకరణం గానీ చేయబడదో అది అహేతుకత.

విశ్వాసం పైన ఆధారపడిన భావం, వాక్కు, క్రియ అహేతుకం.

అధిభౌతికంగా వివరించే అంశాలకు మానవాతీత శక్తులు కారణములనుట అహేతుకత.

ఒక సంఘటనను తెలిసిన పరిజ్ఞానం ఆధారంగా వివరించడం మాని తెలియని విషయాల ఆధారంగా చెప్పరాదు ఈ నియమాన్ని "ఓకంక్షుర" ("ఓకంస్ రేజర్") అంటారు, "విలియం ఓఖాం" మధ్యమయుగ (క్రీ. శ. 14వ శతాబ్దం) క్రైస్తవాచార్యుడు. ప్రతిదానికి భగవంతుని బాధ్యునిగా చేసే తత్కాలీన దుస్సంప్రదాయాన్ని అరికట్టడానికి ఆ నియమాన్ని చేసినాడు. అయినా ఈ "క్షుర" హేతువాదానికీ శాస్త్రీయతకు దోహదం చేసిందంటారు పాశ్చాత్య పరిశీలకులు.

అహేతుకతకు ఉదాహరణాలిప్పడిస్తాను.

విధి, అదృష్టం, అశౌచం (ఆరోగ్య సంబంధికాక) ప్రాయశ్చిత్తం, శాంతి, ఆత్మ (జీవ, పరమ), పరలోకాలు, దివ్యశక్తులు (అణిమాది, దూరదృష్టి ఆది), శకునాలు, పూనకాలు, జ్యోతిషం, సాముద్రికం, ఇంద్రజాలం (హస్తలాఘవ రకంకాక), స్వప్న వృత్తాంతాలు, తాయెతులు, రక్షరేకులు, కవచాలు, అంజనాలు, పరకాయ ప్రవేశం, పునర్జన్మ, భూతవైద్యం, మంత్రతంత్రం, అభిచారం, సమ్మోహన విద్యలు, దిష్టితగులుట, తీయుట. ఒట్టుపెట్టుట, మ్రొక్కుబడి రోగదేవతలు, భూతప్రేతపిశాచాదులు, కాకకూట, బ్రాహ్మణ భోజనదర్శనం మృత్యుదాయకం, జల, పశు, పక్షి, సరీసృప, ఖనిజాలకు మహిమలు కలవు, జంతుబలి, అన్నపానాలలో కొన్ని నిషేధాలు. పాశ్చాత్యుల పరిభాషలోని హిప్నాటిజం, మెస్మరిజం, టెలిపతి, ఇ. ఎస్. పి. మొదలయినవి పౌర జీవితంలోని కొన్ని ఆచారాలు. ఉదా: కోర్టులలో సాక్ష్యమిచ్చేముందు చేయించే ప్రమాణాలు మంత్ర్యాదులు పదవీ స్వీకారం చేసేముందు పనవప్రమాణాలు. జాతీయపతాక వందనం.

సృష్టికి మూలం ఏది అంటే హేతువాది "నాకుతెలియదు" అనవచ్చును. అహేతుక వాది "దేవుడు" అని టపీమని ఉత్తరం ఇస్తాడు. నాకు తెలియదు అన్నవానిని చార్వాకుడనీ, నాస్తికుడనీ, లోకాయతుడనీ కౌలుడనీ పాషండుడనీ, చండాలుడనీ శాపనార్థాలు పెట్టుతారు. "దేవుడు" అన్నవానిని స్వామి, భగవాన్, ఆచార్య, ప్రవక్త, వేదాంతి వంటి గౌరవసూచక పదాలతో సంబోధిస్తారు. మహాభారతంలో చార్వాకుడనే బ్రాహ్మణుని రాక్షసుడని చంపుతారు. రామాయణంలో జాబాలికంత దశపట్టలేదు కాని, ఆయన కామన్‌సెన్సుమాట్లాడితే, శ్రీరాముడు రెచ్చిపోయి చెడామడా తిట్టుతాడు, "నాస్తిక హేతువాక్య" అనే సమాసాన్ని

శ్రీరాముడు వాడుతాడు. తథాగత బుద్ధుని చోరుడంటాడు (యథాహిచోర; సత థాహి బుద్ధ స్తథాగతం) బైబిలులో "జాబ్" అనే ఆయనని భగవంతుడు ఈ నా ప్రశ్నలకు జవాబివ్వుము. సముద్రాలని ఎవరు చేసిరి ? మంచు నెవరు సృష్టించిరి? మొక్క ఎలా మొలుస్తుంది? నీకుతెలుసా వంటి ప్రశ్న పరం పరలను కురిపిస్తాడు. సర్వమూ పోగొట్టుకొని యున్న సంశయాత్ముడు జాబ్ ఏం చెప్పగలడు. త్వమేవ శరణం మమ అనుటకు బదులు ! "సర్వదర్శన సంగ్రహం"లో చార్వాకులిటు వంటి ప్రశ్నలకే (అగ్నికాలుతుంది. నీరు చల్లగుండ.) అది సహజ సిద్ధం అని ఉత్తరమిచ్చినట్లు వ్రాయబడింది.

హేతువాది, శాస్త్రజ్ఞుడు "నాకు తెలియదు" అన్నారా ఇక చూడండి. అక్కడికి దైవాలు, దయ్యాలు, దైవజ్ఞులు, భూతవైద్యులు, మంత్ర తంత్రాలు దుముకుతూ వస్తాయి. హేతువాదులనూ శాస్త్రజ్ఞులనూ నోరుమూయించడానికి సాధారణంగా అడిగే ప్రశ్నలూ సంశయాలూ ఏమంటే ఈసృష్టి ఎట్లువచ్చింది ? జనన మరణాలెందుకు కలుగుతాయి ?ఒకడు కురూపి కావడానికి, ఇంకొకడు సురూపి కావడానికి కారణమేమి ? ఒకడు రోగి, ఒకడారోగ్యవంతుడూ ఎలా అయినారు , ఒకడు పేద, ఇంకొకడు భాగ్యవంతుడు ఎందుకు కావలెను ? మంచివాడు గష్టపడటం, చెడ్డవాడు సుఖపడటంలో అంతర్యమేమి? ఇత్యాది. అక్కడి హేతువాది, శాస్త్రజ్ఞుడు చెప్పజాలని పక్షంలో ఈ పృచ్ఛకులు చెప్పేటట్లు ! ఈ ప్రశ్నలకన్నింటికీ హేతువాద, శాస్త్రకీతులలో సదుత్తరాలీయ వచ్చును. ప్రచ్ఛకులే ఉత్తరాలీయలేక "దేవుడు", "అదృష్టం", "కర్మ" వంటి మాటలు చెప్పి కప్పదాటు వేయవలసి వస్తుంది.

ఏమయినా, అహేతుకత ఆదినుండి నేటివరకూ మానవుణ్ణి తగుల్కొనియే ఉన్నది. అహేతుకత కేవలం మూఢ విశ్వాసాలతో ఉండిపోలేదు. చరిత్రలో జరిగిన ఘోర రణాలు, విప్లవాలూ అహేతుకతా విలసనాలే అహేతుకతా విముక్తికోసం ప్రయత్నించడమే సంస్కృతీ సూచకం. ఇక ఇ. ఆర్. డాడ్స్ ఉవాచ :

## 1. అగమెమ్నన్ పాటు

నేను కొన్నివేండ్ల క్రితం బ్రిటిష్ వస్తు ప్రదర్శన శాలలోని పార్థినాన్ (గ్రీకు దేవాలయం) శిల్పాలను తిలకిస్తూ వుండగా, ఒకయువకుడు నాదగ్గరికివచ్చి 'ఈలాగనడం కష్టంగా ఉన్నా, ఈగ్రీకుతుక్కు నాకు నచ్చలేదండి" అన్నాడు.

"ఎందుకు" అన్నాను నేను. "అది అంత ప్రచండ హేతుబద్ధంగా ఉండడం వల్లనే" అన్నాడతడు. ఈ వాక్యం నా మనస్సులో అతికికొని పోయింది. పాచీన గ్రీకుల జీవితంలోని అహేతుక విషయాలపై ఆలోచించ మొదలుపెట్టినాను. ఈ గ్రంథంలోని విషయాలకు ఆ యువకుని వాక్యమే ప్రేరేపకం. మొట్ట మొదట హోమరు వ్రాసిన "ఇలియడ్" [4] లోని ఒక ఉదంతాన్ని తీసికొంటాను. ఏకిలీజ్ [5] ప్రియురాల్ని చెరగొన్న అగమెమ్నన్ [6] అంటాడు "నేనుకాదు" బాధ్యుణ్ని. నాలో ప్రేరణ నెలకొల్పిన నా విధియే దీనికి కారణం. గ్రీకులలో విధి ప్రేరణపైని నమ్మకం ఉండేది. దీనికే "ఆటే" అంటారు. "ఆటే" అంటే విచక్షణ క్షీణించడం, మతిపోవడం. దీనిని ప్రేరేపించేది గ్రీకులో "మొయిరా"[7] అంటారు. తమకు కలిగిన అనర్థాలకు "మొయిరా" యే కారణమని "ఇలియడ్" లోనూ 'ఒడెస్సే" లోనూ పాత్రలు తమ వైరిచేష్టలకు, సంజాయిషి, లేదా క్షమాపణ ఇచ్చుకొంటారు. ఇది ఒకసాకు. తాను చలిలో ఉత్తబిత్తలై పరుగెత్తేదుకూ 'మొయిరా" ప్రేరేపించిన "ఆటే" యే కారణమంటాడు "ఒడెస్సే" లోని మహావీరుడు యులిసిసు !! ఏపని చేయడం సిగ్గుచేటును తెస్తుందో, ఆ పనికి కాము బాధ్యులం కాము అని చెప్పడమే దీని అంతర్యం. లజ్జాభావమే జీవన సరణికి పునాది కావున ఈ వ్యవస్థను "లజ్జాసంస్కృతి" అంటాను. వీర యుగం అనబడే హోమరు కాలపు సంస్కృతీ లక్షణం ఇది

## 2. లజ్జా సంస్కృతి నుండి పాప సంస్కృతికి

మనిషి నడవడిలోని అహేతుకతకు మానవాతీతశక్తులు కారణాలనేది. హోమరు యుగ భావ సరణి అని చెప్పితిని ఇప్పుడు ప్రాచీన యుగం (క్రీ. పూ. 1000—600) అభిజాత్య (క్లాసికల్) యుగం (క్రీ. పూ. 500—300)లలోని గ్రీకుల అహేతుక ప్రక్రియలగురించి చెప్పుతాను. హిసియోడ్ తియోగ్నిసు, ఇస్కైలజ్, హిరోడోటసుల రచనలు ఈయుగ భావనా ధోరణులకు ప్రతినిధులు[8] హిరోడోటసు ప్రకారం దైవం అసూయాపరం. జోక్యం కల్గించుకుంటుంది. (/ఫ్తొనెరోన్/ టె /కాయ్ /టరక్సుడెస్/" ) ఈ యుగాల ముఖ్యలక్షణం అశౌచం ("మయాస్మా") ఎడల గల భీతాహం దీనికి శుద్ధి ("కెతార్సిస్") కావలె. [9] అశౌచాన్ని క్షాళనం చేయవలె. అశౌచం స్పర్శవల్లనే కాక వంశపారంపర్యంగానూ వస్తుంది. అశౌచం పాపభీతిని పుట్టిస్తుంది. అహేతుకమైన ఆవేశాలు దయ్యాలుగా రూపించబడ్డవి, [10] ఆశ, భయం వినాశకర భూతాలంటాడు తియోగ్నిస్. ఇప్పటికీ గ్రీసువాసులు ఫలానా కొండ కోనలో మూడు దయ్యాలున్నాయని నమ్ముతారు. వాటిపేర్లు మసూచికం, కలరా, ప్లేగు [11] "ఆటే", ఆవేశాలు, రోగాల తర్వాత మనిషిని వెంటాడే దయ్యం అదృష్టం. హిరాక్లిటసులాంటి తాత్వికుడు / ఈథోస్/ ఆంత్రొపోవ్ / డైమన్ / (శీలమే అదృష్టం) అని చెప్పినా, పురాకృత, ప్రారబ్ధ భాగ ధేయంపైని విశ్వాసం గ్రీకులకు పోలేదు. దీనినాధారంగా చేసుకొని ప్రాచీన యుగగ్రీకులది "పాపసంస్కృతి" అనవచ్చును.

దేవుళ్ళు అసూయాపరులు. సహనంలేనివారు. నీవు కాని, నీ పూర్వీకులు కాని చేసిన పాపానికి శిక్ష తప్పక విధిస్తారు. ఫీనిక్సు, హిప్పొలైట్, ఇడిపసు వంశ చరిత మిందుకు తార్కాణం[12] సొఫోక్లిస్ పురాతన యుగపు తుది ప్రతినిధి. ఈయన త్రాసదాలలో పాపసంస్కృతి సంపూర్ణ స్వరూపం, మానవాతీత శక్తుల యెడ మనిషి నిస్సహాయత, మానవుడు సాధించినాననుకొనే మహత్కార్యాల డొల్లుతనం బాగా రూపించబడినాయి.[13] "అంటిగొనె" త్రాసదంలో అంటిగొనె (నాయిక) అంటుంది. "ఇప్పటికాలంలో, తర్వాతికాలంలో, విస్మృతకాలంలో—ఇదే నియమం వినాశం లేకుండా మానవ జీవితాన్ని ఔన్నత్యం స్పృశింపదు".

పాశ్చాత్య మానవుని భావవారసత్వమిది అంటే సమంజసంగా ఉంటుంది.

## 3. ఉన్మాదం ఇచ్చే వరప్రసాదాలు

టే / మెగియోస్ట / టూన్ / అగథూన్ / ఏమిన్ / గిగ్నటాయ్ /డియా/ మానియాస్ / [14] అని పాశ్చాత్య హేతువాద పితామహుడనదగిన సోక్రటీస్ అన్నాడు. కాని, దీనికి ఒక షరతు విధించినాడు. అదేమంటే ఆ ఉన్మాదం, దైవ దత్తం, దివ్యం అయి ఉండవలెను.

సోక్రటీసు నాలుగు విధాలయిన ఉన్మాదాలు పేర్కొన్నాడు

1. కాలజ్ఞానం- దీనికి అధిదేవుడు అపోలో [15]
2. ఉత్సవం- దీనికి అధిదేవుడు డయోనిసను [16]
3. కవిత్వం- దీని అధిదేవతలు చదువుల రాణులు [17]
4. కామం- దీనికి అధిదేవత అఫ్రొడైటు, ఆమెకొడుకు ఎరాస్ [18]

ప్రాచీనయుగ గ్రీకులది పాపసంస్కృతి అని చెప్పితిని పాప పరిహారార్థం ప్రాయశ్చిత్తమో, శుద్ధియో కావలయును. గ్రీకులకు ఒకమతం, ఒకచర్చి అని ఉండినాయికావు. [19]పారశీకులతోడి యుద్ధాల (క్రీ. పూ 5వ, శతాబ్దం) వలన సతమత మయిపోయిన గ్రీకులకు, దేవుళ్ల ఈర్ష్యాద్వేషాలు, అశౌచభయం వల్ల నిస్పృహ చెందిన గ్రీకులకు అభయప్రదానంగా డెల్ఫిలోని కాలజ్ఞాన (దైవజ్ఞ) పీఠం నెలకొనింది, [20] ఇచట అపోలో ఆలయం, పర్నాసను పర్వతం, కోన, చెలమ, గుహ ఉన్నాయి. ఇచట అపోలో జనుల ప్రశ్నలకు సముచిత జవాబు

లిస్తాడు.[21] శోకభయ స్థానాలలో వుండే జనులకు, విపత్తులోవుండే ప్రభుత్వాలకీ సమాధానాలు దొరుకుతాయి. అపోలో అదృశ్యుడు ఎట్లా సమాధానాలు చెప్పుతాడంటే, ఒకమనిషిని ఆవహించి, ఆ వ్యక్తి ద్వారా చెప్పుతాడు. దీనికే "అరకల్" (అశరీర దివ్యవాణి) అంటారు.

"అరకల్" తతంగం ఇట్లా ఉంటుంది : పైథియా అనే స్త్రీగణాచారి వుంటుంది. (ఈమెకు చదువురాదు. లోకానుభవం లేనిది. సేద్యగాని కూతురు కావచ్చు.) ఈమె స్నానం చేసి పవిత్రచెలమనీరుత్రాగి, పవిత్ర లారెల్ ఆకులు[22] నమలి, వాటిమండపట్టుకొని, గుహలో బీటలవారిన రాతిపై వేసిన ముక్కాలి పీట పై కూర్చుంటుంది. లారెల్ ఆకులు నమలడంమూలానా, బీటలనుండి వస్తున్న వాయువులమూలానా ఆమెకు మైకం వస్తుంది. పూనకం వస్తుంది.[23] అప్పుడామెను కాలజ్ఞానదేవత అపోలో ఆవహిస్తాడు.[24] ఈ స్థితిలో ఎవరైనా ప్రశ్నవేయ వచ్చును. ఒక పేద రైతుకావచ్చు గ్రీకుప్రభుత్వమూ కావచ్చు. ఆ ప్రశ్నను, గుహ వెలుపల ఉండే పురోహితులు పైథియాకు వినిపిస్తారు. సెలవిమ్మని వేడు కొంటారు. వెంటనే ఆమె ఏవేవో అర్థంలేని వింతశబ్దాలను చేస్తుంది. వీటిని ఆ పురోహితులు ఛందోబద్ధంగా ఇమిడ్చి ఇదే మీ ప్రశ్నలకు కాలజ్ఞానం అని పృచ్ఛకులకు చెప్పుతారు ఇదొక రకమైన జోస్యం. ఊహాకల్పన[25] ఈ పురోహితులు చతురులు అనుభవం కలవారు. మాటకారి తనం గలవారు. గ్రీకుదేశ పరిస్థితులను గమనిస్తూ వుండేవారు. డెల్ఫీకి ఎన్నిరకాల మనుషులు అనేక ప్రాంతాల నుండి వచ్చేవారు. వారినుండి వార్తలనూ, విశేషాలను సేకరించుకొనే వారు. సమయానుసారం ప్రశ్నకు కాలజ్ఞానం చెప్పేవారు. పైథియాచెప్పేది రణగొణ ధ్వనియే. వీరు చెప్పేదే వేదం. ఆ చెప్పేది అస్పష్టంగా నానార్థకంగా, ఏ సందర్భానికైనా అతుకుకొనేటట్లు ఛందస్సులో చెప్పేవారు.[26] పృచ్ఛకుల సమస్య తీరితే కాలజ్ఞానమహిమ. లేదా మీ "అదే", మేమేమి చేసేది అని దాటవేయుట. ఏమైనా, డెల్ఫీలోని కాలజ్ఞానపీఠం ఎంత హేతువిరోధకమైనా, ప్రాచీన గ్రీకుల బ్రతుకులను ఉద్ధరించేందుకు తోడ్పడిందనడంలో సందేహంలేదు సత్యం, ధర్మం, దేశభక్తి, చట్టగౌరవం మున్నగునవి జనులలో నెలకొనజేసింది డెల్ఫీ, సోక్రటీను ఉత్తమోత్తమజ్ఞాని అవుతాడని చెప్పినది కూడా డెల్ఫీ కాలజ్ఞానమే. ఇక రెండవ ఉన్మాదం. డయోనిసస్సుప్రేరేపించే ఉత్సవోన్మాదం.[27] ఇది త్రాగితందనాలాడడమే. జంతువులను చీల్చినెత్తురు త్రాగడం. శివమెత్తినట్లు ఎగరడం, ఆయాసంవచ్చి పడిపోవడం. ఇది వినోదం కోసం కాదు. మాతావేశం దీని మూలం. గ్రీకు మార్మికతత్వం, ప్రాసదాలు, తోషదాలు మున్నగు వానికి డయోనీసీయ కర్మ కాండే మూలం.

ఇక మూడవ ఉన్మాదం - కవిత్వం.[28] "మ్యూసు"ల దయ వల్లనే కొందరు కవులవుతారంటాడు హీసియోదు. హోమరు కూడా అప్పుడప్పుడు తానేమి చెప్ప వలెనో సెలవిమ్ము అని "మ్యూసు"ను ప్రార్థిస్తూవుంటాడు. పిండర్ కవితా దేవతను "సెలవిమ్ము. నేను నీ భాష్యకారునిగ ఉంటాను"[29] అని అంటాడు కవికే తెలియని భవ్యావేశం పవిత్ర ఉచ్ఛ్వాసనిశ్వాసములతోనే కవిత సాధ్యం [ / "మెట్ / ఎంతూసి యాస్మోవ్ / కాయ్ / ఐరోవ్ / నూమటోస్"/] అనేది డెమొక్రిటస్ సిద్ధాంతం. కవి, తానుకాక, ఎవరి ప్రేరేపణ వల్లనో వ్రాయగలుగుతున్నాననుకొనుట అహేతుకత. ప్లేటో ఈ వాదానికి వ్యతిరేకి, ప్లేటోప్రకారం "కావ్యదేవత" కవిలోనే ఉంది.

[ /"అల్లి / టిన్ / మౌన / పలాయ్ / సె / ఈనౌన / ఏవెలిథీయి"/] నాల్గవ ఉన్మాదమైన కామం గురించి "ప్లేటో" శీర్షికలో చెప్పుతాను.

## 4. స్వప్న సరణి - సంస్కృతిసరణి

గ్రీకులప్రకారం జాగ్రదవస్థ, స్వప్నావస్థ ఉన్నాయి[30] హోమరు కాలపు వ్రాతలలో స్వప్నం ఎట్లు వస్తుందంటే, దేవుడు కాని దయ్యంకానీ నిద్రించిన వాని తలప్రక్కనిలబడి చెప్పేదేదో చెప్పిపోతాడు గ్రీకు భాషలో మనిషి స్వప్నాన్ని "చూస్తాడు."[31] గ్రీకు సంప్రదాయంలో స్వప్నాలు మూడురకాలు సంకేతాలతో గూడి నిగూఢార్థంకలవి[32] మొదటివి, రెండవవి. భవిష్యత్తులో జరుగబోయేది ఇప్పుడే కనబడుట.[33] ఇక మూడవ రకంవి, కలగనువానితండ్రియో, దేవుడో వచ్చి ఏమిచేయవలెనో, ఏమిచేయరాదో స్పష్టంగా ఆదేశించేవి[34] గ్రీకులకు ఎక్కువగా పడే కలలేవంటే, దేవుళ్లు కనపడి తమకు గుడికట్టించమనో, ధూప దీప నైవేద్యాలకేర్పాట్లు చేయించమనో ప్రాధేయమయినాపడుట, ఆదేశించుట అయినా చేయుట.[35] ఒక గ్రీకు ప్రాచీన శాసనంలో పూజారికి దేవుడు కలలోవచ్చి, తాను తుక్కిలోవున్నాననీ, ఒక చక్కని మందిరం కట్టించరాదూ అని ప్రాధేయపడినట్లు చెప్పబడింది. ఇష్టప్రాప్తికై దివ్యస్వప్నం రప్పించు కొనేందుకు చాలా మార్గాలున్నాయి. ఏకాంత వాసం ధ్యానం. ఉపవాసం, అంగవిచ్ఛేదం, భూశయనం, పవిత్రక్షేత్రంలో నిద్రించుట.[36] ఈ కడపటిది గ్రీసులో బాగా వ్యాపించింది. ఎపిడారస్‌లో అస్క్లిపియసు దేవాలయం వెలసింది[37] రోగులు సేవచేసేందుకు అచటికిపోయేవారు. పెద్దపెద్ద సత్రాలుండేవి. రోగులచ్చట పరుండేవారు. రాత్రి కలలో అస్క్లియసు కనపడి రోగాన్ని నయమన్నా చేస్తాడు. లేదా చికిత్సా విధానమైనా చెప్పుతాడు. రోగులు ప్రొద్దుననే లేచి రోగం నయమైనట్లే తృప్తి జెంది, స్వామికి ముడుపు చెల్లించి వెళ్లిపోతారు. కలలో చెప్పబడిన చికిత్స మలబద్ధానికి ఆకుకూరలు తినుమని అయినా కావచ్చు. గొంతు నొప్పికి కషాయం త్రాగుమని అయినా కావచ్చు. ఇక నయం చేసే విధం ఎట్లంటే, ఆ దేవాలయం వారు కొన్ని నిరపాయకరపాములనూ, కుక్కలను పెంచివుంటారు. వాటితో రాత్రి మగతనిద్రలోవుండే రోగి యొక్క పుండిని కానీ వాపునుకానీ నాకింపిస్తారు. ఆ నాకడం స్పర్శ అస్క్లియసు ఏదో చికిత్స చేసినాడనే భ్రమ రోగులలో గాఢంగా నెలకొంటుంది. ఇట్టి దృష్టాంతాలు 1888లో దొరికిన ఎపిడారస్ దేవాలయ రికార్డులలో చాలా కన్పిస్తాయి.[38] సిసిరో అందుకే అంటాడు.

"హిపొక్రేటిజ్[39]కు కంటే అస్క్లిపియస్‌కే ఎక్కువ ఋణపడి ఉన్నారు" అని నిద్రలో దైవాదేశం పొందే విధంగానే, జాగ్రదవస్థలో దేవతా సాక్షాత్కారం పొందినట్లున్న అనుభవాలు గ్రీసులో కలవు. కళాధిదేవతలుండే హెలికాన్ శిఖరాన వాగ్దేవత పలుకులు వింటినని హీసియోదు వ్రాసికొన్నాడు.[40] ఫిలిప్పిడెస్ మారతాన్ పరుగు తీసేముందు పార్థివాన్ పర్వతం దగ్గర "పాన్"[41] కనపడి, పరుగులో తనకు సాయం చేస్తానని అభయమిచ్చినాడని ఫిలిప్పిడెస్ చెప్పుతాడు. పిండర్ కవికి పర్వత శ్రేణిలో పెనుతుఫానులో భూమాత దర్శనమాయెనట.[42] అరిస్టాటిలు స్వప్నాలలోని దైవాంశనెంత ఖండించినా ప్రజలలో వాటిపైని విశ్వాసం పోలేదు. స్వప్నవిశ్వాసం, సంస్కృతిలో నొక అహేతుకాంశంగా నిలిచి వున్నది.

## 5. గ్రీకు షమనులు - శౌచతత్వ మూలం

దేవుళ్ళు, మానవాతీతశక్తులు స్వప్నాలద్వారా మనిషికి దివ్యశక్తులు ప్రసాదిస్తాయి అనే గ్రీకుల అహేతుక భావసరణి గురించి చెప్పితిని. ఆ దివ్య శక్తులు బయటవి కాక మనిషిలోనే అణగి ఉండవచ్చు అనే ఆలోచన కొన్ని రచనలలో కనపడుతుంది.హోమరు నాడు మనిషి చస్తే (ప్రేతం × పీనుగు) అవుతాడని నమ్మేవారు[43] మనిషిలో "ప్సైకీ" "సైకీ" అని ఉచ్చారణ ఉంది. దీనికనేక పర్యాయ పదాలు: అహం, ప్రాణం, చైతన్యం, వ్యక్తిత్వం ఆత్మ ఈ "ప్సైకీ" ఎందుకుంది అంటే మనిషినుండి వదిలిపోవడానికి అని హోమరంటాడు;[44]

సోక్రటీసు కాలం (క్రీ. పూ. 5వ శతాబ్దం) నాటికి ఆత్మ సిద్ధాంతం వచ్చింది[45] "ఆత్మ" "ప్సైకీ" వలె. మనిషిలో ఇరుకుకొనివుండి, దేహంతో సమసిపోయే డిమసుకాదు. ఈభావం గ్రీకుల రక్తనాళాల్లో పరాయి బిందువు. దీనికి సైబీరియా ప్రాంతంలో నేటికి నిల్చివుండే షమనుల సంస్కృతి అని నా భావం.[46] షమనుని స్వభావమిట్లా చెప్పవచ్చును.

షమనుడు అస్తిమిత మనస్కుడు చింతనా స్వభావుడు. అధ్యాత్మ తత్వంపై ధ్యాస కలవాడు. ఏకాంత ధ్యానం, ఉపవాసం వలన అతనికి "జ్ఞానోదయం" అవుతుంది.[47] అనేక శక్తులు సమకూడుతాయి. పరకాయ ప్రవేశం చేయగలడు.[48] ఒకేసారి రెండుచోట్ల కనపడతాడు. భూతభవిష్యత్తులు చెప్పగలడు. సర్వరోగ నివారణ చేయగలడు. తాత్విక సూక్తులు చెప్పతాడు. ఇటువంటి గ్రీకు షమనులలో ముఖ్యుడు. పైథగోరస్ (క్రీ.పూ. 6వ శతాబ్దం) పైథగోరసు తానెన్నో జన్మలెత్తినాననీ, ఇక ఎన్నో జన్మలు నెత్తుతాననీ చెప్పినాడు. ఈయనకీర వై జన్మల జ్ఞానం ఉందేవని నమ్మేవారు. ఈయన తత్వం సంగ్రహంగా ఇట్లుంటుంది." జీవాత్మ వివిధ దేహాలలో జన్మ ఎత్తుతుంది. పునర్జన్మవుంది ఆత్మకు ముక్తి అవసరం.[50] శాకాహారమే తినవలెను సర్వభూతాల్లోనూ ఆత్మ వుంటుంది.[51] నవగ్రహాలు గానం చేస్తాయి. విశ్వమంతా సంఖ్యా నిర్మితం. మౌనవ్రతం ముఖ్యం.

పైథగోరసు కంటె పూర్వుడు ఆర్ఫియసు. ఇతడు హోమరు కంటే పూర్వుడంటారు. ఈయన పేరిట వెలసిన తత్వం ఆర్ఫిజం ఆర్ఫిజంలో నైతికం జీవితం ప్రాముఖ్యం వహించింది. దుఃఖం ప్రారబ్ధార్థం [/ కౌలాయ్ /రెటా]. శౌచం తెచ్చుకోవడానికి ప్రాయశ్చిత్తం చేయించుకోవలె. ఈ విధులన్నీ పైథగోరసు మతంలో చేర్చుకోబడినాయి. మరుగు, మైల విధులెక్కువ. కసాయివారిని వేట గాండ్లను తాకరాదు. "రక్తంచిందించకు" (ఫోనోన్ / అఫెఖెస్తామ్) అనేవి ఆర్ఫిక్ సూత్రం. పైథగోరసు తర్వాత ఎంపెడొక్లిసు (క్రీ. పూ, 6వ శతాబ్దం) ముఖ్యుడు. శాస్త్రజ్ఞుడు ఋషి. పారిశుద్ధ్యం మీద కావ్యం వ్రాసినాడు. కేవలం ఒకేభూతం వల్లకాక పంచభూతాల సమ్మిశ్రం మూలాన సృష్టికలిగిందని ప్రతిపాదించినాడు.[52] అదాం చేసిన "మూలపాపం" ఉన్నా, ఏసుప్రాపకంచే మోక్షం పొందవచ్చు ననేది క్రైస్తవుల మతం. ప్రారబ్ధారం ఉన్నా జన్మ జన్మాలలో కర్మవిముక్తి పొందవచ్చుననేది ఉపనిషత్తుల సారం. గ్రీకుపారిశుద్ధ్య వాదికి తానొకేసారి దైవంగా, పాపిగ ఎందుకవుతున్నాడో బాగా తెలుసు. అది తర్కంతంకంటె లోతుగా పోయిన భావసరణి.

## 6. హేతువాదం - ప్రతిక్రియ

హోమరు కాలంనుండి (క్రీ. పూ. 1000.) అభిజాత్య యుగం వరకు (క్రీ.పూ. 600) అనేక మతవిశ్వాసాలు పుంజీభూతమై పొరలు పొరలుగా ఏర్పడినాయి. నైయాయికులు[53] ప్రబలడంతో హేతువాద బలం పుంజుకొన్నది. వీరికంటే ముందు "ప్రబోధయుగం" వెలసి వుండింది. క్రీపూ. 6వ శతాబ్దంలో హెకటేయసు, గ్జినోఫేన్సు, హీరాక్లిటసు వ్రాతలలోనూ, అనగ్జగోరసు, డెమొక్రిటసు సిద్ధాంతాల ద్వారానూ జ్ఞానకాంతి ప్రసరించింది. హోమరు పురాణాలను, హెకటేయసు గేలి చేసినాడు. శకునాలను ఖండించినాడు. గ్జినోఫేన్సు, హీరాక్లిటసు రచనలు సంప్రదాయాచారాలను పటాపంచలు చేసినాయి.

హీరాక్లిటసు "పెంటకంటే పీనుగురోత" (నెక్వెస్/కొ ప్రియోన్ /ఎక్ బ్లి జోటె రాయ్/")అని పితృపూజ, శ్రాద్ధకర్మలను నిరసించినాడు. మృతవీరుల గౌరవం ప్రాతిపదికగా, కల గ్రీకుగ్రాసదాలు యుద్ధచరిత్ర ప్రాముఖ్యాన్ని ప్రాచుర్యాన్ని కోల్పోయినాయి "శీలమే అదృష్టం" (/ఈథోస్/ అంత్రొపోవ్/ డైమాన్/) అని ప్రారబ్ధసిద్ధాంతాన్ని వమ్ము చేసినాడు.

డెమొక్రిటసు (క్రీ. పూ. 5వ శతాబ్దం అణుసిద్ధాంతాన్ని ప్రతిపాదించినాడు అతి సర్వత్ర వర్ధయేత్తన్నాడు, ఇతనిని "ఆహ్లాద తాత్వికుడు" అంటారు. హీరాక్లిటసును "చింతాక్రాంత తాత్వికు' డంటారు. సంఘం నిర్ణయించే సంప్రదాయమా, వ్యక్తి సహజనైజమా ఏది మానవ జీవితమార్గ దర్శకం అనే ప్రశ్న నైయాయికుడైన ప్రొటగోరసు లేవదీసెను. ఈయనా, అనాడు త్తమోత్తమ జ్ఞాని అని పేరొందిన సోక్రటీసు తర్కించినారు. సోక్రటీసు ఎంత హేతువాది అయినా, క్లిష్ట సమయాలలో "అంతరంగ బోధ" వినియే నడచుకొంటానంటాడు. ఇది దైవవాణి కనుక. [/థియో/ మాయ్/ ఫోని/ ఫైనటాయ్/][55] ఆకాలంలో ఆథెన్సు

చిత్రం-3

కలలో కల చూపించు స్వప్నమాలిక

(యోగవాసిష్ఠము)

సన్న్యాసి

బ్రాహ్మణుడు

జీవటుడు

కలలు కను పురుషులు

రాజు

రాజ కుమారుడు

అప్సరస

కలలు కను స్త్రీలు (దివ్య, జంతు, సస్య జాతులు)

లేడి

తీగ

ఏనుగు

తేనెటీగ

హంస

చనిపోవు పురుష జంతువులు

బాతు

రుద్రుడు

వసిష్ఠుడు

వాల్మీకి

"లి"

భారతి పాఠకుడు

x → y అంటే, x అనే వ్యక్తి y అనే వ్యక్తి గురించి భావించుమని అర్థం.





1. అఫ్రొడైట్
2. డెల్ఫి

నగరంలో ఒక భోజన కూటం ఉండేదట. తమపేరు "దయ్యాలభక్తులు" [/"కకొడై మోనియాస్టాయ్/"]అని పెట్టుకొన్నారు.వారు అశుభ ముహూర్తాలలోనే విందేర్పాటు చేసుకొనేవారట. మూఢాచారాలను, దేవుళ్ళను ఎద్దేవా చేసేందుకు ఇవన్నీ చేస్తూవుండేవారు.[56]దేవుళ్ళకు సంతోషం కలుగలేదు, కూటం సభ్యులు చిన్న వయసులోనే త్వరగా చచ్చినారట ! మిగిలిన ఒక్కడు చికిత్సలేని దీర్ఘరోగంతో బాధపడినాడట. ఈ ఉదంతం రెండు విషయాలను తెల్పుతుంది. నైయాయికుల బోధనలవల్ల కలిగిన, అర్థరహితాచారాల నుండి విముక్తిభావం, సగటు మానవునికి హేతువాదుల ఎడల విరోధభావం.[57] హేతువాద పూర్వకమైన ప్రబోధయుగానికి ప్రతిక్రియ తల ఎత్తింది. అథెన్సులోని హేతువాదుల నందరినీ పట్టి శిక్షించ సాగినారు. అనగ్జ గోరసు, సోక్రటీసు, ప్రొటగోరసులు ముద్దాయిలయినారు. నేడు మన కాలంలో వలె ప్రాచీన గ్రీసునందలి ప్రబోధయుగం మేధావులకు పీడాయుగం గానూ ఉండినది.[58] మేధావుల బహిష్కారం భావస్వాతంత్ర్యాన్ని అరికట్టడం, వారి పుస్తకాలని కాల్చడం మున్నగునవి దీని లక్షణాలు. దీనికి మూలకారకులు దైవజ్ఞులయిన పురోహితులు. హేతువాద ప్రాబల్యం తమ పెత్తనానికి, జీవనోపాధికీ అడ్డంకిగా ఉండుట సైపలేక పోయినారు. జనసామాన్యాన్ని, చిన్నరాజకీయ వేత్తలనూ హేతువాదులపైకి ఉసికొల్పినారు. హేతువాదానికి రకరకాలైన ప్రతిక్రియలు పుట్టినవి. కొన్ని ఉదాహరణలిస్తాను. హిపోక్రేటీజు వైద్య శాస్త్ర గ్రంథాలు వెలికి వచ్చిన తరుణంలోనే, రోగోపశమన దేవత అస్క్లిపియసుకు అథెన్సులో గుడి వెలసింది. ఇంద్రజాలం, వశీకరణ మంత్రంలలో విశ్వాసం పెరుగుట రెండవ తిరోగమనం. ఒకని మీది శాపాన్ని కుండపెంకు మీదకాని, సీసపు పలక మీదకాని వ్రాసి, దానికి మేకుకొట్టవలెను. ఇట్లు మేకుకొట్టుటకు "కటడేసిస్" (కట్టుబడి) అంటారు. ఆ పెంకును, పలకనూ శ్మశానంలో పెట్టవలెను. అప్పుడు నీవుద్దేశించిన మనిషి తప్పక చస్తాడు. లేదా రోగపీడితుడవుతాడు. వ్రాసింది ప్రేమసుద్ది అయితే, నిన్ను ప్రేమిస్తాడు (స్తుంది).

ఇటువంటి కుండపెంకులు, సీసపు పలకలు మెడెటెరేనియన్ ప్రాంతంలో 800 దాకా దొరికినాయి.[59] డెమొస్తనీసు వంటి మహావక్త, ప్రజాతంత్రవాది మీద కూడ కుండపెంకు శాపనార్థాలున్నాయి. నీశత్రువును పరిమార్చే ఇంకొక పద్ధతి నీ శత్రువు లక్క లేక మైనం బొమ్మ చేయుము. మంత్రం పఠిస్తూ దానిని రకరకాల హింసలకు గురిచేయుము. ఆబాధలన్నీ నీ శత్రువుకు కలుగుతాయి[60] ఈ ప్రక్రియ చేసేటక మాంత్రికురాలికుటుంబాన్నంతా అథెన్సులో హతమార్చినట్లు దాఖలా ఉంది. భూతప్రేత పిశాచాలను రప్పించి శకునాలను చెప్పించే సంప్రదాయం ఉండేది. వీటిని నిర్వహించే భూతవైద్యులను "సైకొగోగోయ్" అనేవారు. ఇది నల్ల మేజిక్కు అయితే దీనినుండి రక్షింపబడుటకు తెల్లమేజిక్కు ("థియర్జీ") ఉండేది. రక్షరేఖలు, తాయెతులు అమ్మబడేవి. థెసలీలో మంచి యక్షిణీ దేవతను కొనవచ్చును.

ఈ ధోరణిని గతంలోకి పోవుట అనవచ్చునేమోకాని, ఇది భవిష్యత్తులో రాబోయే గ్రీకో- రోమను సంస్కృతీ సూచకం కూడ అవుతుంది.

## 7. ప్లేటో అహేతుకాత్మ, పిత్రాగతవిశ్వాసపుంజం

క్రీ. పూ. 5వ శతాబ్దంలో పిత్రాగత విశ్వాసపుంజం శిథిలం కావడం మొదలయింది. ఈ తరుణంలో ప్లేటో దృక్పథం, భావధోరణి వివరిస్తాను. ప్లేటో, మనిషి నడవడిలోని హేతురహితాంశాలకెంత ప్రాముఖ్యమిచ్చినాడు, వాటిని ఎట్లు సమర్థించినాడు, సంఘసుస్థిరతకోసం జనసామాన్యపు మూఢ విశ్వాసాలను ఎంత వరకు అనుమతించినాడు అనే విషయాలను ఇప్పుడు చెప్పుతాను.

హోమరు కాలంనాటి మనిషిలోని "దయ్యం" ("సైకీ")ను భగవదంశ కల ఆత్మ అన్నాడు ప్లేటో. పైథగోరసు మున్నగు వారి అష్టదక్షిణ గుహ్యాల్లోను. ప్లేటో తత్త్వప్రకారం ఆత్మ విద్య అయింది. తన "రిపబ్లిక్"లో తానే ప్రతిపాదించిన "తాత్వికుడు - పరిపాలకుడుగా ఉండవలెన"నే సిద్ధాంతం వదలి,

చట్టప్రకారపు రాజ్యమే మంచిదని "చట్టములు" అనే గ్రంథంలో వ్రాసినాడు. సంఘంలో పెద్దలు సంరక్షకులుగానూ, పిన్నలు సహాయకులుగానూ ఉండవలెనని నిర్ణయించినాడు. జన సామాన్యానికి ఆనందం కావలెను. వారి నైతికారోగ్యం బాగా వుండవలెనంటే, నీతిబోధక పుక్కిటిపురాణాలవసరం. మానవజాతిని దురాత్ములు, సదాత్ములు అని విభజించినాడు. చెడ్డవారు మరుజన్మలో గాడిదలుగానూ, తోడేళ్ళగానూ పుట్టుతారు. అని ఎంతో తృప్తిగా సెలవిస్తాడు ప్లేటో. మంచి వారు చీమలుగానూ, తేనెటీగలుగానూ పుట్టుతారు. ఇదంతా ప్లేటో మార్కు హాస్యంలెండి. ఇది మానవ ద్వేషి అయిన జోనాథన్‌స్విఫ్టుకు ఉల్లాసం కలిగించే మాట. ఆత్మను గురించి ఉదాత్తంగా భావించినట్లెల్లా, దేహాన్ని గురించి హీనంగా భావిస్తూ పోయినాడు ప్లేటో. ప్రవక్తకు, కవికి, ధర్మకాండాచరణులకు దైవదత్తోన్మాదం ఉంటుందనే ప్లేటోసిద్ధాంతాన్ని ఇంతకుముందే చెప్పితిని. ఇక నాల్గవ దివ్యోన్మాదం కామోన్మాదం. దీనికధిదేవతలు ఆఫ్రొడైటు, ఆమె కుమారుడు ఎరాస్. ఈ ఉన్మాదంలో ద్వైపీయ పాశవిక అంశాలున్నాయి. ప్లేటో ఉద్దేశించిన దైవీయాంశ కామోన్మాదం దైహిక పరిధిని దాటితే మనిషి దివ్యశక్తులను సంతరించుకోగలడు.[61]

సంఘవ్యవస్థను స్థిరీకరించేందుకు ప్లేటో చేసిన ప్రతిపాదనలు :

1. మత విశ్వాసాలుతర్కబద్ధాలే.
2. మత విశ్వాసాలను ధిక్కరించేవారికి చట్టబద్ధ శిక్ష ఇవ్వవలె.
3. మత విశ్వాసాలను బాలలకు నీతి బోధనలుగా చెప్పవలె.
4. పౌరజీవితంతో మత విశ్వాసాలకు స్థానం ఉండవలెను.

ప్లేటో ప్రకారం దేవుళ్ళున్నారు. మనిషి భవితవ్యం పైని వారికి అధికారం కలదు. దేవుళ్ళను ఉపేక్షించలేము. గ్రీకు సమాజంలో వుండిన దైవాలెవరెవరంటే : ఒలింపస్ పర్వతంమీద ఉండే దేవుళ్ళు, నగరదేవతలు, పాతాళదేవతలు, వీరుకాక సూర్య చంద్రులూ దేవుళ్ళే. సోక్రటీసు ప్రాతస్సంధ్యలలో సూర్యోపాసన చేసే వాడు. హీసియోద్ ప్రాతస్సంధ్యలలో నైవేద్యం పెట్టేవాడు. "నరకం" అంటే ఒకచోటుకాదు. అదొకమనస్థితి. ఈ విశ్వం మనిషి కొరకుగాక, మనిషి విశ్వం కొరకు సృష్టించబడినాడు. వ్రతాలు చేసి పురోహితులకు దక్షిణలిచ్చేదాని వలన పాపం పోదు. డెల్ఫిలోని కాలజ్ఞానపీఠం చెప్పేదే శిరోధార్యం. సంప్రదాయ విశ్వాసాలను ధిక్కరించే వారిని శిక్షించవలెను. ప్లేటో ప్రతిపాదించిన మతధార్మిక ప్రభుత్వం. యూరోపులో మధ్యమ యుగమందలి క్రైస్తవ అనుసంధాన ("ఇంక్విజిషన్") పద్ధతిని బోలుత్నంది. క్రైస్తవ అనుసంధాన పద్ధతి మానవాత్మను కాపాడుటకై దేహాన్ని కాల్చేది. ప్లేటో మతధార్మిక ప్రభుత్వం మానవ శరీర భద్రతకై (సంఘ సంరక్షణకై) అపాయకర ఆలోచనాధోరణులను అరికట్టింది. ఇది నేటి ప్రభుత్వాలు పాటించే "మస్తిష్క-క్షాళనం" వంటిది.

అయితే ప్లేటో ప్రతిపాదనలేవీ అమలులో పెట్టబడలేదు. గ్రీకుల యొక్క పితార్జిత విశ్వాసపుంజం సంస్కరించబడలేదు.

## 8. స్వాతంత్ర్య భయం

మన ఈ సమీక్ష లూకియన్[62] స్థాపన నుండి (క్రీ. పూ. 335) ప్రారంభిస్తుంది. హేతువాదం తన అంతిమ విజయాన్ని సాధించే స్థితి ఈ యుగంలోనే కన్పడింది. గణితం, తర్కం ఉన్నతస్థాయిని అందుకొన్నాయి. వృక్ష, జీవ భూగోళశాస్త్రాలు, చరిత్ర, సాహిత్య విమర్శ మొదలయినాయి. అలెగ్జాండరు (క్రీ. పూ.4వ శతాబ్దం) విజయాలు గ్రీకు రాజ్య పరిధులనేకాక మనఃపరిధులను కూడ విస్తృతం చేసినవి. ఆనాడు ఏథెన్సునగరంలో మేధావులైన అరిస్టాటిల్, థియోఫ్రాస్టస్, జెనో, ఎపిక్యూరస్‌లు పరస్థలీయులే నేడు మనం "తెరచిన సంఘం" అ దేనినంటామో, అట్టిదప్పుడు వుండేది. మనిషి తన బుద్ధిని ఉపయోగించు కొని అమర్త్యునివలె జీవించవలెను. ఎందుకంటే, బుద్ధి భగవదంశ కలది అన్నాడు. అరిస్టాటిల్ ఉదాసీనతాత్వికు[63]డైన జెనో, బుద్ధి, భగవంతుడే అంటాడు. తత్వమూ ధ్యానముచేత "మనుష్యులలో దేవునివలె" బ్రతుకవచ్చు నంటాడు. ఎపిక్యూరస్.[64]

ఈ హెల్లెనిక్ వ్యవస్థను[65] చూస్తుంటే హేతువాదం జైత్రయాత్ర చేయబోతుంది అనిపిస్తుంది. కానీ. అయిందెల్లా మానసిక శైథిల్యం మాత్రమే. ప్లేటో మాదిరే, స్కెప్టిక్కులు[66] కూడా సంప్రదాయంతో తెగతెంపులు చేసికోవడానికిష్టపడలేదు. బైజాంటైన్ సామ్రాజ్యాన్ని[67] టర్కీవారు స్వాధీనం చేసికొనే వరకు (క్రీ. శ; 15వ శతాబ్దం). 1600సంవత్సరాల కాలంలో థియోక్రిటస్ కంటె గొప్పకవి[68] కానీ, ఎరాటోస్తెనెస కంటె గొప్ప శాస్త్రజ్ఞుడు[69] కానీ, ఆర్కిమెడీస్‌కంటె గొప్ప గణితజ్ఞానుడు[70] కానీ పుట్టలేదు. వీరంతా క్రీ. పూ. 3వ శతాబ్దం వారే[71]

గ్రీకుల హేతువాద భావాలు ఆసియా ప్రాంతాలలోనికి, ఆసియా వాసుల మూఢవిశ్వాసాలు గ్రీసులలోనూ వ్యాపించినాయి. జ్యోతిషం ఒక నిదర్శనం. జ్యోతిషం గ్రీకులలో అంటువ్యాధివలె వ్యాపించింది. ఎపిక్యూరస్ దీని గురించి హెచ్చరించినాడు. అయినా స్వాతంత్ర్యం కోల్పోయి రోమనుల ఆధీనంలోనికి పోయిన (క్రీ. పూ 1వశతాబ్దం) గ్రీకువాసులకు భవిష్యత్తే శరణ్యమైంది. అందుకు జ్యోతిష్యమే ఆధారం. గ్రహాలపైననే కాక రత్నములు, జంతువులు, మొక్కల పైని కూడ నమ్మకం కుదిరింది[72] ఇది యూరోపులో మధ్యమయుగం వరకు సాగింది: దీనికి తోడు పైథాగోరస్ ప్రచారం చేసిన విశ్వాసాలకు పునరుజ్జీవనం అయింది. పైథాగోరస్, ప్లేటోలు తాత్విక చింతకులుగా కాక మత ప్రవక్తలుగా భావింపబడసాగినారు. గ్రీకు హేతువాద పతనానికి కారణాలేవి ? గ్రీకు హేతువాదం సన్నగిల్లి పోవడానికి కారణం సిద్ధాంతాలతో పాటు శాస్త్రప్రయోగ పద్ధతి అభివృద్ధి కాకపోవడం, శాస్త్రీయప్రయోగ పద్ధతులు వృద్ధికాకపోవడానికి, టెక్నాలజీ లేకపోవడం టెక్నాలజీ (యాంత్రికోత్పత్తివిధానం) కొరవడడానికి, కాయకష్ట జీవులు మస్తుగ ఉండడం కాయకష్టం చేసే మనుషులెక్కువగా దొరకడానికి, ఆనాటి గ్రీకు సమాజ వ్యవస్థలో బానిసపద్ధతి అమలులో ఉండడం అనే కార్యకారణ పరంపర మార్క్సీయ దృక్పథంతో చెప్పడం యుక్తియుక్తంగా కనపడుతుంది. ఈ వ్యాఖ్యానం మేధావుల వైఫల్యాన్ని డిగజారుడునూ సూచిస్తుంది.

జనసామాన్యం జ్యోతిషం, మంత్రతంత్రాలు, ఇంద్రజాలం దిక్కుకు ఎందుకు మొగ్గచూపింది అనే ప్రశ్న రాకమానదు. దానికి నేను చెప్పేదిది. తెరచిన సంఘంఅంటే వ్యక్తిబాధ్యత. వ్యక్తిబాధ్యత, వ్యక్తి స్వాతంత్ర్యం పైనా ఆధారపడుతుంది. ఎట్లనుకొంటే అట్లు చేయగలిగిన పరిస్థితులలోనే మనిషి కష్టాలు మొదలవుతాయి. అప్పుడు స్వాతంత్ర్యమే భయావహం అవుతుంది. ఈ స్వాతంత్ర్యభయమే గ్రీకులను మత గ్రంథాల ఆధిపత్యాన్ని శిరసావహించునట్లు చేసింది. ప్రజల అనిర్వచనీయ భయాందోళనలు చిత్రవిచిత్రమయిన వేషాలు వేసుకొన్నాయి. అదృశ్య భూతాలు, దుస్వప్నాలు, దిష్టి పూనకం వీటికి విరుగుడుగా తాయెత్తులు, స్తోత్రాలు శాంతులు వచ్చినాయి. అహేతుకతా పునరాగమనం సంపూర్ణమైంది. హేతుకత వైపు చెంగున దౌడు తీయవలసిన పరిస్థితిలో ఈ తిరోగమనమేమి విఫలమైనది. గుర్రమా? రౌతా? కేవలం గ్రీకు ప్రొఫసరునైన నేను కచ్చితముగా ఉత్తరమీయజాలను. కాని ఇంతమాత్రం చెప్పగలను. గుర్రమే వెనక్కు లాగిందని, మానవ ప్రకృతిలో దాగియున్న అహేతుకాంశాలదే పైచేయి అయింది. హేతువాదాన్ని వృద్ధి చేసిన ప్రాచీన గ్రీకులు కేవల హేతువాదులు కారు. అహేతుకత యొక్క శక్తి, మహిమ, ప్రమాదాలు తెలిసినవారు. మానవుని అంతరంగంలో అట్టడుగున జరిగే విషయాలను పౌరాణికంగానూ ప్రతీకాత్మకంగానూ మాత్రమే వర్ణించినారు. వాటిని అర్థం చేసుకొనే సాధనం వారి దగ్గరలేదు. కాబట్టి హెల్లెనిస్టిక్ యుగంలో వాటిని ఉపేక్షించే తప్పిదమూ చేసినారు. నేడి మానవుడా సాధన సంపత్తిని సమకూర్చుకొన గలిగినాడు అహేతుకత పుట్టించే భయాన్ని అర్థం చేసుకొనగల్గు

తున్నాము. ఆ భయాన్ని అధిగమించి, గుర్రమూ, రౌతూ విజయవంతమయిన లంఘనం చేయగలరు.

## 9. ఉన్మత్త స్త్రీలు

రెండు సంవత్సరాలకొకసారి, ప్రాచీన గ్రీకుస్త్రీలు చలికాలపు రాత్రి "పర్నాసను" కొండ నెక్కి ఉద్రిక్త నృత్యాలు చేసేవారు. ఈ పర్వతనృత్యానికి "ఒరీబసియ" అంటారు "ఒరీబసియా" సంప్రదాయాన్ని యురిపిడిసు ప్రాసదం "బక్కే"లో విశేషంగా వర్ణిస్తాడు. "ఒరీబసియ" శక్తిపూజ డయోనిసస్ (చూ. 3 ఉన్మాదాలిచ్చే వరప్రసాదాలు") ఆరాధకులు ఆయనను ఉత్సవంలో వూరేగిస్తూ నాట్యాలు చేస్తూ ఆయాసం, మైకం వచ్చి పడిపోతారు. అటులనే "కుబెలె" అనే దేవత ఉంది. ఈమె ఆకృతి రాతిగుండు. ఈ స్త్రీ దేవత ఆరాధకులు ముఖ్యంగా స్త్రీలు ఆవేశంతో చిందులు త్రొక్కుతూ, సంగీతం పాడుతూ వూరేగుతారు నాట్యాలలో పిల్లనగ్రోవి, డోళ్లు వాడుతారు. ఈ దేవత పూజారులు కొజ్జాలు. ఈ రకపు ఉన్మత్త స్త్రీలను "కొరిబాంటెస్" అంటారు. ఇటువంటి పిచ్చిస్త్రీలు ఆధునిక కాలంలోనూ ఉన్నారు. ప్రాచీన పౌరాణిక డయోనిసను తన ప్రభావాన్ని ప్రసరిస్తూనే వున్నాడు - వేరే రూపాలలో, వేరే పేర్లతో.[73]

ఇంతటితో డాడ్సు చెప్పేది అయిపోయింది. ఇక ముగింపుగా కొన్ని విషయాలు చెప్పుతాను.

## 10. పరిశిష్టం

ప్రాచీనగ్రీకులలో వుండే అహేతుకాంశాలన్నీ నేడు మనలోనూ ఉన్నాయని స్పష్టమయింది.

గ్రీసులోనేకాక ప్రతి చోటా ఈ అహేతుకభావాలు ఇప్పటికీ ఉన్నాయి. మనిషికి సుఖదుఃఖాది ద్వంద్వాలున్నంతవరకు, పుట్టుకింటే పూర్వపుసంగతి, చచ్చిన తర్వాతిగతి తెలియనంతవరకు, అనుకొనే దొకటి, అయ్యేది వేరొకటి సాగేంత కాలం, మనిషి అహేతుకతపై మొగ్గు చూపిస్తూనే వుంటాడు. హేతువాదం ఇరుప్రక్కలా పదునున్న కత్తి లాంటిది అటు వైపూ నరుకగలదు. ఇటువైపూ నరుకగల దువాదేవైనంలో ఉంది. ద్వైతమత స్థాపనకు న్యాయ సూత్రాలను తిరుగులేని విధంగా వాడిరాదార్యులు. వారువ్రాసిన సిద్ధాంత గ్రంథాల పేర్లు "న్యాయసుధ", "తర్కతాండవ," అటులనే జైన, బౌద్ధన్యాయాలున్నాయి. నవ్యన్యాయముంది. హేతువాదమూ తర్కాన్ని వాడుతుంది. తలకిందు తర్కం. శాస్త్రంలోశాస్త్రం అని ప్రసిద్ధి చెందిన గణితశాస్త్రంలోనే తర్కం డింకీ కొట్టుతుంది. ఒక చిన్న ఉదాహరణ ఇస్తాను. $\frac{1}{2}+\frac{1}{2}=1$ అనికదా మనమంతా నేర్చుకొన్నది. సరిగ్గా తర్కం ప్రకారం $\frac{1}{2}+\frac{1}{2}=\frac{2}{4}=\frac{1}{2}$ అని వుండవలెనట! రెండు పద్ధతులూ హేతుబద్ధాలే. కానీ మనలెక్క తీరలేదు. నీవు తర్కాన్ని ప్రయోగించేముందు నీ తర్కంలో పరస్పర వైరుధ్యం లేదని ఎట్లా రుజువుచేస్తావు? అని 20 వ శతాబ్దంలో అందరికంటె గొప్ప తార్కికుడని ఎంచబడే కర్ట్‌గోడెల్ ప్రశ్నిస్తాడు. దీనికి "గోడెల్ థీరం" అంటారు. గోడెల్ థీరం ఆఘాతం మూలాన బెర్ట్రాండ్‌రస్సెల్ గణితశాస్త్రం అందుకోవలసిన స్థానం పొందజాలక పోయిందంటారు. హేతువాదం (రేషనలిజం) జ్ఞానేంద్రియానుభవం (ఎంపిరిసిజం) మీద ఆధారపడవలసి ఉంది. జ్ఞానేంద్రియాలూ మనల్ని మోసం చేస్తాయి. సూటిగీతను వంకరగా కనపడునట్లు వ్రాయవచ్చును. ఇచట కన్ను మోసపోయింది. పుల్లనివస్తువు ఒకానొకదేహావస్థలో విషంగా రుచిస్తుంది. నాలుక మోసం. అనెస్తీసియాలో చర్మానికి స్పర్శజ్ఞానం ఉండదు. ఒకేవాసన చూస్తూవుంటే, ఆవేసే వాసనా మాయమైపోతుంది. వీటికి శాస్త్రీయకారణాలు చెప్పుతారు. అయినా జ్ఞానేంద్రియాలు నమ్మదగినవి కావనేది స్పష్టం.

సంశయించడం, ప్రశ్నించడం, పరిశోధించడం, నిగమనం చేయడం భౌతికశాస్త్రసోపానాలు. వీటికి హేతువాదిత్వం మూలం సంశయాత్మా వినశ్యతి అని తర్వాతివారన్నా, వేదర్షులు సంశయాన్నే వెలిబుచ్చినారు. నాసదీయ సూక్తం "అని ప్రసిద్ధి గాంచిన ఋగ్వేదమంత్రం ఉంది. ఈ సృష్టి గురించి ప్రశ్నాపరంపరను కురిపించింది. వారిప్రశ్నలు, నేటి జీవోత్పత్తి శాస్త్రజ్ఞుడైన సుప్రసిద్ధుడైన డాక్టరు పొన్నంపెరుమా ప్రశ్నలకు తీసిపోవు. ఈ సృష్టి ఎట్లు కలిగింది? ఎవరు చెప్పగలరు? ఎవరికి తెలుసు గనుక? దేవతలే జగత్తు తర్వాత వచ్చినవారు. అయితే ఈ జగత్తెట్లు వచ్చింది? ఆకాశంలోవుండే ఆ పరమాధ్యక్షునకు తెలియునేమో? ఆయనకూ తెలియదేమో! బైబిలులో "జాబ్" అనే ప్రవక్తకు (చూ.౦. ఉపోద్ఘాతం) దేవుడు కనపడి ఈ సృష్టి ఎట్లు అయిందో నీకు తెలుసా? ఊ చెప్పు అని బుకాయిస్తాడు. ఇచట వేదర్షులు దేవుణ్ణి "నీకు సృష్టి రహస్యం తెలుసా" అని ఎద్దేవా చేస్తున్నారు. సంశయించి అడుగుతున్నారు, వేదర్షులకున్నంత మాత్రం సంశయాత్మకత అయినా ఉంటే మనలో వుండే అహేతుక సినీవాలికి కొంతయినా శాస్త్రసూర్యాలోకన భాగ్యం[74] కలుగుతుందని నేననుకొంటాను.

### అధోజ్ఞాపికలు

1. బ్రిటిషు తాత్వికుడు ఫ్రాన్సిస్ బేకను (క్రీ. శ. 16-17 శతాబ్దం) "నోవం ఆర్గానం" (నవవిధానం)లో "ఇండక్టివ్" పద్ధతి (ఏకత్రికం నుండి సార్వత్రికానికి నిగమనం చేయుట) వివరించినాడు.
2. దశాంకపద్ధతి, సున్న, ఋణాంకములు ఒకటి నుండి తొమ్మిదివరకు గల అంకెలకు వేర్వేరు గుర్తులు విధించుట వంటి గణితాంశాలు భారతీయులు కనిపెట్టినారు.
3. "ది గ్రీక్స్ అండ్ ది ఇర్రేషనల్"
4. హోమరు క్రీ. పూ. 1000 సంవత్సరాల్కితం ఉన్న గ్రీకు కవి. ఇతడు "ఇలియడ్", "ఒడెస్సే" అను రెండితిహాసాలు వ్రాసెనంటారు.
5. "ఇలియడ్" లోని ప్రధాన వీరుడు
6. "ఇలియడ్"లో గ్రీకు సైన్యానికి అధిపతి.
7. "మొయిరా"కే పర్యాయపదాలు టూఖే, "నెమెసిస్" "అనాగకే"

   మనపరిభాషలో "విధి" అదృష్టం", "గ్రహచారం" "ఖర్మ" "లలాటలిఖితం", "భాగ్యం", "నసీబ్", "కిస్మత్", "ప్రాప్తి," "ప్రారబ్ధం" లాటినులో "ఫేటం" ఇంగ్లీషులో "ఫేట్", ఫార్చ్యున్, "లక్".
8. హీసియోడ్, తియోగ్నిసులు మహాకవులు ఇస్కైలజ్ ప్రాసద రచయిత. హిరోడోటసు చరిత్రకారుడు.
9. నిల్వఅయిన అశౌచాన్ని కడుగుకోవలెననే ఈ విశ్వాసమే అరిస్టాటిల్, ప్రాసద ఉద్దేశ లక్షణాలలో ముఖ్యమైనదిగా పరిణమించింది.
10. మనవారు కామక్రోధాదులను శత్రువులు (అరిషడ్వర్గం) అని వర్ణించినారు. సత్య, శౌచాదులను బంధువులుగా పేర్కొనినారు. "అర్ధురే బంధువులు నాకు" (ధర్మరాజు).
11. మనలో కూడా రోగాలను దుష్టదేవతలుగా పూజించడం వుంది. ఆ దేవతల పేర్లు అట్లమ్మ, మారెమ్మ, పెద్దమ్మ, శీతలదేవి, హోళిక, ఇటీవల సంతోషిమా.
12. విశ్వామిత్రుడు, యయాతి తమ సంతానానికి శాపాలిస్తారు. భగీరథుని వంశం తరతరాలుగా పాపఫలం అనుభవిస్తుంది.
13. "కారేరాజులు" పద్యం ఈ సందర్భాన గుర్తుకు తెచ్చుకోండి. అటులనే, షెల్లీ కవి రచించిన "ఓజిమాండియాస్" అనే చిన్న పద్యం ప్రస్తుతానికి పనికి వస్తుంది.

14. "మనకున్న వరప్రసాదాలు ఉన్మాదం ద్వారావచ్చినట్టివే."

15. అపోలో జియసు (వేదంలోని ద్యౌపితరుడు) కొడుకు. ఓషధులకు, విలు విద్యకు కాలజ్ఞానానికి అధిదేవత. ఆదిత్యస్వరూపుడు. ఇతని ఆలయం డెల్ఫిలో ఉండింది. నైతికవిలువలకూ, ధర్మానికీ ఓజబంతి.

16. డయోనిసస (ఇంకొక పేరు బక్కసు) జియస్ కొడుకే. సస్యాధిపతి ద్రాక్షా సవదైవం. మైరేయమదంలో నృత్యం చేస్తూ ఇతని ఉత్సవం చేసు కొంటారు. సంగీతం నృత్యం, త్రాసద, తోషదాలకు ప్రేరేపకుడు. ప్రతి ఏడూ చచ్చిపుడతాడు. వ్యథచెందేదైవం. ఇతణ్ణి ఆడంగి రేకులవాడి మాదిరి, చిత్రిస్తారు.

17. వీరిని "మౌసాయ్" అంటారు. సాహిత్య. సంగీతాది లలితకళలకు నాయి కలు. వీరు తొమ్మిదిమంది అక్కచెల్లెళ్లు ఇంగ్లీషుపదాలు "మ్యూసెస్", "మ్యూజిక్కు" వీరినుండి వచ్చినవే.

18. కామదేవత (స్త్రీ) చిత్రం 1 చూచునది. రోమనులీమెను "వీనసు" అన్నారు. ఈమె కుమారుడు ఎరోస్ మన "రమాకుమార" వలె మన్మథుడు.

19. యూదులకు, హిందువులకు, క్రైస్తవులకు, ముస్లిములకు ప్రమాణ మత గ్రంథాలున్నాయి. గ్రీకులకు మతగ్రంథమంటూ ఒకటి లేదు. 'ఒకచర్చి' విధానమూలేదు. వేదకాలంలో హిందువులకు వలెనే ప్రాచీన గ్రీకులది. "హీనోథీయిజం" (అనగా ఒకదొకదేవతని కొలిస్తే, ఆ దేవతయే అప్పటికి సర్వోత్తమం) ఇతరమతాలలో దేవుళ్లు మతగ్రంథాల నుండి పుట్టుకరాగా, గ్రీకులలో దేవుళ్లు బయటనుంచి గ్రీకుల గ్రంథాలలో చొరబడినారు. గ్రీకు దైవాలు మొట్టమొదట హోమరు "ఇలియడ్"లోనే కనబడతాయి. "ఇలి యడ్" జనసామాన్యపు మౌఖికపరంపరను గ్రంథస్థం చేసింది. అదొక జానపద గాథ. "ఇలియడ్"లోని మహామహావీరులు సముద్రచోరులే అనే సిద్ధాంతం ఉంది. గ్రీకుదేవుళ్ల దేవాలయాలూ జనసామాన్య సంప్రదాయాలు కాని, మత ప్రతిపాదితములు కావు.

20. డెల్ఫి చిత్రం 2. చూచునది.

21. కేరళలో భగవతి దేవాలయాల్లో పూజారులీపనిచేస్తుండేవారు. దీనికి "ప్రశ్న" వేయడం అంటారు. ఆంధ్రలో "ప్రశ్న" చెప్పే దేవర మనుషులు, తాంత్రికులు, జ్యోతిష్కులు ఉన్నారు.

22. గ్రీకువారికి లారెల్ మొక్క పవిత్రం - మనకు రావిచెట్టువలె లారెల్ ఆకుల మాహాత్మ్యమా అంటే అదేమీకాదు. ప్రొఫెసరు ఎస్టరీశ్ చాలా లారెల్ ఆకులను నమలినా, అంతకు ముందుకంటే ఎక్కువ "దివ్యా వేశం" రానందుకు చాలా నిరాశ చెందినాడు ('ఈ విషయం దాడ్సు వ్రాసి నదే. "తి") ఇక వాయువులు. గుహలోమూలకు పెట్టిన లారెల్ ఆకుల ముంతపొగ కావచ్చును.

23. పూనకం లక్షణాలు చాలానే ఉన్నాయి. ఊరక కూర్చొని ఉండదమొకటి. ఆదోనిలోని మహాయోగిని "తిక్కలక్ష్మమ్మ" అట్టిది. ఒక్కొక్కప్పుడు పైథియా అరచుచూ బజారు వెంబడి పరుగెత్తేది. క్రిందపడి అపస్మార రోగివలె విలవిలలాడేది. "వేయిపడగలు"లోని గణాచారిని ఈ సందర్భంలో పేర్కొనడం సముచితం.

24. "దేవరపయి మీదికి వచ్చేదు," "పయినిండింది" అని మనవారంటుంటారు.

25. డెల్ఫిలోని అపోలో కాలజ్ఞాన పీఠము ఉంటే, డొడొనా అనే చోట అపోలో అబ్బ జియస్ యొక్క కాలజ్ఞానపీఠం వుండేది. ఇది ప్రాచీనతరం. ఇచట గణాచారి రణగొణధ్వనుల ఆధారంగా కాక "ఓకు" చెట్ల ఆకుల "మరమర" ధ్వనులు, 'ఓకు' చెట్లవేళ్ల దగ్గర పారేనీళ్ల "జలజల" ధ్వనులు, గుడిగంటల "గణగణ" ధ్వనులు ఆధారంగా పురోహితులు భవి ష్యత్తును చెప్పేవారట.

ఆకాలం, గ్రీకులు ఎందుకు ? ఈనాడు, ఆంధ్రలో ఇట్టి ఆచారం ఉందంటే ఆశ్చర్యపడబోకండి. "ఆంధ్రపత్రిక" [సెప్టెంబరు 9, 1984] వార్త ఇస్తున్నాను.

"కర్నూలు జిల్లా పత్తికొండ తాలుకా నల్ల చెలమల గ్రామంలో శ్రావణమాసం, మూడవ శనివారం శ్రీలక్ష్మీనరసింహస్వామి ఆలయం వద్ద ఒకవింత జరుగుతుంది. కొండ కింద కొలను అర్చకుడు స్నానంచేసి, పూజచేసి, గుహలో ప్రవేశించి మూడు పెద్ద ఎర్రగన్నేరు పూలదండలను కొండకు ఆనిస్తాడు. అర్చకులు మంత్రాలు పఠిస్తుండగా, ప్రేక్షకులు చూస్తుండగా ఆ గన్నేరు దండలు కొండ చరియలోకి వెళ్లిపోతాయి. దాదాపు రెండు గంటల తర్వాత తిరిగివస్తాయి. తిరిగి వచ్చిన దండలను అర్చకుడు పరిశీలించి భవిష్యత్తు నిర్ణయిస్తాడు. దండలు నలిగి పోయివుంటే కష్ట కాలాలు వస్తాయనీ, నలగకుండా వస్తే మంచికాలం అని కాలజ్ఞానం చెప్ప తాడు. గ్రీకు కాలజ్ఞానపీఠాలలో వలె ఇట్టి చోట్ల కూటసృష్టి, చమ త్కారం, అనుభవసారం ఇమిడి వుంటాయి.

26. ఫ్రాన్సులో 16వ శతాబ్దంలో నాస్ట్రిడామసు అనే దైవజ్ఞుని "శతకములు" లోనూ, దాదాపు అదేకాలపు ఆంధ్రలోని పోతులూరి వీరబ్రహ్మం కాల జ్ఞానవచనాలలోనూ ఇదేరీతి కన్పిస్తుంది.

27. మనలో "అభిజాత్యులకు" వ్రతాలు, పర్వాలు నోములు, బ్రహ్మోత్స వాలూ ఉండగా, "అలగా" జనానికి జాతరలు, పరుసలు ఉన్నాయి. పల్లె జాతరలలో జనులు తప్పత్రాగడం, చిందులుతొక్కడం పాటలు పాడడం, కేకలువేయడం, జంతుబలులొసగడం మున్నగునవి మతిలేని పనులు చేసి మరునదినాడు యథాప్రకారం "నార్మల్" అవుతారు. గంగమ్మ, పోలేరమ్మ, మద్దమ్మ, సమ్మక్క ఎల్లమ్మ, పోతప్ప జాతర లిట్టివి. ఇట్టి ఉత్సవాలవల్ల వారిలో కూరుకొని పోయిన బాధలు, భయాలు, చింతలు "కెథార్సిస్"-అయి, వారికూరట కల్గుతుంది.

28. షేక్సుపియరు తన "నడివేసగి రేయికల" అనే నాటకంలో పిచ్చివాడు, ప్రేమికుడు, కవి ఒకేవిధ భావనా ధోరణి గలవారని ఒకానొక పాత్రచేత చెప్పిస్తాడు.

29. (i) పిండర్ కవితాదేవతను ప్రార్థించినట్లు మన పోతన సరస్వతిని ప్రార్థిస్తూ "నీవు నా యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శోభిల్లన్ బల్కుము నాదువాక్కునను" అంటాడు. తర్వాత "పలికెం చెడువాడు రామభద్రుండట" అంటాడు.

(ii) "మానిషాద" శ్లోకం తర్వాత, వాల్మీకే, అరే ఇదేమో కొత్తగా ఉందే అని ఆశ్చర్యపోతాడు.

(iii) తిక్కన "సాత్యవతేయ సంస్కృతి శ్రీ విభవాస్పదంబయిన చిత్తము తోడ మహాకవిత్వ దీక్షావిధిపొంది" అంటాడు.

(iv) మిల్టను తన "స్వర్గచ్యుతి" మొదట్లోనే "పాడుము, దివ్యవాణీ" అని దేవతాహ్వానం చేస్తాడు.

(v) విశ్వనాథ "రామాయణకల్పవృక్ష" రచనా ప్రారంభాన "నన్న య్యయు, తిక్కన్నయు నన్నావేశించిరి" అని చెప్పుతాడు.

ఈ కవులంతా తమ కవిత్వాన్ని,ఏవో దివ్యశక్తులు వ్రాయిస్తున్నాయని చెప్పుతారు. పారలౌకిక ఇతివృత్తాలుకల గ్రంథాలు వ్రాసేటప్పుడు తమ బాధ్యతను అదృశ్య, దివ్యశక్తులపై మోపుతారు.

(vi) హౌస్మను కవిత్వాన్ని ఒక విధమైన జ్వరం అంటాడు. అసాధారణ దైహిక, మానసిక పరిస్థితి కవిత్వానికి మూలం అనేభావం ఇందిమిడి ఉంది.

30. గ్రీకు భాషలో "హప్నోస్" అంటే నిద్ర అని అర్థం. "హిప్నాటిజం"ఈ పదం నుండి వచ్చిందే. ఈ పదం సంస్కృతంలోని "స్వప్న"తో సమానం. (రెండూ ఏక మూలపదాలు) మన శాస్త్రాలలో ప్రాణికి మూడవస్థలు చెప్ప బడ్డాయి. జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలు. మూర్ఛ, మరణాలు అవస్థలే అని బ్రహ్మసూత్రములు.

31. మనభాషలో కూడా కలను "మాస్తాము." త్రిజట "కలను గంటి" అంటుంది. వాల్మీకి కూడా "దృష్టా" అనే పదం వాడుతాడు. తిక్కనకు నాయన కలలో వస్తాడు.

32. డాస్తవస్కీనవల "కరమజోవ్ సోదరులు"లో మిట్యా అనే పాత్రకు పడిన కల ఉదాహరణ మిట్యా, తండ్రి హత్యకు కారకుడు. అయినా నేర నివే దన దస్తావేజులో సంతకం చెయ్యడు. ఒకరోజు కరుణామయమయిన కల పడుతుంది. పశ్చాత్తప్త స్పందిత హృదయంతో దిగ్గున మేల్కొని, "అయ్యలారా! నాకొక మంచి కలపడింది." అని విచిత్ర స్వరంతో, ఆనందం తొణికిసలాడే మొగంతో "ఎక్కడ సంతకం చేయవలె? తెండి" అంటాడు. అతని కల క్రైస్తవ ధర్మమగు కరుణ, క్షమ, పాప నివేదనలవంటి నిగూఢార్థదాయకం. అందుకే మిట్యా సంపూర్ణంగా మారినాడు.

33. రామాయణంలో త్రిజటా స్వప్నం ఇట్టిది. ఇందు రామాభ్యుదయం, రావణ వినాశం విశదంగా కన్పడుతాయి.

34. తిక్కన విరాటపర్వ అవతారికలో తనకు పడిన కలను చాలా నాటకీయంగా వర్ణిస్తాడు. కలలో మొదట అతని తండ్రివచ్చి, హరిహరనాథస్వామి ఇప్పుడు నీకు కన్పడుతాడు. సిద్ధంగా ఉండు అంటాడు. ఆ వెంటనే హరి హరనాథుడు కనపడి మహాభారతాన్ని వ్రాసి తన కంకితమీయ మని ఆదేశిస్తాడు.

35. మన స్థలపురాణాలను పరిశీలిస్తే, ఆ క్షేత్రాలు భక్తుల కలల పుణ్యాన వెలసినట్లు స్పష్టం అవుతుంది. ఇట్టి కలలు రాజులకో, ధనికులకో మూఢ భక్తులకో పడతాయి. స్వప్నాదేశం మీరరాసదని మనవారి విశ్వాసం— మరణకాల మప్పుడిచ్చిన మాటవలె.

36. "యోగవాసిష్ఠంలో" ఒక సన్యాసికి కలపడే కథవస్తుంది. సన్యాసికి పడిన కలలో వచ్చేవాడికి కల, వాడికలలో వచ్చేవాడికి కల...ఇవ్విధంగా కలలో కలలు వరుసగా వర్ణించబడినాయి. అందులో స్త్రీ, పశు, పక్షి, రుద్రులూ కలలు కంటారు. ఈ కలలోకల వర్ణించే స్వప్నమాలికను చిత్రం 8 లో చూడండి. ఇందులో "భారతి" పాఠకుడూ, "తి" కూడా భాగస్వాములుగా చూపబడినది. ఎక్కువ వ్యాఖ్యానించుటకు ఇది తరుణం కాదని మనవి. ["దేదలస్", సెప్టెంబరు 1982 లో వెండి డానిగెర్ ఓ ఫ్లాహర్టీ వ్యాసం నుండి కొన్ని మార్పులతో చిత్రం వేయబడింది,– "తి"]

37. అస్క్లిపియసు గ్రీకులకు వైద్యదేవత. మనకు ధన్వంతరివలె కలలో కన్పించి సలహా ఇచ్చేది, చికిత్స చేసేది ఈయనే.

38. రోగులు పవిత్ర స్థలాలకుపోయి స్వప్నం ద్వారానో, వరంద్వారానో విముక్తి పొందుట నేటి క్రైస్తవులలో ఉంది. ఫ్రాన్సులోని లౌర్డ్స్ అనేచోట మేరీమాత (లేడీ ఆఫ్ ఇమాక్యులేట్ కన్‌సెప్షన్) దేవాలయంలోనూ తమిళనాడులోని "వేలంకన్ని" యందున్న మేరీమాత దేవాలయంలోనూ ఈ పద్ధతి ఇప్పటికీ ఉన్నది.

ఇక హిందువులలో ఉదాహరణాలు: కర్నూలుజిల్లా, మంత్రాలయ రాఘ వేంద్రస్వామి మఠం ఉంది. ఇచటికి రోగగ్రస్తులు, సంతానం కోరేవారు వచ్చి సేవచేస్తారు. ఏదో ఒకనాడు రాఘవేంద్రస్వామి రోగం నయ మయ్యే చికిత్స చెప్పుతాడు. లేదా నీ రోగం నయంకాదు. నీఖర్మ నీవనుభ వించమని సెలవిస్తాడు. రాఘవేంద్రస్వామి, అస్క్లిపియసు వలె వైద్య దేవత కాకున్ననూ రోగభక్తుడు అమెరికాలో ఆపరేషన్ చేయించు కొనేటప్పుడు, తానే అదృశ్యంగా ఆపరేషను చేస్తాడు. ఇట్లా చేసినాడని వాజ్మూలాలున్నాయి. సంతాన ప్రాప్తికి, "రెడ్డెమ్మను" మూడు వారాలు కొలుస్తారు. క్షేత్రాలు తిరిగి స్వప్నంలో శివుని వరంబొంది రాజ రాజ నరేంద్రుడు సారంగధరుని కంటాడు. జీవ సమాధుల దగ్గర జరిగే విడ్డూరాలు వర్ణనాతీతాలు.

39. హిపోక్రేటీజు (క్రీ. పూ. 460) పాశ్చాత్య శాస్త్రీయ వైద్యానికాద్యుడు. నేటి డాక్టరులు చేసే "హిపోక్రేటీజు శపథం" ఇతడేర్పరచిందే. ఇతని వానుడులు ప్రసిద్ధాలు. ఉదా : బ్రతుకు చిన్నది. కళ పెద్దది. [/ ఓ / బయోస్/ బ్రకీస్/ ఈ/ దే/ టెఖ్నీ/ మక్రీ/ ] దీనినే లాంగ్‌ఫెలో అనే కవి "ఆర్ట్ ఈజ్ లాంగ్, అండ్ టైం ఈజ్ ఫ్లీటింగ్" అన్నాడు. దీనినే లాటినులో "ఆర్స్‌లాంగా, వైటాబ్రెవిస్" అంటారు.

40. "కావ్యదేవత నోట కవిత విన్నానే" అని ఆధునిక తెనుగు భావకవి అన్నట్లు.

41. నిర్జన ప్రదేశాలలో ఉంటూ అటు పోయే జనులకు భయోత్పాతం కలిగించే దేవత "పాన్" ఇతని గుడి ఆథెన్సులో ఉండేది. "పాన్" వలెనే నిర్జన ప్రదేశాలలో పాంథులకు భీతి కలిగించే క్షుద్ర దేవత మా ప్రాంతం ( ఆలూరు తాలూకా జొహరాపురం ) లో "గిచ్చన్న" అని అంటూంటారు. పిల్లలు కొండలలోనికి, తోపుల్లోనికి పోకుండా "గిచ్చన్న" భయం పెట్టినారు.

42. ఇట్టి నిదర్శనాలు చరిత్రలో చదువుతాము.

(i) క్రైస్తవుల చెరబట్టేందుకు పోయే సౌలుకు ఏసుక్రీస్తు వాణి వినబడగా, మనసు మార్చుకొని ఏసుమార్గాను గామియై పౌలుగా పిల్వబడెను.

(ii) చంద్రగ్రహణ సమయాన నదీస్నానం చేసి ధ్యాననిష్ఠుడైన పోతనకు శ్రీరాముడు కనపడి భాగవతం వ్రాసి తన కంకితమీయ మంటాడు.

(iii) "కాటుక కంటినీరు" పద్యం వ్రాసే పోతన ముందు భారతి నిల్చి యుండెనా ?

(iv) శ్రీకాకుళంలో కృష్ణదేవరాయలకు విష్ణువు ప్రత్యక్షమై "ఆముక్త మాల్యద" వ్రాసి తన కంకిత మీయుమంటాడు.

(v) దుఃఖిస్తున్న సిద్దయ్యకు, సమాధి గతుడైన వీరబ్రహ్మం బయటికి వచ్చి అనునయిస్తాడు

(vi) సెటిల్ మెంటు ఆఫీసరుగా మంత్రాలయం పోయిన థామస్ మన్రోకు రాఘవేంద్ర స్వామి బృందావనం నుండి లేచివచ్చి మాట్లాడినట్లు మద్రాసు గెజెటీరు చెబుతున్నది.

(vii) త్యాగరాజుకు నారదుడు కన్పడియుండెనట.

43. ఇప్పటి మన నమ్మకం దీనికి భిన్నం కాదు.

44. "గది ఎందుకున్నదీ అంటే దానిని మనం వదలిపోవడానికి" అనే అర్థంలో శ్రీరంగం నారాయణబాబు కవితా పంక్తి ఒకటి చదివినట్లు గుర్తు.

45. సోక్రటీసు మానవునికి "ఆత్మ ఉందనీ, ఇది శాశ్వతమైనదనీ మనిషి చనిపోవుట అంటే, చిరిగి పోయిన గుడ్డలు వదలి కొత్త పుట్టములు కట్టు కొనునట్లు, ఆత్మ వేరే దేహాన్ని వెదకి కొంటుంది అని ఉపదేశించి విష త్రాగి మరణిస్తాడు "(ఫేడో" – "ప్లేటో సంవాదములు" ) గీతలో "వాసాంసి జీర్ణాని యథావిహాయ" (2 : 22) అని ఉంది. ఇది సోక్రటీసు

సిద్ధాంతం వలెనే ఉంది. ఆత్మ యూదుల మతంలో కాని క్రైస్తవ, ఇస్లాం మతాలలో కానీలేదు. వారికి పునర్జన్మ తత్వం లేదు. కల్పాంత్యదినం వరకు, భగవంతుడు వచ్చి, వారి పుణ్య పాపముల తూచి తీర్పు ఇచ్చే వరకు. వారి దేహాలు గోరీలో వేచి యుండవలెను.

46. "షమన" శబ్దం సంస్కృత "శ్రమణ" శబ్ద భవమని నా మతం (తి.) శ్రమణ అంటే సన్యాసి విశేషం. "శ్రమణ" అనే పదం శతపథ బ్రాహ్మణములోననే ఉంది. బౌద్ధసన్యాసులకు శ్రమణులనే పేరుంది. సైబీరియా నుండి గ్రీకుఉత్తర దిశద్వారా షమనా చారం గ్రీసులోనికి ప్రవేశించిందంటాను దాడ్సు. సైబీరియా, మంగోలియాల కెచ్చట నుండి వచ్చింది? సైబీరియా,మంగోలియా ప్రాంతాలలో ప్రాచీనకాలం నుండీ బౌద్ధ ప్రభావం ఉంది. షమన తత్వం బౌద్ధులదే గ్రీకుకు ఆనుకొని ఉండే టర్కీలో "బోగోజ్‌కుయ్" అనే చోట జరిపిన త్రవ్వకాలలో క్రీ. పూ. 1400నాటి హిట్టయిట్ చక్రవర్తుల శాసన ఫలకాలు దొరికినాయి. ఇందు యజ్ఞం చేయబడినట్లు, మిత్రావరుణ ప్రసక్తి కలదు.. వైదిక ఋషుల ప్రభావమే పైథాగరస్ లాంటి వారిపై యుండి వుంటుందని నా ఊహా (తి).

47. మహావీరుడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహ్మదు, లొయోలా, వివేకానంద, రమణమహర్షి, అరవిందుడు మున్నగు వారలిట్టివారే

48. దేహాద్దేహాంతర ప్రాప్తిః పూర్వదేహం వినాసదా
అతివాహిక దేహేస్మి, స్వప్నే : ఇవ వినశ్వర
యోగవాశిష్ఠం 67 : 22
దీనిని యోగశాస్త్రమున కాయ వ్యూహమంటారు.

49. మన సిద్ధులు, యోగులు, నాథులు (నప), ఇట్టి శక్తులు కలవారు. వీరును పైథగోరసు వలె సంగీతజ్ఞులు. గోరక్షనాథునిపేర "గోరఖ్‌కల్యాణ" రాగం ఉంది.

50. ఈ భావం సాంఖ్య దర్శనంలోని పురుషస్య "విమోక్షార్థం" (సాంఖ్యకారిక) ను బోలుతుంది జీవుని బంధ మోక్షాలు ప్రస్థానత్రయంలో ప్రధాన విషయాలు.

51. "ఇడ ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి" అనే గీతా తత్వమే.

52. ఇది మన "పంచీకరణం" ను పోలుతుంది
వీరి భావస్తంను పురస్కరించుకొని అర్ఫియస్, పైథగోరసు, ఎంపెడొక్లిసులను "గ్రీకు బ్రాహ్మణులనవచ్చును. జోహాన్‌హెర్డరు (18వ శతాబ్దం)ను "జర్మను బ్రాహ్మణు" డనేవారు. అమెరికాలో "బోస్టను బ్రాహ్మణు" లున్నారు.

53. వీరికి " సోఫిస్టు " లని పేరు. మొట్ట మొదట ఈ బిరుదు గ్రీకు సప్తర్షులకుండేది. తర్వాత న్యాయ (తర్క) విద్వాంసులకి పేరు వచ్చింది. రాను రాను వితండ వాదులకీ అడ్డపేరు అతికి కొన్నది. సోక్రటీసు, ప్లేటో అందుకే వీరిని నిరసించినారు.

54. డెమొక్రిటసు అణు సిద్ధాంతం, మన కణాదకృత వైశేషిక దర్శనంలోని పీలుకా వాదాన్ని బోలుతుంది.

55. గాంధీ మహాత్ముడు కూడా ఈలాగే అనేవాడు.

56. ఇప్పటి మన హేతువాదులు రాహుకాలంలోనూ, వర్జ్యంలోనూ తమ కార్యక్రమాలు ఏర్పాటు చేసికొంటూంటారు.

57. హేతువాదులకంటే, అహేతుకతా వాదులే ఎక్కువ హేతువులను ఆశ్రయిస్తారు. పోయిన పని చెడి పోయేందుకు, తుమ్ము కారణం. పెళ్ళి కాకపోవడానికి జాతక చక్రంలో. నవగ్రహాలు ఒక దాని నొకటి గుడ్లురిమి చూస్తుండడం వల్లనే. అహేతుకతా వాదులకు ప్రతి కార్యానికి కారణముండ వలెను. కానీ వచ్చిన చిక్కేమంటే ఒక సంఘటనకు ముందు జరిగిన ఇంకొక సంఘటన మొదటి సంఘటనకు కారణం అవుతుందా అనేదే ప్రశ్న. "కాకతాళీయ న్యాయం" ఉండనే ఉంది, హేతువాదులు తమ నిగమనాన్ని అనామతులో ఉంచే ప్రమేయాలలో అహేతుకవాదులు తిరుగులేనికారణాన్ని ఒక దానిని బాధ్యత కల దానిగా చేస్తారు. (దీనిని నేను "ఆరోప మేషం"- స్కేప్‌గోట్ అంటాను) విధి, దేవుడు మున్నగునవన్నీ మానవుని "ఆరోప మేషాలే"- తమ తప్పులకు బాధ్యత వాటిపై ఆరోపిస్తారు కనుక.

58. హిట్లరు జర్మనీలోనూ, స్టాలిన్ రష్యాలోనూ, మెకార్తీ అమెరికాలోనూ ఇది ముమ్మరంగా జరిగింది. ఇప్పుడు అన్నిదేశాలలోనూ ఏదో ఒక మోతాదులో మేధావి వర్గం పీడింప బడుతూనే ఉంది.

59. ఇట్టి ప్రక్రియలకు మనలో చాలా పేర్లున్నాయి; చేతబడి, శూన్యం, మోడి, అభిచారం, బాణామతి, వశీకరణం, యక్షిణీ, సమ్మోహనవిద్య, మాయ, కనుకట్టు ఇటీవలి మన రచయితలు ఈ ప్రక్రియలు చాలానే వర్ణిస్తున్నారు. వీరేంద్రనాథ్, లత, లల్లాదేవి, ముదిగొండ శివప్రసాదు మున్నగువారు భయానక, బీభత్స రసాలకైతే బాగుకాని, అపరిణత పాఠకులను మనస్సులను అహేతుకతామయం చేయడం సరికాదని అనిపిస్తుంది.

60. ఆదివారం అమావాస్య అయిననాడు ఉత్తరం దిశలో యింటి చూరులో ఉన్న బల్లి తోకను టక్కున నరుకవలెను. ఆ తోక క్రిందపడి విల విల లాడుతుండి, అది తనుకు లాడుచున్నంత సేపు మనం ఉత్త బిత్తలై ఎగరడం, గెంతడం, కేకలు వేయడం చేయవలెను. తోక చచ్చిపోయిన తర్వాత, దానిని గుడ్డలో వత్తి వలె చుట్టి నూనె అద్ది, దీపం వలె వెలిగించి, వీధిలోనికి తీసికొని పోతిమా, ఇక చూసుకోండి ఆ దీపం చూచిన స్త్రీపురుషులందరూ మనం ఇంతకు ముందేయే చేష్టలు చేసినామో అవన్నీ చేస్తారు. ఇది ఒక సమ్మోహన విద్యాప్రక్రియ. ఒక ప్రాచీన గ్రంథంలోది మేము బాలురుగ ఉన్నపుడు ప్రయత్నించిన వశీకరణవిద్య. ఇది ఎంతవరకు జయప్రదమైనదీ పాఠకుల ఆలోచనకే వదలి వేస్తున్నాను - (తి).

61. ఫ్రాయిడ్ "లిబిడో", ఈ సిద్ధాంతాన్ని బోలుతుంది. కళ శాస్త్రం, శేముషి పెంపొందేది లిబిడో ఉదాత్తీకరణంవల్లనే అనేది ఫ్రాయిడ్ సిద్ధాంతం. దీనికి మూలం కామభావ "సబ్లిమేషను" అట. "సబ్లిమేషను"ను మన మహర్షుల "ఊర్ధ్వరేతస్కత"గా జమకట్టవచ్చును.

దైహికం కాని శృంగారభావాన్ని "ప్లేటోనిక్ లవ్" అంటుంటారు. "ఉత్తరరామచరితం"లోని "అద్వైతం సుఖదుఃఖయో :" అనే శ్లోకంలో వర్ణించిన దాంపత్యప్రేమను, రాయప్రోలు వారి "అమలిన శృంగార"మును ప్లేటోనిక్ ప్రేమగా పరిగణించవచ్చునా అనేది చర్చనీ యాంశం. (తి).

62. అరిస్టాటిల్ బోధించిన పాఠశాల ఆలివ్‌తోపు "లూకియన్" ప్లేటో బోధించిన ఆలివ్ తోపు "అకాడెమీ"

63. వీరిని "స్టోయిక్కు" లంటారు. విరక్తి, బాహ్య ప్రపంచంనుండి స్వాతంత్ర్యం వీరి సిద్ధాంతం.

64. నీతి మంతజీవితం, నిరాడంబర జీవనం వీరి ధ్యేయం. ఎపిక్యూరియన్ తత్వం అంటే "భోగవాదం" ("పీత్వాపీత్వా పునఃపీత్వాలోపలి) అనే అపప్రథ ఉంది అదిసరికాదు.

ఎపిక్యూరిస్ సిద్ధాంత సూత్రాల గుళికలివి :

1. అఫొబోస్ / ఓ / థియోస్ / = దైవభయం లేదు
2. అనై_స్తిటోస్ / ఓ / తనటోస్ / = మృత్యువు నొప్పించదు
3. టో / అగతాన్ / యు_క్టిటోన్ / = మంచిది సాధించవచ్చు
4. టో / డైనోన్ / ఎవక్కర్టెరిటోన్ / = చెడ్డది సహించవచ్చు.

65. అలెగ్జాండరు కాలం (క్రీ. పూ. 4వ శతాబ్దం) నుండి క్రీ. పూ. 1వ శతాబ్దం వరకు వెలసిన విశాల గ్రీకు సామ్రాజ్యాన్ని హెల్లెనిక్ వ్యవస్థ అంటారు.

66. "స్కెప్టిక్కు" లంటే "సందేహవాదులు" జ్ఞానం దుర్లభం. దేనిమీదా నిక్కచ్చిగా తీర్మానం చెప్పకూడదు. సర్వం సంశయాత్మకం. విరక్తి, మనశ్శాంతి కల్గిఉండవలె అనేది వీరిమతం.

67. హెల్లెనిక్ సామ్రాజ్యం తర్వాత వెలసిన గ్రీకు సామ్రాజ్యం దీని రాజధాని టర్కీలోని కాన్స్టాంటి నోపిల్. దీనిని టర్కీవారు క్రీ.శ. 15వ శతాబ్దంలో స్వాధీనం చేసికొన్నారు.

68. "ఎలిజీ" అనబడే కవితారూపాన్ని సృష్టించినవాడు శ్రీశ్రీ. కొంపెల్ల జనార్దనరావు మీద వ్రాసిన కవిత "ఎలిజీ"యే.

69. భూగోళపరిధిని సరిగా అంచనావేసిన శాస్త్రవేత్త.

70. ఉన్నత పాఠశాలా విద్యార్థులు నేర్చుకొనే ఆర్కిమెడీసు సూత్రమితడు చేసిందే.

71. అలెగ్జాండరు కాలపువాడైన డయోగెనీసు "సినిక్" తత్వావలంబి "సినిసిజం" అంటే "తిరస్కారవాదం" సర్వవాంఛలనూ, భోగాలనూ తిరస్కరించి మిక్కిలి నిరాడంబర జీవనం గడపుటే "సినిక్కు"ల జీవనవిధానం డయోగెనీసు ఒకమంది తొట్టెలో నివసించేవాడు. "నేను అలెగ్జాండరును కాకుంటే డయోగెనీసు అవుతాను" అని అలెగ్జాండరన్నాడట.

72. "మణి మీ అదృష్టం చెప్పగలదు." వంటి ప్రకటనలు నేటి మన వార్తా పత్రికలలో చూస్తాము. గోచారఫలం, చిలుక జోస్యం, బల్లిపడే శాస్త్రం తులసి, అశ్వత్థం దివ్యమహిమాన్వితాలు.

73. 1. "కుబెలె"ను "పెద్దమ్మ" అంటారు ఆదవాని దగ్గరి కపద్గ్రామంలో ఊరువాకిలి దగ్గర ఒక రాతి స్తంభం ఉంది. దీనిని "మూదుమొగాలమ్మ" అని పూజిస్తారు.

2. "కొరిబాంటెస్" వలెనే, కర్ణాటకలో సవదత్తి అనే చోట ఎల్లమ్మ (రేణుక) జాతరజరుగును. ఇచట స్త్రీలు ఆరాధకులు, కొజ్జాలు, పూజారులు ఉంటారు.

3. పిల్లనగ్రోవి. డోలువాద్యములతో మతావేశనాట్యం చేసేది ప్రపంచ వ్యాప్తంగా ఉంది. ఆలూరు తాలుకా నెరణికి గ్రామంలో "గొరవయ్య"లు, పిల్లనగ్రోవి ఊదుతూ, డమరుకాలు వాయిస్తూ గుండ్రంగా తిరిగి కుణియుచుందురు వీరి దేవత "మల్లయ్య" (శ్రీశైల మల్లికార్జునుడు)

టర్కీలో దర్విషులనబడే మహమ్మదీయ సన్యాసులు పిల్లనగ్రోవి ఊదుతూ గుండ్రంగా తిరుగుచూ ఆవేశ పూరిత నాట్యాలు చేస్తారు.

చైతన్య మతాను యాయులు ఆనందమార్గీయులు ఆవేశంగా నాట్యాలు చేస్తారు. బెంగాలులో సన్యాసులు, సన్యాసినులు వెన్నెలరాత్రులలో భక్త్యావేశంతో పిల్లనగ్రోవులాదుతూ, పాటలు పాడుతూ లాస్యం చేస్తారు. వీరిని "బౌవుల్" అంటారు.

"బావుల్" సంగీత బాణీ రవీంద్ర సంగీతంలో కన్పడుతుంది.

నేడు అయ్యప్ప అనేదైవాన్ని పూరేగిస్తూ మగవారు నల్లబట్టలు కట్టుకొని, తాత్కాలిక గడ్డాలు పెంచుకొని పిశాచములవలె కన్పడుతూ, చిందులు త్రొక్కుకుంటూ పోతారు. భగవాన్ రజనీష్ భక్తులు ఉత్తరిత్తలయి పిచ్చి పిచ్చిగ ఎగిరి ఎగిరి పడిపోతారు. "పండితారాధ్య చరిత్ర"లో పర్వత ప్రకరణంలో భక్తుల చిత్రవిచిత్ర నాట్య భంగిమలు వర్ణించబడినాయి.

యమునాపులిన తలమందు గోపికలు చేసిన రాసక్రీడ గ్రీకుస్త్రీల "ఒరిజిసియ" లాంటిది వీరందరిదీ ఒక విధమైన మదపిచ్చి - "కామోత్కంఠత." ఈ మదపిచ్చి రకరకాల "సబ్లిమేట్" అవుతుంటుంది. శ్రీకృష్ణ పరమాత్మ అంతటివాడు బుద్ధునవచ్చి గోపికలకు "విడుచుట మర్యాద కాదు. "విభుదంగనకున్" అని బుద్ధి చెప్పి ఇండ్లకు పంపించవలసివచ్చింది. మరిడయోనిసను అట్టి మర్యాదా పురుషుడు కాడాయెను.

74. హేతువాదం గురించి ఇంతవ్రాసినవాని వాక్యంలో కూడ ఈ పరిభాష దొర్లడం, మానవునిలో ఆ హేతుకత ఎంతగా జీర్ణించిపోయిందో తెల్పుతుంది. (ఠ)

---

# నా చూపుల లోపలి వెలుగు

## ప్రియదర్శి

నా కన్నుల తారకలు
నియమాల అస్త్రాది వెనక
దాగిన
నీ ఎద మంటల కాంతుల ప్రతిఫలిస్తాయి.
అస్త్రాది నెదిరించి
ఉదయించి
నీవు దివ్వరోచిస్సుల
గండూషించినపుడు
నా దృష్టి బూదియై
నికర స్పర్శ భీతిచే
నే పరువులెత్తి
తిరిగి
తిమిర శక్తుల అక్షౌహిణులు
నిన్ను
అస్త్రాది దుర్గంలో బంధిస్తే
నీకై అశ్రువులు రాలుస్తూ
నీ ఎద మంటల కాంతులు ప్రతిఫలిస్తూ,
కవితలు రాస్తా....

నోటకు కాళ్లు చేతులు ఆడటంలేదు. చెమటలు దిగజారుతున్నై. పారి పోదామంటె వాకిలి దూరంగా వున్నది. ఎదుట ఏనుగంతజీవి తలవంచి పొడి చేందుకు సిద్ధంగా వుంది. వెనక గోడ. ఎవరినైనా పిలవటానికి నోరు పెగలటల్లేదు. అందరికీ వచ్చినట్టే ఈ ఆపదలో ఆపదమొక్కులవాడే గుర్తొచ్చాడు. అప్రయ త్నంగా నోటినుంచి 'ఏడుకొండలవాడా వెంకన్నా' అన్న మాటలు దొర్లినై. చేతులు జోడించాను. ఆ వృషభరాజం సంతోషంతోనో ఏమో తల గిర గిర తిప్పింది. దాని మెడలో బంతిపూలదండ రంగులీనింది గజ్జలు గలగలమన్నై. గంటలు గణగణ మోగినై. నా ప్రాణాలు కైలాసం చేరుకున్నంత పని అయింది. నందీశ్వరుడు ఒక అడుగు ముందుకు వేశాడు. "ఏది దారి వెంకన్నా" అన్నాను పెద్దగా. బసవయ్య నన్ను తన వల్లని ముట్టెతో తాకింది. బావురేలివి అన్నట్టు కునివచ్చి సుమతి వెంకన్న ముందు పెట్టింది దాని మెడమీద రాస్తూ. 'అన్నయ్యా' అంటూ నా వైపు తిరిగింది. అంతే, "ఏమయిందన్నయ్యా" అంటూ నన్ను పట్టు కుని కుదుపుతున్నది.

"ఏం లేదమ్మా మన వెంకన్న మీ అన్నయ్యని మర్యాద చెయ్యబోయింది. దాంతో మీ అన్నయ్య హడలిపోయినట్టున్నాడు. పోయి ఒక కప్పుకాఫీ తీసుకొచ్చి ఇవ్వు" అన్నాడు బాబాయ్.

వెంటనే సుమతి లోపలికి పరుగు తీసింది. పొగలొస్తున్న కాఫీకప్పు నా



# వెంకన్న

నేను దాని గంగడోలు నిమిరాను. అది పరవశించిపోతూ కన్నుమూసుకుని తల ఆడించింది.

ఇంతలో పనిమీద బైటికి వెళ్లిన బాబాయ్ పంచ దగ్గరికి వచ్చారు. నా అవస్థచూసి "భయపడబోకు రమణా అదేంచెయ్యదు." అంటూ 'వెంకన్నా' అని పిలిచాడు. నన్ను ఇంతసేపూనిలేసిన ఆ వెంకన్న హుందాగా బాబాయ్ దగ్గరికి వెళ్లింది. దాని తలపైన రాస్తూ బాబాయ్ "అమ్మాయ్ సుమతీ వెంకన్న వచ్చాడు. దాణాతట్ట తీసుకురా అమ్మా" అని కేక వేశాడు.

అప్పటికి నాకు రియాక్షన్ మొదలయింది. ఒళ్లంతా వణికిపోతున్నది. కుర్చీలో కూలబడ్డాను. ఒక పెద్ద గంపలో నానపెట్టిన వులవలు, పెసలు తీసు

గోళ్ళమూడి లలిత

చేతుల్లో పెట్టింది. వణుకుతున్న చేతులతోనే మెల్లగా తాగటం మొదలుపెట్టాను నేను. ఇప్పుడు నా భయానికి నేనే సిగ్గుపడుతున్నాను. ఖాళీ చెంబు కిందపెట్టాను.

"ఏం అన్నయ్యా ఇప్పుడు ఎట్లావుంది" అన్నది సుమతి. బాబాయ్ నవ్వాపుకుంటూ చూస్తున్నాడు.

"బాగానే వున్నా సుమతీ. మరేం కంగారులేదు !

వెంకన్న వైపు చూశాను. విలాసంగా తలఎగరేస్తూ బుట్ట ఖాళీ చేస్తున్నది. కిందకు చిమ్మిన ధాన్యాన్ని సుమతి తట్టలోనే వేస్తున్నది. బాబాయ్ దాని గంగడోలు నిమురుతూ నుంచున్నాడు. వెంకన్న ఎంత హుందాగా ఠీవిగా వుంది ! ఎంత వున్నతమైన ఆకారం ! తగ్గ దర్పం. కైలాసం వదిలి వచ్చిన నందీశ్వరుడా అనిపించింది. ఇప్పుడు దాన్ని చూస్తే భయంపోయి ముచ్చటనిపించింది. దగ్గరికి పోయి నేనూ మెడ నిమిరాను "చూశావా నిన్నూ జయించాను" అన్నట్టు నన్నొక చూపుచూసి తట్టలో మూతిపెట్టింది. దాదాతట్ట ఖాళీ అయింది. వెంకన్న అందరికి టాటా చెప్తున్నట్టు ఒక చూపుచూసి మెడ విదిలించుకుని వెళ్లి పోయింది.

"బాబాయ్ ఏమిటి వెంకన్న కథ" అన్నాను.

"వెంకన్న చరిత్రా. చెప్తాను. అమ్మాయ్ సుమతీ మీ అమ్మ భోజనానికి రమ్మంటుందేమో చూడు.

ఇంతలో పిన్ని పంచలోకి వచ్చింది, "మీ కబుర్లు వినేవాళ్లుంటే పొద్దే తెలియదు. భోజనానికి లేస్తారా" అంటూ.

"చూశావా రమణా, ఇదీ వరస. అందుకే సుమతిని చూసి రమ్మన్నా- వెంకన్న సంగతి అన్నం తిని చెప్తా" నంటూ లేచాడు.

* * *

అవి నేను చదువుకునేరోజులు.... ఇంకో రెండేళ్లల్లో నా ఇంజనీరింగ్ కోర్సు ఐపోతుంది. ఒక నెలరోజులు శలవలు వచ్చినై. మా పిన్నిని చూసి చాలాకాలం అయింది అమ్మదగ్గర కన్నా నాకు పిన్నిదగ్గరే చనువు ఎక్కువ. పిన్ని పెళ్లి చేసుకుని వెళ్లిపోయినాక అప్పుడప్పుడు అమ్మమ్మావాళ్ల వూళ్లో కలుస్తునే వున్నాను. శలవలకి తప్పకుండా రమ్మని పిన్నిరాసింది. పిన్నికి ఒక్క ఆడపిల్ల సుమతి. అందుకని నా కింకా పిన్ని గారాబం తగ్గలేదు. దాంతో ఈరోజు పొద్దునే పిన్ని వాళ్లవూరు చేరుకున్నాను.

పిన్నివాళ్లవూరు చంద్రగిరితో కలసే ఒకపల్లె అనాలి. బాబాయ్ అక్కడి మోతుబరిరైతు. ఇల్లూవాకిలి, వాతావరణం అంతా నేను అలవాటు పడ్డ పట్టణానికి విరుద్ధంగా వుంది. కాని ఆహ్లాదంగా వుంది – వెంకన్న ప్రవేశించేదాక.

భోజనానికి కూర్చున్నాం. నా కోసం స్పెషల్‌గా బంగాళ దుంపలు వేయించింది. కొబ్బరి పచ్చడి చేసింది. అప్పడాలు, వెన్నకాచిన నెయ్యి, గడ్డపెరుగు, పిన్ని బలవంతం చేసి తినిపించడంతో పీటమీద నించి లేవలేకపోతే సుమతి నవ్వుతూ చెయ్యి అందించింది. వక్కపలుకు నములుతూ బైట పంచలో కూర్చున్నా వీధిలోకి చూస్తూ.

బాబాయ్ కూడా వచ్చి పడక్కుర్చీలో నడుం వాల్చాడు పొగాకుపాయ విచ్చతీస్తూ. సుమతి ఒక కుర్చీపీట తెచ్చుకుని కూర్చుంది వాళ్లనాన్న ప్రక్కన, ఇంక చెప్పునాన్నా వెంకన్న కథ అంటూ.

"ఎన్నిసార్లు విన్నావే తల్లీ నువ్వు ? నీకెందుకు తొందర ?"

"ఎన్నిసార్లు విన్నా నాకు వినాలనే వుంటుంది నాన్నా మొదలుపెట్టు" అని గునిసింది.

"సరే వినండి" అంటూ మొదలుపెట్టాడు బాబాయ్.

ఇది పది పన్నెండేళ్ళనాటి మాట. అప్పటికి ఇంకా నా పెళ్ళికాలేదు. ఈ వెంకన్న వచ్చినాకే మీ పిన్నిని చూడటానికి వెళ్లాను. అంతకు మూడేళ్ళనాడు పొలంలో పాము కరచి మా నాన్న పోయినాడు. వ్యవసాయం నేను చేతపట్టాను. అప్పటికి నాకు ఇరవై ఏళ్ళలోపు వుంటుంది. పెత్తనం అంతా నాదే. అరకకు కట్టే ఎడ్లు ముసలివైపోయినై. నేనూ మంచి హుషారులో వున్నాను. అవి నా జోరుకు తట్టుకోలేకపోతున్నై. విసుగేసి వాటిని తెలిసిన ఒక బక్కరైతుకి అమ్మేసి, మంచి గిత్తలని కొనటానికి ఒంగోలు వెళ్ళాను. మా నాన్న నాకు అన్ని వ్యవసాయ విషయాలు, గొడ్ల లక్షణాలు నూరిపోశాడు. దాంతో ఒక చక్కని ఎడ్లజత పక్కవాడితో పోటీపడి ఒక వెయ్యి ఎక్కువే అని తెలిసీ కొన్నాను. ఒకటి రామన్న సాధువు. ఇంకా అరక లాగుతున్నది. రెండోది ఈ వెంకన్న. ఈ రెండు వచ్చినాక నాకు చాలా కలిసొచ్చిందనే చెప్పాలి. వెంకన్నకి మంచి సుళ్ళు వున్నై అంటారు. అందుకని ఎవరు పని మొదలుపెట్టినా ముందు వెంకన్నని తీసుకెళ్ళి నేల తొక్కించేవాళ్ళు. వాళ్ళు అన్నట్టుగానే వెంకన్న కాలుపెడితే బంగారమే పండేది. రామన్న ఎంత పిరికో దీనికి అంత ధైర్యమెక్కువ. చురుకుతనం జాస్తి. మొండితనమూ ఎక్కువే. నాగలి విరగాల్సిందేకాని తానొక్కతే అయినా కాడిలాగడం మానేది కాదు. మందవేస్తే అన్నిటికన్న ముందు ఇదే లీడర్. అట్లా అని పొడిచి అన్ని చేసేదికాదు. చిన్నపిల్లలు అడ్డువస్తే ఆగిపోయి నుంచునేది.

వెంకన్న అంటే అందరికీ ప్రత్యేక అభిమానం. వెంకన్న వచ్చినాక నా పొలం బంగారం పండింది. విరగపండింది. అప్పుడే రెండు డాబాగదులు వేయించాను. సంవత్సరం తిరగకుండానే పక్కపొలం రెండెకరాలు చెక్కకొని కలుపుకున్నాను. అమ్మ నన్ను పెళ్ళిచేసుకోమని పోరటం మొదలుపెట్టింది. మీ పిన్నిని చూసి వచ్చాం........."

అంతలో అటొచ్చిన పిన్నిని చూసి "అంత కోతి కాదనుకున్నాను" అన్నాడు. "ఔను పాపం ఈ నలకూబరులకి నేను తగకపోతానేమో నని దిగులు పడ్డా" అంది పిన్ని.

సరే సంబంధం నిశ్చయమయింది. మంచిరోజు చూసి మీ పిన్నికి నగలు చేయించటం మొదలుపెట్టాలంది మా అమ్మ. మర్నాడు పొద్దున పట్నం పోవాలనుకున్నాను.

సంజవేళ అయింది. ఇంతలో మా పాలేరు కొడుకు శీనప్ప "అయిగోరూ ఓ అయ్యగోరూ" అంటూ చెమటలు కక్కుతూ, రొప్పుతూ లోపలికి పరిగెత్తుకొని వచ్చాడు. వాడి వంటిమీద అక్కడక్కడ గాయాల్లోంచి నెత్తురు కారుతున్నది. వాకిట్లో రామన్న . దానికీ గాయాలు, నెత్తురూ. నన్ను చూస్తూనే శీనప్ప శోకాలు మొదలు పెట్టాడు.

"ఏమిటిరా శీనప్పా ఏమయింది" అడిగాను. వాడినోట మాట రాలేదు.

"వెంకన్న ఏదిరా" అన్నాను

శీనప్ప ఇంకా వణికి పోవటం మొదలు పెట్టాడు. అప్పటికే పదిమంది చేరారు. లోపలికి కేకవేసి కాస్త మజ్జిగ వాడిచేత తాగించి కాస్త తేరుకున్నాక అడిగాను ఏమయిందిరా శీనప్పా ? మీ అయ్య నాగప్ప ఏడీ" అని.

అయ్య కంప కొట్టుకు వస్తా నువ్వు ఎడ్లని తోలుకు పొమ్మన్నాడయ్యా. నేను రామన్న వీపునెక్కి వస్తున్నా. ఎంకన్న ఎనక నడుస్తున్నది. అంతలో అక్కడ చెరుకుతోట మలుపులో గుట్టలు తుప్పలున్నై చూడయ్యా ఆడ కొచ్చేటప్పటికి రామన్న బెదరటం మొదలు పెట్టింది. ఎంతకూ ముందుకు పోటం లేదయ్యా, అంతలో.... అంతలో.... అంటూ వణకటం మొదలు పెట్టాడు. శోకాలు మొదలు పెట్టాడు.

వాణ్ణి బుజ్జగించి మళ్లీ అడిగాను.

# కీళ్ల పట్లు తనని
# కట్టి పడేయడం దేనికి?

## నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.




మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి— ఇవే తనకి కావలసినవి. అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే అయొడెక్స్‌లో గాయపడిన ధాతువులను నయంచేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరి ఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండుసార్లు రెండింతలు గుణకారి.**

నొప్పి తగ్గేవరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండుసార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువుకైన గాయం.

కనుక మీ అమ్మలు ఎవరైనా కీళ్ల పట్లు బెణుకులు, కండరాల పట్లు, ఒళ్లు నొప్పులతో బాధపడటం జరిగితే కాస్త అయొడెక్స్ మర్దించండి. రోజుకు రెండుసార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్® — నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్.**

ELL-1510

SK&F — ఎస్ కె ఎఫ్ ఉత్పాదన.

# అందగాడు తిలక్

శ్రీ సి. వీరరాఘవులు

ఎవరికీ చెప్పక
ఎవరినీ పిలవక
ఒంటరిగా తానొక్కడే
అమృతం కురిసిన రాత్రిలో
కురిసిన అమృతాన్ని దోసిళ్లతో
తాగి వచ్చిన తిలక్
కనుమరగి పోయాడంటే
అనుమానం వేయదూమరి ?
అతడు త్రాగింది
అతని దోసిళ్లనిండింది
అమృతం కాదంటే
కోపం రాదు కదూ మీకు ?
ఆనాటి రాత్రి
అంటే
అమృతం కురిసిన రాత్రి
అందరూ జోగుతుంటే
తిలక్ మాత్రం
తలుపు తెరచి, ఇల్లువిడచి
కొండ దాటి, కోనదాటి
వెన్నెల్లో నిలుచున్నాడు
అందమైన అప్సరసలు
ఆనందంగా చూచారు
మనం కోరేవాడు
అందం ఆనందం ఉన్న
అసలుసిసలు, నగటు మనిషి
ఇతడే సుమీ
మన ప్రియుడు, నరుడు;
మనకిక వరుడు, అని
మాయదారి దేవునికి
మనవి చెప్పుకొన్నారు
కొసరు కొంచెమైనా వేయని
పిసినారి కోమటి దేవుడు
వెన్నెల రాత్రిలో, బేరాల సాముగరిడీలలో
అసలు
ఆయువుకే ఎసరుపెట్టి
మృత్యువనే తప్పుడు అమృతాన్ని
తప్పగా తాగించాడు,
తిలక్
తృప్తిగా తాగేసాడు
దుఃఖాన్ని, చావుని కసరికొట్టాడు, అందుకే
తిలక్ వెళ్లిన చిరునామా ఎవరికీ తెలీదు
అందగాడు తిలక్
అందరికి అందుబాటు వాడు,
తి...

# వెంకన్న

'ఓ పెద్దపులి అరుస్తూ నా మీదికి రామన్న మీదికి దూకిందయ్యా. కాని దానికి దోవలో ఓ కొమ్ము అడ్డొచ్చి పక్కవాటుగా పడ్డదయ్యా.... అంతకీ నాకు, రామన్నకి వొళ్ళు చీరుకుపోయింది. రామన్నకి దాని పంజా తగిలి వీపుమీద వెనకాల కండ వూడొచ్చిందయ్యా. రామన్న ఒక అరుపు అరిచి వూళ్ళోకి లగెత్తు కొచ్చిందయ్యా. నేను చత్తానని భయపడి దాని మెడపట్టీ పట్టుకొని నల్లి అంటుకున్నట్టు అంటుకుపోయినా. మళ్ళీ కళ్ళు తెరిచే టప్పటికి ఈ వాకిట్లో వున్నానయ్యా'' అంటూ మళ్ళీ ఏడుపు లంకించుకున్నాడు.

వాణ్ణి ఓదార్చి ఏడుపు మానిపించటానికి కొంత సేపు అయింది. ఈ లోపల వెంకన్న సంగతి ఎన్నిసార్లడిగినా ప్రయోజనం లేకపోయింది. వాడి ఆరాటం కొంత తగ్గినాక అడిగాను వెంకన్న ఏడిరా అని.

అది వింటూనే వాడికి మిడిగుడ్డు పడ్డై. వెంకన్న ఎనకాల వత్తున్నదయ్యా. రామన్న లగెత్తడంతో ఇంక దాన్ని నేను చూడలేదయ్యా అన్నాడు.

ఇంతలో వాడి తండ్రి నాగప్ప వచ్చాడు కంప కొట్టుకుని. గుంపుని చూసి శీనప్పకి ఏమయిందోనని గుండెలు బాదుకుంటూ తోసుకొచ్చాడు. తండ్రిని వాటేసుకుని శీనప్ప ఏడుపు లంకించుకున్నాడు. జరిగిందంతా విని నాగప్ప'అయ్యోరూ ఇంకే ముందయ్యా ఐపోయింది దోవనంత అక్కడక్కడ నెత్తురు మరక లున్నయ్యయ్యా. నేలంతా ఎంకన్న గిట్టలతో తన్నినట్టు , పులి అడుగులు, గోళ్ళ గుర్తులు, వున్నై అయ్యా. ఒకచెట్టు మొదలుకు పులిచర్మం ముక్క ఇంత వేలాడు తున్నదయ్యా. అక్కడ పెద్దయుద్ధం జరిగినట్టు వుంది; నేలను చూస్తే వెంకన్న కనపడలేదు. అంతా ఐపోయిందయ్యా. మన వెంకన్న ఇంక మనకి లేదు. అంటూ వాడు ఏడుపు లంకించుకున్నాడు.

అప్పటికి బాగా చీకటి పడ్డది.వెంకన్నను వెతుక్కుంటూ పోవాలన్నా భయమే. ప్రమాదమే. ఇంక చెయ్యకలిగింది ఏమీ లేకపోవటంతో నాగప్పని ఇంటికి పొమ్మన్నాను, నేను బరువెక్కిన గుండెతో లోపలికొచ్చాను. వెంకన్న అంటే నాకు ప్రాణం. దానికి బహు తెలివితేటలు. ఏనాడు ఎవరిమీద కొమ్ము విసరలేదు. తల ఝాడించలేదు. మనిషికి వున్న సమయస్ఫూర్తి వుంది. పొలంలో పాలేరు కొడుకు పసివాడు పాకుతూ పంటకాలవలో పడబోతుంటే వాడిచొక్కా పట్టుకొని లాక్కొచ్చింది. వెంకన్న ఇంటి కొచ్చినప్పటినుంచి అన్నీ కలిసి వచ్చినై. కాని ఇప్పుడు ఏమిటో ఇట్లా అయింది. పెళ్ళి నగలు కొనబోతూంటే ఈ అపశకునం ఏమిటి ? ఈ వుద్దేశంతో మీ పిన్నిని వద్దని చెప్పుదామనుకున్నాను కూడా,

"పోనీలెండి వృద్ధరించారు" అన్నది అక్కడే వున్న పిన్ని.

'ఆరోజురాత్రి' నేను భోజనం ముట్టలేదు. కన్ను మూయ్యలేదు. జాగారమే అయింది. ఎంతకీ తెల్లవారదేమో అనుకుంటూ గడిపాను. తెల్లవారిందన్నట్టు సంధ్య వెలుగులు ప్రసరిస్తున్నై. ఇంతలో పనిలోకి వచ్చిన పాలేరు భార్య వెంకటమ్మ "ఓ. లమ్మో ఓయ్‌దేముడో'' అంటూ గావుకేక పెట్టింది. నేను, అమ్మా, జీతగాళ్ళం దరం లేచి వాకిట్లోకి పరిగెత్తాం.

'అప్పుడు చూసిన దృశ్యం వర్ణించి ప్రయోజనంలేదు. చూసి తీరవలసిందే. ముఖం మీదా వంటినిండా నెత్తురు ఎండిపోయిన గాయాలతో, కొన్నిచోట్ల చర్మం కండలు వేళ్ళాడుతూ, అలిసినా ఇంకా శివం దిగని వెంకన్న, దాని కొమ్ములపైన ఇరుక్కుపోయి నిలిచిపోయిన పెద్దపులి. ఇది చూసిన ఎవరికి కాళ్ళూ చేతులు ఆడలేదు. బొమ్మలల్లె నిలబడి పోయినాము.

నేనే ధైర్యం చేసి 'వెంకన్నా' అని పిలిచాను అంత బరువుతోను గంటలు గణ గణ మోగిస్తు తల ఆడించింది. పెద్దపులి కొనవూపిరితోనున్నా సరే అనుకుని నేనే రండిరా అంటూ పాలేర్లని కేక వేసుకుని, తలాఒక కర్రతీసుకుని

వెంకన్నని సమీపించాం. మా చేబడితెలతో పులిని ఎత్తి కింద పడేశాం. అది ఎప్పుడో చచ్చివుంటుంది. దాని గుండె స్థానంలో పెద్ద కంత వుంది.

'ఈ వార్త సూర్యుని వెలుగుకన్న వడిగా ఊరంతా క్షణంలో పాకింది. ఊరి ముత్తైతలు, ఇంట్లోవాళ్ళు వెంకన్నకు పోటీలుపడి హారతులు ఇచ్చారు. పిడకలతోటి, తాటాకులతోటి, చీపురుతోటి దిష్టి తీశారు.

ఆరోజు పెద్ద తిరణాలే అనుకో. వెంకన్న వొళ్ళంతా జాగ్రత్తగా కడిగారు. గాయాలకు మందు రాచారు. కడుపుకు తినలేనన్ని రకరకాల ధాన్యాలు, చెరకుగడలు పెట్టారు. మొయ్యలేనన్ని దండలు మెడనిండా వేశారు. మఖానికి కాళ్ళకి పసుపురాచారు. నుదుట బొట్టుపెట్టారు. కాళ్ళకి గజ్జలు కట్టారు. ఇంక చుట్టూచేరి హారతులిచ్చారు. భజనలు చేశారు. ఏడుకొండల వెంకన్నే అన్నారు, ఆనాటినుంచి ఈ వెంకన్న దాష్టికపు స్వాములవారు అయింది.

"బాబాయ్ అసలు ఏంజరిగి వుంటుందంటావ్ ?" అన్నాను.

"ఏంలేదురా రమణా అప్పుడు తిరుపతి కొండలపక్క అడవులలో మనుషులని తినే పులి తిరుగుతూ వుండేది. అది తిరుగుతు తిరుగుతు ఈవూరికి వచ్చి వుంటుంది. మన శీనప్పగారు పిల్లవెధవగదా, తేలిగ్గా పట్టుకోవచ్చనుకుని శీనప్ప మీదకి దూకింది. వాడి అదృష్టం బాగుండి రామన్న తప్పించుకుని వూళ్ళోకి పరుగు తీసింది. అప్పుడు వెనకగా తిరిగిరావస్తున్న వెంకన్న ఎదురైవుంటుంది ఆ పులికి. వెంకన్న మంచి పరువంలో బలంగావుంది. అవసరమైతే కుందేలుకూడా ఎదురు తిరుగుతుందికదా, ఇంక వెంకన్న సంగతి చెప్పాలా ? పులి సవాలుకు ఎదురుదెబ్బ తీసివుంటుంది. పులి గుద్దిదో, కుంటిదో అయివుండటానే అది మనుషులరుచి బాగా మరిగి వుంటుంది. తేలికగా చేతికిదొరికి ఆకలి తీర్చగలిగేది మనిషని తెలుసుకుంది. మొత్తానికి రెండూ బాగా పోట్లాడుకుని వుంటై. ఆ దెబ్బలాటలో వెంకన్న దాన్ని చిత్తుచేసి ఆఖరు ప్రయత్నంగా పులి దూకబోగా కొమ్ములతోగుచ్చి పైనవేసుకుని చెట్టుకేసి కుమ్మివుంటుంది వెంకన్న హీరో అయి తిరిగి వచ్చింది.

ఆ తరవాత దాన్ని అరక్కి కట్టలేదు. చెప్పొగా అది స్వాములవారు అయిందని. అందరూ దానికి పూజలు, పునస్కారాలు. నైవేద్యాలు భజనలు మొదలుపెట్టారు. అది సాక్షాత్తు ఏడుకొండలవెంకన్నే అయిందనుకో."

"ఆదా నేను ఇందాక భయంతో ఏడుకొండల వెంకన్నా అనగానే సంబరంగా తల ఆడించింది."

"ఇంక మొదలయిందిరా వెంకన్న భోగం. ఇది పాదంపెడ్తే అంతా శుభమే అన్న నమ్మకం జనానికి కలిగింది. గృహప్రవేశాలకి ఇది మొదటి అతిథి. ప్రతి శుభకార్యానికి దీనికి పూజ, కోరుకున్న తిండి. పెళ్ళికి ఇదే పెద్ద. ఒకటేమిటి ఇది ప్రత్యక్షదైవం 'ఏడుకొండల వెంకన్న' ప్రతిరూపమే ఇది అన్నారు. కాకపోతే పులిని చంపగలదా అన్నారు.

'ఇంక దీని కథ వూరూర చిలవలతో పలవలతో పాకిపోయింది. వెంకన్న ముట్టింది ముత్యం. తాకింది బంగారం. కాలుమోపితే కనకాభిషేకాలు అన్నట్లు అయింది, ఊరూరు తిప్పారు. మేళతాళాలతో వూరేగింపులు జరిపారు. హారతులు ఎత్తారు. పూలదండలలో ముంచిఎత్తారు. వూరూర తిరణాలే. వుత్సవాలే చేశారు. దాంతోపాటు పాలేరు నాగప్పని పంపాను, తిప్పితీసుకుని రమ్మని. అట్లా కనీసం రెండుమూడేళ్లు తిరిగి గూటికి చేరింది. అప్పటినుంచి ఈ వెంకన్న తీరు ఇది. ఆ సేవలన్నీ దీనికి బాగా నచ్చినట్టు వున్నై. అందరినీ దండలు వెయ్యమంటుంది. దాని కిష్టమైన తిళ్ళు పెట్టమంటుంది. అందరి సొత్తుగా తిని తిరుగుతుంది. నా వాకిట్లోకి ఈ వేళకి తప్పకుండా వస్తుంది. పెట్టింది తింటుంది. ఇష్టమైతే కాసేపు పడుకుంటుంది. వెళుతుంది. ఇదీ రమణా దీని కథ" అన్నాడు బాబాయ్.

'నేను మాత్రం మీదమీది కొస్తున్న దీన్ని చూసి హడలి చచ్చాను బాబాయ్. పై ప్రాణం పైన పోయిందనుకో. దేవుణ్ణి తలుచుకుంటూ వెంకన్నా అనగానే అది ఇంకా హుషారుగా తల ఎగరేసింది. నా నెత్తురు నీరే అయిందనుకో'' అన్నాను.

నేను, వున్న వారం రోజులు వెంకన్నకి నేనూ ఏదో ఒకటి పెట్టేవాడిని. మెడ దువ్వేవాడిని. మూపు సవరించేవాడిని. దాని గజ్జలు. గంటలు మోగితే నాకు సంగీతం విన్నట్టు వుండేది.

* * *

రెండేళ్ళ తరవాత చదువైపోయి ఉద్యోగంలో చేరాను. ముగ్గురు పిల్లల తండ్రినైనాను. పిన్నివాళ్ళవూరు చంద్రగిరి వెళ్తూనే వున్నాను. వెంకన్నను చూస్తూనే వున్నాను. వెంకన్న అంటే అభిమానం పెరుగుతూనే వుంది. తిరుపతిలో వుద్యోగం కావటాన కుటుంబాన్ని అక్కడ వదలి చంద్రగిరి ఓసారి వెళ్లాను. బస్సు వూళ్ళోకి పోతూవుండగా ఒక పెద్ద వూరేగింపు ఎదురొచ్చింది. బస్సు ఆపారు. ఏమయిందని కండక్టర్ ని అడిగాను.

"ఏం లేదు సార్ వెంకన్న చచ్చిపోయింది. ఆ వూరేగింపు అది" అన్నాడు.

"ఏ వెంకన్న ?"

"అదే సార్ ఈ పక్కల్నే పూజచేస్తూవుంటారే ఏడుకొండల వెంకన్న-ఎద్దు"

"ఎప్పుడు చచ్చిపోయింది ? ఎట్లా పోయింది?"

"నిన్న సాయంత్రం సార్. బస్సుకి అడ్డంగా నిలబడ్డదిట. ఎప్పుడూ అలవాటుగా వచ్చే డ్రైవర్లయితే ఆపుతారు. నిన్న కొత్తవాడు వచ్చాడు. పైగా తాగి వున్నాడుట. ఆపలేదు, స్పీడుగా వెళ్తున్న ఆ బస్సు ఢీ కొట్టి ఎత్తి అవతల పడేసిందట. ఆ దెబ్బకి వెంకన్న చచ్చిపోయింది. డ్రైవరు మంది చేతుల్లో చచ్చినంత పనై ఆస్పత్రిలో పడివున్నాడు" అన్నాడు.

నేను వెంటనే బస్సు దిగి వూరేగింపు వైపు వెళ్లాను వెంకన్న వెనకాల వున్న పెద్దలలో బాబాయ్ కనిపించాడు.

"చూశావా రమణా గంగి గోవులాంటి వెంకన్న చచ్చిపోయింది" అంటూ పసిపిల్లవాడిలాగా ఏడ్చేశాడు మిగతా వాళ్ళ సంగతి చెప్పనే అక్కరలేదు.

నాకు నోట మాట రాలేదు. పక్క షాపులో చామంతి పూలదండ ఒకటి కొని, అప్పటికే పూలగుట్టలో కప్పబడి పోయిన వెంకన్న పైన వేశాను. కొంత దూరం వాళ్ళతో వెళ్ళి బాబాయ్ పిలుస్తున్నా వినిపించుకోకుండా, ఇంకోసారి వస్తానని చెప్పి, తిరుపతికి తిరుగు ప్రయాణం సాగించాను. వెంకన్నని గురించి ఆలోచిస్తూ. □

# తొలి సోపానం

## బాలాజీ

| | |
|---|---|
| ఊగే | అలముటించి |
| ఊహల | అలసిపోయి |
| ఊయల | దరిచేరాలని ఆత్రుతపడితే.... |
| ఓ క్షణం | నయన వీక్షణమే |
| నిశ్శబ్దంగా | పరీక్షగా పరిణమించి |
| నిట్టూర్చి | పరాజయమైన |
| నిలకడని ఆశ్రయిస్తే ?!.... | ఆ క్షణం |
| సాగే | జీవిత |
| ఆశల | పరిణమా ప్తికి |
| అలలు | తొలి సోపానం ! |

( గతసంచిక తరువాయి )

## 7

చేతిలో పుస్తకాలు పట్టుకొని చేలగట్టు మీంది బ్యాలెన్సుగా నడుస్తున్నది పుష్ప.

పచ్చని తివాచీ పరచినట్టు చుట్టూ పచ్చగా మిసమిసలాడే చేలు. దూరంగా ఆ చేల సముద్రానికి చెలియలి కట్టలా నిటారుగా నించున్న గుట్ట. గుట్ట పక్కనించి కన్నెపిల్లలా వయ్యారాలు పోతూ గలగల ప్రవహించే సెలయేళ్లు. సెలయేళ్ళమీంచి గిలిగింతలు పెడుతూ వీచే పిల్లతెమ్మెరలు. పల్లెపడుచుల భావాల్లా స్వేచ్ఛగా బారులు తీరి ఎగిరి వస్తున్న కొంగలు.

అంత అందంగావున్న ప్రకృతి దృశ్యం కూడా పుష్ప దృష్టిని ఆకర్షించడం లేదు. కాలేజీ అందదేమో నన్న ఆదుర్దాయే ఆమె మనసుని కలవరపరుస్తున్నది. రోజూ మూడు కిలోమీటర్ల దూరం నడిచి పట్టణంలో వున్న కాలేజీలో చదువుకోడం కష్టంగానే వున్నా - అంతకన్నా గత్యంతరం లేదు పుష్పకు.

పుష్ప పల్లెటూరి అమాయకత్వం మూర్తీభవించిన ముద్దబంతి పువ్వు. సాధారణంగా ఆ యీడు ఆడపిల్లలకుండే పట్టుకుచ్చు కలలు ఆమెకు లేవ్వు. ఖరీదయిన గుడ్డల్లో ఖరీదయిన క్రీముల్లో, ఖరీదయిన అలవాట్లతో వెల్వెట్ బొమ్మలా వుండదు పుష్ప. అభిమానమే ఆభరణంగా – భవిష్యత్తుమీది ఆశే వూపిరిగా బతుకుతున్న సగటు విద్యార్థిని.

మట్టిని నమ్ముకున్న బతుకులు ఆమె తల్లిదండ్రులవి.

రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి వారిది.

కూతురు మీద పెట్టుకున్న ఆశలు ఫలించేందుకు శరీరంలోని ఒక్కొక్క నెత్తురు బొట్టునే చెమట బిందువులుగా మార్చుతున్నారు. కూతురయినా కొడుకయినా పుష్పే అనుకుంటున్నారు. బ్రతుకు భారంలో పుష్ప చదువు అదనపు భారమే అయినా త్వరలోనే తమ బరువు ఆమె మోస్తుందన్న ఆశ వారిలో మినుకు మినుకుమంటున్నది.

బతుకు చిరుగులను 'గుట్టు'తో కప్పుకుంటూ గుండె కోతలకు 'ఆశ' తో వైద్యం చేస్తూ వెలుగును మోసుకొచ్చే రోజుల కోసం ఎంత చీకటినయినా భరించేందుకు సిద్ధంగా వుంది ఆ కుటుంబం.

ఆవరించిన చీకటిలో కన్నవారి కళ్ళకు వెలుగు నిచ్చే చిరు దివ్వెగా నయినా తాను కావాలి అన్నది పుష్ప పట్టుదల. అహర్నిశలు ఆ ధ్యాసతోనే శ్రమిస్తున్నది. ఎన్ని అవాంతరాలడ్డు వచ్చినా దీక్షగా చదువుకుంటున్నది.

లేటవుతుందన్న ఆదుర్దా ఎక్కువవుతున్న కొద్దీ నడక వేగం కూడా హెచ్చింది. ఇంకో నాలుగు ఫర్లాంగులైతే పట్టణం చేరుకుంటుంది. గాలికి చెదిరిపోతున్న కుచ్చెళ్ళు సవరించుకుంది. నుదుట పట్టిన చెమటకు అంటుకుపోయిన ముంగురులను సవరించుకుంటూ యథాలాపంగా వెనక్కి తిరిగి చూసింది పుష్ప.

అంతే. ఆమె గుండె ఆగినంత పనయింది. ఎంతసేపటి నుండి తనను వెంబడిస్తున్నారో ఆ నలుగురు విద్యార్థులు - తాను గమనించనే లేదు. దారిన పోయే దానయ్యలయితే తాను భయపడాల్సింది ఏమీ లేదు. కాని ఆ నలుగురు పేరుమోసిన రౌడీలు. డబ్బు యిచ్చిన హుజంతో కన్నూ మిన్నూ కానకుండా కావరంతో ప్రవర్తించే వెధవలు. అందుకే ఆమె మనసు కీడు శంకించింది. నడక వేగం హెచ్చించింది.

"ఒక లైలా కోసం.... తిరిగాను దేశం...." తన సినీ సంగీత పరిజ్ఞానం ప్రదర్శిస్తున్నాడు ఒకడు.

కాండ్రించి మొహమ్మీద వుమ్మేయాలన్నంత కసిగా వున్నా నిస్సహాయంగా

# సీరియల్




తలొంచుకుని నడుస్తున్నది పుష్ప.

"లైలాను యిక్కడే వుంచుకొని దేశమంతా ఎందుకు తిరిగావురా పిచ్చి మజ్నూ...." గుర్రంలా సకిలించాడొకడు.

"రాణీగారికి కోపం వచ్చినట్టుంది వూర్కోరా" ఎగతాళి చేస్తూ మరొకడు.

"అసలు కోపం రాని ఆడది ఓ ఆడదేనా అంట? కస్సుబుస్సులాడే బాలామణి అంటే నాకు చచ్చేంత యిష్టంరా బ్రదర్."

ధలు

కర్



"మౌనం కూడా ఆడపిల్లలకు అడిషనల్ బ్యూటే నట !"

"ఓయ్ మూగపిల్లా ! నీకు లవ్వాడటం వచ్చా ?"

"ఎవడికైనా లౌలెటర్లు రాశావా ?"

రోషం, ఉక్రోషం, దుఃఖం ఒక్కుమ్మడిగా తన్నుకొస్తున్నాయి. పంటి బిగువు మీద అతికష్టంగా నిగ్రహించుకుంటూ అసహ్యంగా వాళ్ళవేపు చూసింది.

నిర్లక్ష్యంగా - వెకిలిగా - క్రూరంగా తనవేపు చూస్తున్నారు. చదువు సంస్కారం వదిలిపెట్టి కనీసం మనుష్యులమన్న ఇంగిత జ్ఞానం కూడా వదిలిపెట్టి పాటి విద్యార్థినిని గుండెలు తూట్లు పొడిచే మాటలతో వేధిస్తుంటే గుడ్లనీరు కుక్కుకొని మూగజీవంలా నడుస్తున్నది ఆ విద్యార్థిని.

"కంట్రీ బ్రూట్‌కు లౌలెటర్లు కూడానా ?"

"అమ్మమ్మ. అట్లా కొట్టిపారేయకురా ! ఏ పుట్టలో ఏ పాముందో ?"

"పెదవులు విప్పు బేబీ ! మాట్లాడితే నీ నోటి ముత్యాలేం రాలిపోవులే. ముత్యాలన్నీ పరాయివాళ్ళకు దొరికిపోతాయని బెంగా ? అయినా మేం పరాయి వాళ్ళం ఎట్లా అవుతాం ? ఒక్క కాలేజీలో చదివే స్టూడెంట్సుమేగా ?"

"స్టూడెంట్సు మనడానికి సిగ్గులేదూ ? తోటి విద్యార్థినితో ఇట్లాగేనా బిహేవ్ చేసేది...." ధైర్యం కూడగట్టుకొని విరుచుకు పడింది పుష్ప.

"పర్వాలేదు. రౌడీరాణివే నన్నమాట. ఇట్లాంటి శాస్త్రీ అంటే మాకు భలే సరదా. వుయ్ లైక్ యూ వెరీమచ్...."

"షటప్ రాస్కెల్స్........" మొండిధైర్యంతో ఎదురు తిరిగింది పుష్ప.

"వాళ్ళు ముందుకు రావడానికి కొంచెం జంకినా మాటలు బాణాల్లా విడిచి పెడుతూనే వున్నారు.

"దొరసానికి ఇంగ్లీషు కూడా వచ్చే...?

"బాయ్ ఫ్రెండ్సుతో యింగ్లీషు పిక్చర్స్ చూసే హాబీ వుందేమోరా !"

"అంతవరకేనా - క్లబ్బులూ బార్లూ గట్రా సందర్శించే అలవాటుందా....?"

"దాందేముంది. అక్కడికి మనం తీసుకెళ్దాం."

"నీ బాయ్‌ఫ్రెండ్సు లిస్టులో మమ్మల్ని కూడా చేర్చుకో బుల్‌బుల్ ...."

ఒక్కోమాటా పదునైన కత్తిలా గుండెల్ని చీలుస్తూ వుంటే కన్నీళ్ళు తుడుచుకుంటూ మౌనంగా ముందుకు నడవడం తప్ప ఏం చేయలేకపోతున్నది పుష్ప.

అంతకంతకూ పట్టణం సమీపిస్తున్న కొద్దీ ధైర్యాన్ని చిక్కబట్టుకుంటున్నది,

ఇకవాళ్ళు తననేమీ చేయలేరన్న ధైర్యమైతే కలిగింది. కాని సభ్యత, మానవత్వం మరచిపోయి దిగంబరంగా, పైశాచికంగా మాటలతో పెట్టిన హింస ఏ మానభంగానికి తీసిపోతుంది అని పుష్ప లేతమనసు తల్లడిల్లిపోతున్నది.

తమ తల్లి, చెల్లి, అక్క, వదిన... ఒక ఆడదేనన్న విషయం వాళ్ళ అడవి మనస్తత్వానికి తోచడం లేదు. మాటలతో ఆడతనం బట్టలు వొలిచే పైశాచిక మనస్తత్వం ముందు ఒక అబల హృదయం మౌనంగా మూల్గడం తప్ప ఏం చేయగలుగుతుంది? గుండెలు అవిసేట్టు కుళ్ళికుళ్ళి ఏడ్వటంతప్ప ఎలా ఎదిరిస్తుంది ?

నాగరికత ముసుగులో వేధింపు కొందరికి ఫేషన్ అయితే దురదృష్టవంతులకు ప్రాణాంతక మవుతున్నది.

ఈ జనారణ్యంలో ఆడది ఏ మృగం బారి పడకుండా – ఏ వేధింపుకు గురికాకుండా-ఏ మానభంగానికి బలికాకుండా - అర్థరాత్రైనా సరే – ఒంటరిగా ప్రయాణం చేసే రోజులు ఎన్నటికయినా వస్తాయా...?

కాలేజి సమీపిస్తుండగా పుష్పను వదిలి పెట్టి వెళ్ళారు వాళ్లు.

కాలేజిలో కూర్చున్నదన్న మాటేగాని పుష్ప మనసు మనసులో లేదు. వేటగాని బాణం దెబ్బతిని విలవిల కొట్టుకుంటున్న పక్షికి మల్లే వుంది ఆమె మనసు ఆమె సున్నితపు మనసు తంత్రులు తెగిపోయాయి. భయంకరంగా- అనాగరికంగా వీచిన ఆ అసభ్యపు మాటల తుఫానుకు ఆమె లేత హృదయం కూకటి వేళ్ళతో సహా పెళ్ళగించుకుపోయింది.

కాలేజి అయిపోగానే జీవచ్ఛవంలా కాళ్ళీడ్చుకుంటూ తన పల్లె చేరుకుంది.

శూన్యంగా తన మనసులాగే బావురుమంటున్న ఇంట్లోకి వెళ్ళి తలుపు గడియ వేసుకుంది. పొలంనుండి తల్లిదండ్రులు వచ్చేలోపలే అంతా అయిపోవాలను కుంది. నోట్సులోని ఓ కాగితం చింపి తన స్నేహితురాలికి ఓ లేఖరాసి పెట్టింది.

సూర్యుడు అస్తమించాడు.

పొలంనుండి తిరిగొచ్చారు తల్లిదండ్రులు.

తలుపులు గడియ వేసి ఉండటం చూసి 'పుష్పా...పుష్పా' అంటూ గట్టిగా పిలిచారు.

ఎంత గట్టిగా పిలిచినా వినపడనంత దూరంలో వున్న లోకంలోకి వెళ్ళి పోయింది పుష్ప.

బలవంతంగా గడియ విరగ్గొట్టి తలుపులు తెరిచారు. ఎదురుగా భయంక రంగా కనిపిస్తున్న దృశ్యం చూసి బ్రాంతిపడిపోయారు.

తమ ఆశలు, తమ భవిష్యత్తు, తమ సర్వస్వం....... బిగిసిన వురితాడుకు వేళ్ళాడుతుండటం చూచి కుప్పకూలి పోయారు.

ఈడొచ్చినబిడ్డ....చేతికందినబిడ్డ....తమకష్టాలను యీడేర్చనున్న బిడ్డ.... తాము కడుపులో పెట్టుకుని పెంచుకుంటున్న బిడ్డ....తమ కడుపులో చిచ్చుపెట్టి.... ఇట్లా అన్యాయమైపోతుందని కలలో కూడా వూహించలేదు ఆ తల్లిదండ్రులు.

వెక్కి-వెక్కి – కుళ్ళి కుళ్ళి – కుమిలి కుమిలి – కళ్ళు కరగిపోయేలా – గుండెలు పగిలిపోయేలా ఏడుస్తున్నారు వాళ్ళు.

వారి ఏడుపు ఏ పిశాచాలకు వినిపిస్తుంది? వారి శోకానికి ఏ నాగరికత అనకట్టకడుతుంది? వారి దుఃఖాన్ని ఏ చదువులు ఓదార్చుతాయి? వారి బ్రతుకుల్ని ఏ నాగరిక ప్రపంచం నిలుపుతాయి ?

హృదయ విదారకమైన ఆ ఏడ్పు విని యిరుగు పొరుగు వారు గుమి కూడారు.

ప్రక్కనే పడివున్న నోటుబుక్కులోంచి బయటికి కనబడుతున్న కాగితాన్ని అందుకున్నారు ఒకరు.

తన స్నేహితురాలు సుగుణకు రాసిన లేఖ అది.

"సుగుణా !

బ్రతికి వుండగానే ఆడవాళ్ళను పీక్కుతినే మనుషులున్న ఈ ప్రపంచం లోంచి నీ లాంటి మంచివాళ్ళను కూడా వదిలిపెట్టి పోతున్నా. అజ్ఞానపు చీకట్లను పోకార్చే జ్ఞానజ్యోతులు వెలగాల్సిన విద్యాలయాలు క్రూరమృగాలకు ఆలవాలం కావడం– ఈ తరం దురదృష్టం. వేధింపు పేరుతో విద్యార్థులు సాటి విద్యార్థులను ఎంత దారుణంగా హింసించగలరో – ఆ నరకాన్ని ప్రత్యక్షంగా అనుభవించాను. ఇంతకన్నా స్త్రీకి మరో మానభంగమంటూ ప్రత్యేకంగా వుంటుందని నేననుకోను. పచ్చి నెత్తురు తాగే మాటలకు వేధింపు అని పేరుపెట్టి ప్రాణాలు తీసే పైశాచిక ఆటకు నేను పావునయ్యాను. నాలాంటి దుర్భర పరిస్థితి మున్ముందు చదువుకునే ఏ ఆడపిల్లకూ కలగకుండా యీ సభ్య ప్రపంచం చూస్తుందనే ఆశతో అంతిమ శ్వాస వదులుతున్నాను.

నీ దురదృష్ట స్నేహితురాలు
పుష్ప.

ఆ వుత్తరం చదివేసరికి అందరి కళ్ళూ చెమ్మగిల్లాయి.

పోలీసులు వచ్చారు,

దర్యాప్తు చేశారు.

కాలేజిలో ఆడపిల్లలను వేధించే విద్యార్థుల ముఠాసంగతి అందరికీ తెలుసు. రాజకీయపు అండతో – పచ్చనోట్ల దండతో సులువుగా న్యాయం నోరెత్తకుండా చెయ్యగలరు. పైగా వారిని ఎదుర్కొన్నవారికి పుట్టగతులు లేకుండా చెయ్య గలరు.

"రామయ్యా! పోయిన నీ కూతురు ఎలాగూ పోయింది. ఆ నరరూప రాక్ష సులతో తలపడితే నీవూ నీ కుటుంబం నామరూపాలు లేకుండా అయిపోతారు. నీ క్షేమం కోరి చెబుతున్నాం. జరిగింది మరచిపోవడం మంచిది" అని పుష్ప తండ్రికి హితవు చెప్పారు వూరి వాళ్ళు.

తన కూతురు ఎందుకు బలి అయిందో – ఎవరు బలిచేశారో తెలిసికూడా నోరు విప్పలేక పోయాడు రామయ్య.

లోలోన కాల్చుకు తింటున్న వేదనను మౌనంగా భరిస్తూ, పుష్పను పిడి కెడు బూడిదగా చేసి, బూడిదగా మారిన తమ బతుకుల్ని చూసి పిచ్చిగా నవ్వు కుంటున్నాడు రామయ్య.

## 8

ఏక్షణాన్నైనా విరుచుకుపడే పెనుగాలిగా వుంది రేవతి. సుళ్ళుతిరుగుతున్న వుద్రేకానికి బలవంతంగా అడ్డుకట్టలు వేస్తున్నది. ప్రేలుతిన్న అగ్నిపర్వతంలా, దెబ్బ తిన్న ఆడపులిలా ఆవేశంగా అటూ యిటూ తిరుగుతున్నది.

"చూడురవీ ! ఇరవయ్యో శతాబ్దపు నాగరికత, అని రొమ్ము విరుచు కుంటున్న మనం ఏ యుగంలో వున్నామో ...! చీకటి నుండి వెలుగులోకి నడి పించే విద్యాలయాల్లో ఎంత చీకటి పేరుకున్నదో చూడు...." ఆమె అన్న ప్రతి మాటలో ఉద్రేకం కట్టలు తెంచుకుంటున్నది.

రవి మౌనంగా ఆమె వేపు చూశాడు.

పుష్ప జ్ఞాపకాలు పట్టణం గుండెలో మాయని మచ్చగా మిగిలిపోయాయి. హృదయం లేని యినుప భోషాణాల వంటి వారు తప్ప – మనిషన్న ప్రతివాడూ ఆ సంఘటనను తలచుకొని సిగ్గుతో తల వంచుకుంటున్నాడు.

"రవిగారూ ! యీ పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీ కన్నీళ్ళకు మారు పేరుగా మిగిలిపోవలసిందేనా ? ప్రాణాల కంటే విలువైనది శీలం. దాన్ని కోల్పో వడం కంటే ప్రాణాలు కోల్పోవడమే మంచిదని అభిమానమున్న ఏ స్త్రీ అయినా భావిస్తుంది కదా. అత్యాచారానికి గురయ్యే స్త్రీకి అంతకన్నా మంచి మార్గమే ముంటుంది ? కోర్టులకెళ్ళి మిగిలిన పరువుకాస్తా పోగొట్టుకోడం తప్ప సాధించే దేముంది ? ఏ కోర్టులు ఏ చట్టాలు కోల్పోయిన ఆమె శీలాన్ని తిరిగి యివ్వ గలవు ? ఈ అమానుషాగ్నిలో అబలలు నిస్సహాయంగా కాలిపోవలసిందేనా...? దీనికి అంతం లేదా....?" ఆవేదనతో రేవతి గొంతు వణికిపోతున్నది.

"నిజమే రేవతి గారూ ! నేను మీ బాధను అర్థం చేసుకోగలను. మీ అభి ప్రాయంతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. జుగుప్సాకరమైన యీ అత్యాచారాలను మనిషన్న ప్రతివాడూ అసహ్యించుకుంటాడు. ఏ సభ్య సమాజమూ వాటిని సమ ర్థించదు. పురుషునిగా మీ ముందు తలవంచుకుంటున్నాను...."

రేవతిలో రగులుతున్న అగ్నిపర్వతాలను ఏ మంచు కొండలూ చల్లార్చ లేవని రవికి తెలుసు. దోషిలా – మౌనంగా తలవంచుకోవడం తప్ప ఏం చేయ గలడు ?

"రవీ ! పురుషులతో పోల్చిచూస్తే చదువుకునే స్త్రీల నిష్పత్తి చాలా తక్కువ. ఉన్నత విద్యాభ్యాసం చేసే స్త్రీలు మరీతక్కువ. ధైర్యం చేసి చదువు కునే ఆ కొద్దిమంది ఆడపిల్లల్ని కూడా యిలా దారుణంగా వేధించి, పైశాచికంగా

ప్రవర్తించి, అమానుషంగా అవమానించి అమాయకుల జీవితాలతో ఆటాడుకునే యీ రాక్షసపు ఆట కట్టబడే దెప్పుడు? ఇవ్వాళ పుష్ప.... రేపు నేను కావొచ్చు...తర్వాత మరో అమ్మాయి.... ఈ అఘాయిత్యాలకు యిక అంతే లేదా....?" గుండె లోతుల్లోంచి తోసుకొస్తున్న వేదన తాలూకు జీర ఆమె గొంతులో విషాదంగా పలుకుతున్నది.

రేవతి గుండెల్లోంచి పొంగుతున్న లావాను మౌనంగా గమనిస్తున్నాడు రవి. రేవతి ప్రతిమాటా ఆమె వ్యక్తిత్వానికి అద్దం పడుతున్నట్టుగా వుంది. తన దృష్టిలో ఆమె నిరంతరం మండే ఒక జ్ఞాన జ్వాల! ఆ తేజస్సు వేపు తేరిపార చూడటం సామాన్యులకు సాధ్యం కాదనుకుంటాడు రవి తనలో.

"రవీ! ఇది ఏ ఒక్క వ్యక్తికి సంబంధించిన సమస్యా కాదు. యూనియన్లకూ- మతాలకూ- అతీతంగా- మానవత్వం వున్న ప్రతివాడూ ఖండించదగిన సంఘటన. నిమ్మకు నీరెత్తినట్టున్న కాలేజిని సంతాప సూచకంగా మూయించాలి. దౌర్జన్యాన్ని కోటి గొంతులతో నిరసించాలి. దౌర్జన్యం ఎంతటి బలవంతులు చేసినా అది దౌర్జన్యం అని చాటి చెప్పాలి...." సుళ్ళు తిరుగుతున్న ఉద్వేగంతో అన్నది రేవతి.

ఆ మాటలు కేవలం ఉద్రేకంలోంచి పుట్టినవి కావు. వాస్తవాల కొలిమిలో రగులుతున్న నిప్పు కణికలవి. ఇనుప గుండెలను కూడా కరగదీసే శక్తి వాటికున్నది అనుకుంటున్నాడు రవి. అంత వుద్రేక వాతావరణంలో కూడా రేవతి వ్యక్తిత్వాన్ని తనలో మెచ్చుకోకుండా వుండలేక పోయాడు రవి.

"ఒక్క కాలేజీ కాదు పట్టణమంతా బంద్ పాటించేందుకు పిలుపు నిద్దాం ఈ అమానుషాన్ని ముక్తకంఠంతో వ్యతిరేకించుదాం. మన ఆందోళన లోకం దృష్టికి తెద్దాం...." ఆవేశం తననూ ఆవహించగా పెద్దగా అన్నాడు రవి.

"థ్యాంక్యూ రవీ! థ్యాంక్యూ.... మా ఆవేదనను అర్థం చేసుకునే నీలాంటి సహృదయులు కొద్దిమంది వున్నా చాలు మీ సహృదయతే మా వుద్యమానికి కొండంత అండగా భావిస్తాం. రెట్టింపు నైతిక బలంతో ముందడుగు వేస్తాం. స్త్రీ లోకానికి జరిగే అన్యాయాలను అక్రమాలనూ గుండెబలంతో ఎదుర్కొంటాం.." ఆత్మ విశ్వాసంతో అంటున్న రేవతి వేపు చూశాడు రవి. ఆమె కళ్ళలో ఏదో కొత్తకాంతి ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. ఆమె ముఖంలో ఏదో కొత్తవెలుగు అలుముకున్నది.

తన హృదయంలో రేవతి పట్ల అంతకంతకూ గౌరవ భావం పెరిగి పోతున్నది.

మరికొంత మంది విద్యార్థినీ విద్యార్థులతో కలసి కాలేజి మూసివేయ వలసిందిగా ప్రిన్సిపాల్‌ను కోరారు.

సంతాప సభలో పుష్పకు జరిగిన అన్యాయాన్ని ముక్తకంఠంతో గర్హించారు. రౌడీ మూకను తూర్పార బట్టారు.

జయప్రదంగా పట్టణం బంద్ చేయించ గలిగారు.

రేవతి నాయకత్వంలో వూరేగింపు జరిగింది.

నడిపించే శక్తి వుండాలిగాని మంచికోసం కూడా యువతరం ఎంతటి సంఘటిత శక్తిని ప్రదర్శించ గలదో ఈ సంఘటనలు రుజువు చేశాయి.

వరదలా పొంగి పొరలే ఆవేశంతో విద్యార్థులిచ్చిన నినాదాలు వీధి వీధినా ప్రతిధ్వనించాయి. పట్టణం అణువు అణువునూ వుత్తేజ పరచాయి.

విద్యార్థుల నినాదాల ప్రవాహంలో ఎదురులేని రౌడీమూక పునాదులు కొట్టుకు పోతున్నాయి....

(ఇంకా వుంది)

డా॥ ఇంగువ కార్తికేయశర్మ

# భారతీయ శిల్పముల గుహ్యాలు, గణములు వీరశక్తి - ప్రాభవము

పంచ భూతములే సదనములై మానవరూపమును, కొంత వరకు నట్టి ప్రకృతి గల్గిన యక్ష - యక్షిణులు వారి గణములు గుహ్యాలు ప్రాచీన భారతీయ శిల్పమున పలుచోట్ల జుగుప్సాకరముగా చిత్రింపబడియున్నారు. ప్రజల లౌకిక దేవతలుగా యీ గుహ్యాలు - గణములు శిల్పసంస్కృతిలో నొక ప్రత్యేక స్థానమును బొందియుండుటచే పండితులు వీనిని గూర్చి చర్చించి చక్కని గ్రంథముల వ్రాసియున్నారు.[1] ఇందున కొన్ని ప్రాచీన భారతీయ శిల్పమున కానవచ్చు అరుదైన రూపముల పేర్కొని వాని అంతరంగిక శక్తుల - బాహ్య రూపముల, లక్ష్య - లక్షణముల గూర్చి పరిశీలింతును.

యక్షులు ఋగ్వేదమున దేవతలుగా పేర్కొనబడిరి. వారి ఆలయములు, పూజ చేయువారిని గూర్చియు, తెలియుచున్నది. సాయణాచార్యుడు వీరిని పూజనీయులుగా, పుణ్యజనులుగా కూడా పేర్కొనియున్నాడు. ఋక్, అథర్వణ వేదముల వీని పుట్టుక నీటిలోనని తెలుపుచున్నవి. (సలిలస్యపృష్ఠే). ఆనంద కుమార స్వామిగారు[2] యక్షులు బ్రహ్మ సృష్టి యనియు, బ్రహ్మ నీటిలోనుండే ప్రపంచము సృష్టించి యున్నందున, యక్షులను, వారిగణములను కూడా యచ్చటి నుండియే యుద్భవింపజేసెనని పేర్కొనియున్నారు. ఈ యక్షజాతి వరుణునికి కైంకర్యముగా, వీరుగాక అప్సరలు, (అనగా అపః - సరాః), గంధర్వ గణములు, పంచభూతములనుండియే వచ్చినటుల చెప్పియున్నారు. కుబేరుడు యక్షరాజు. అగ్ని యక్షుల కధ్యక్షుడుగా శ్రాద్ధపిండముల స్వీకరించుచున్నట్లు ఋగ్వేదమున చెప్పబడియున్నది. వేదకాలానంతరము ఈ యక్షగణ - గుహ్యాల గూర్చి పలువిధముల శక్తి స్వరూపులుగా, అందమయిన సృష్టిగా, మహామంత్ర - తంత్రజ్ఞానులుగా పేర్కొనబడిరి. మహాభారతమున యక్ష ప్రశ్నలు చాల ప్రసిద్ధము.

భారతీయ శిల్పమున మౌర్య కాలమునుండి యీ యక్ష ప్రతిమలు కానవచ్చుచున్నవి. అంతకుముందున కూడ యుండి యుండవచ్చును. మట్టి - సుధలలో నీ ప్రతిమలు, చిన్నవి లభించినవి. తరువాతి కుషాను చక్రవర్తుల కాలమున బౌద్ధ, జైన, బ్రాహ్మణ మత సాంప్రదాయ శిల్పము లన్నియు విరివిగా కానవచ్చుచున్నవి. ఇవి ముఖ్యముగా బౌద్ధశిల్పములో, స్తూపఫలకములపైని తోరణ - వేదిక స్తంభపు నిలువు కంభములపైని చూపబడియున్నవి. ఐతిహాసిక కాలమున ఈ యక్షగణముల - గుహ్యాలు వైదిక బ్రాహ్మణమత, బౌద్ధ - జైన గాథలందు యవతార పురుషులను కొలుచుచున్నట్లు తమపై మోయుచున్నట్లు లేక భక్తితరమైన సేవా ధర్మములో నిమగ్నులై యున్నట్లు శిల్పింపబడియున్నారు.

## 1. బార్హుత వేదికా శిల్పములు :

కలకత్తాలోని ఇండియన్ మ్యూజియమునే[3] భద్రపర్చబడియున్న బార్హుత వేదికాశిల్పము చాల ప్రసిద్ధమైనది. ఇందున ఊర్ధ్వపటముల నిలువు కంభములపైనున్న యక్షగణములు -గుహ్యాలు కొన్ని యరుదైన శిల్పములున్నవి. ఒక గణము ముఖము, బాహువుల పర్యంతము - వికసిత పద్మఖండికలో చూపబడియున్నాడు. (చిత్రము - 1), ఈతని కర్ణములు నిటారుగ, కుందేలు చెవుల బోలియున్నవి. బరువైన కుండలములు రౌద్రమైన ముఖము, దంష్ట్రములు, మురతలతో ముఖము వికారముగ కానవచ్చుచున్నది. కనుపాపల మధ్యగా పైవరకు లలాటముపై రెండు గీతలతో ఊర్ధ్వ ద్విపుండ్రక చిహ్నము కలదు. పైని బిందువు వలె తల జుట్టునుండి వేలాడుచున్నది. మరియొక గుహ్యాడు కుపిరయక్షుని పై నుంచుకొని మోయుచున్నాడు. వీని స్వరూపము చాల చిత్రమైనది. (చిత్రము - 2) విరూపాక్షుడు. గజకర్ణములు కొట్టవచ్చినట్లు కనుపించుచున్నవి. చక్కగా పాపట తీసి నిరువైపుల దువ్వి పేర్చిన శిరోజములు, విశాలమైన ఫాలమున అడ్డముగా మధ్య భాగమున త్రయాంగుళీయకము, పాపట క్రిందుగ అర్ధచంద్రకళ చాల చక్కగా (చిత్రము - 3) గీచియున్నవి. ఈ రెండుశిల్పములు స్తూప వేదికపై నున్నవి. ఈ రెండు గణములు. క్రీ. పూ. 3వ శతాబ్ది.



బార్హుత వేదికపై పద్మమున గుహ్యుని ముఖము (క్రీ. పూ. 3 వ శతాబ్ది)



బార్హుత వేదిక నిలువు కంభముపై కుబేరుని యక్ష కంప గుహ్యకుడు

(క్రీ.పూ 3 వ శతాబ్ది)

## 2. ధూళికట్ట గణము (చిత్రము - 4)

కరింనగరు జిల్లా, వటకాపురమను చిన్న గ్రామమున ఆంధ్రప్రభుత్వ పురావస్తుశాఖ ఒక పెద్ద యిటుక స్తూపమును బయటకు తీసినది. ఇందున ఆయక పటమునగల నొక శిల్పఫలకము చాల చిత్రమైనది. ఈ ఫలకమున భారావాహకుడుగా నొక గణము చిత్రింపబడియున్నాడు. ఈతడు అర్థపద్మశాఖ యున్న నొక కంభమును పైకెత్తి మోయుచున్నాడు. ఈతని జుట్టు దువ్వెన కొనవలె కత్తిరించియున్నది. నిండైన బుగ్గలు, ఉద్రిక్తతతో బయటికి వచ్చినట్లున్న మిడిగుడ్లు మోటుపెదిమలు, నాభిస్థానము నీ భారావాహకుని కొంత వికృతముగానే చేసిరి. కౌపీనమున్నది. వంగి యున్నందున మోకాళ్ళపై భారము వేసియున్నాడు. పాదములు రెండును, యేనుగు డెక్కలతో లావుగాయున్నవి. చెవులు, పైన చూపిన చిత్రము_1 లోని యక్షగణమును బోలియున్నవి. వన్యమృగమైన కుందేలు చెవులు నిక్కకొని అతిత్వరిత గతిని దూకులతో ముందుకు పోవునట్టిదిగదా ! అట్లే ఈ గణము యొక్క స్వాభావికతను తెల్పుటకు యిట్టి పనులు చేసిరి కాబోలు ? అన్నిందికన్న చిత్రతమమైనది నొసటయున్న, ఊర్ధ్వ త్రిపుండ్రము. ఇట్టి నొసటి అలంకారము వైష్ణవ సాంప్రదాయకులైన, వడకలై శాఖవారు ఫాలమున పెట్టుకొందురు. ఈ శిల్పఖండికపై క్రీ. పూ. 2వ శతాబ్ది శాసనము గలదు. నేనెరిగి భారతీయ శిల్పమున యిట్టి ఊర్ధ్వ త్రిపుండ్రక లక్షణము ఫాలముపై నున్న యక్షుడు లేక గణము మరెక్కడను కానరాలేదు. బార్హుత యక్షునికి (చిత్రము-3) చెవులు గజకర్ణములైన ధూళికట్ట గుహ్యని పాదములు నిశితముగ గజపాదములే. కాని ముఖముపై లాంఛనములు వేరు వేరు శక్తి - ప్రాభవముల సూచించు చున్నవి.

## 3. గుడిమల్లము లింగముపైని గుహ్యస్వరూపము చిత్రము - 5

ఇంచు మించు నిదే కాలమునకు చెందినట్టి పరశురామేశ్వరాలయము, గుడిమల్లము (చిత్తూరు జిల్లా), లోని శివలింగముపై నున్న గుహ్యరూపము.[4] ఇటీవలి త్రవ్వకముల ఫలితముగా నీ గుహ్యని పూర్తి స్వరూపము వెలికి వచ్చెను. బ్రహ్మభాగముపై నున్న నీ గుహ్యడు, మోకాళ్ళపై కూర్చొని యున్నాడు. పూర్ణస్వరూపుడైన రుద్ర యజమానుని (చిత్రము—5) భుజాగ్రముల పైని మోయుచున్నాడు. ఈ దేవయానుడు కేవలము 46 సె. మీ యెత్తు గల్గి యున్న హ్రస్వరూపి. ఈతని శరీరము, పైనున్న భారమువలన, కుడించుకొని యున్నది. పండ్లు గట్టిగా బిగించుట వలన బుగ్గలు పొంగి కనుదోయి వికారముగా ముడుతలు చుట్టుకొన్నది. ధూళికట్ట గణమును బోలిన ఇతని చెవులు కుందేలు చెవులవలె నిటారుగా నున్నను, పత్ర దళములలో వలె గీతలు కనిపించు చున్నవి. చెవులకు, రత్న లేక ముత్యాలు పొదిగిన బరువైన కుండలము లున్నవి. కంఠమున మాలలు మధ్యగా వక్షస్థలముపై రుద్రాక్షల నిరుకడలచే బంధింపబడిన పొడుగైన పూస యున్నది. ఈతని జుట్టు పొట్టిగా కత్తిరించగా దువ్వెన అంచువలె నొసటపై కేశములు చక్కగా కనుపించు చున్నవి. తలపై నుష్ణీషము బదులు రెండు పెద్ద బంతిపూలు కాండములతో సహా ముడిచి యున్నవి. చిత్రాతి చిత్రమైనవీతని పాదములు. భారతీయ శిల్పమున యిట్టి పాద రూపము లున్న గణము కానరాలేదు. ప్రక్కకు ముడుచు కొని యున్న తిమింగిలము లేక పెద్ద సొరచేప (మాతంగ నకర్ర) తోకను బోలియున్నది. జలచర గణముగా చూపుటకు నిట్టి పాదములు తీర్చబడెను కాబోలు. ఈతని నుదుట, కనుబొమల మధ్యగా స్పష్టముగా నొక ఊర్ధ్వపుండ్రకమును తెలుపు గీత కానవచ్చు



బార్హుత యక్షుని మోయుచున్న గుహ్యకుడు (క్రీ. పూ. 3 వ శతాబ్ది)

కాలిరూపము గూడ జలాంతర్గమున నున్న మాతంగ లేక సొరచేపను బోలి యున్నది కదా !

క్రీస్తుశకము నాటికి, చెందిన, మరికొన్ని శిల్పముల నిట్టి గుహ్య గణములను పరిశీలింతును. ఇవన్నియు కుషాను చక్రవర్తుల, ఆ తరువాత గుప్త సామ్రాజ్య కాలమునకు చెందినట్టివి.

మధుర - ఆగ్రా ప్రాంతముల నుండి కుషానుల కాలము నాటి పాత్రాహారక గణ శిల్పములను పేర్కొందును. ఈ గణము కుంభోదరుడు. భద్రాసనమై పెద్ద పాత్రను శిరముపై నెత్తికొని యున్నాడు. ఈ పాత్రను 'అదమన కుంభిగా' శ్రీ వాసుదేవశరణ అగ్రావాలా పండితులు పేర్కొనిరి. కాని ఈ కుంభి అంత లోతు లేదు. పెద్ద పళ్ళెరమువలె నున్నది. కాన స్తూప వేదికా ద్వార ప్రాంగణమున పుష్పములు, గంధము, కుంకుమ, పసుపు లేక విభూదివంటి పూజా ద్రవ్యముల నుంచుటకు వీలుగాను యేర్పాటు చేసి యుండ నగును.

మరొక గణము అఘపూర్ (ఆగ్రా) యనుచోట లభ్యమయినది. యిదే విధముగా అహిచ్ఛత్ర (యు. పి), నుండి కూడ నొక మృత్తికాప్రతిమ లభ్యమయినది. నీతని ఫాలభాగముపై అడ్డముగా త్రయాంగుళిక చిహ్నమున్నది. అనగా క్రీ. శ. 1-2 వ శతాబ్ది నాటికే నీ అడ్డగీతలు ఫాలముపై కుంకుమతోనో లేక విభూతితోనో పూసు కొనుట మతయాచార మయినట్లుగా గమనింప వలసి యున్నది. అల్లాహాబాదు మ్యూజియమున కాల్చిన మట్టి ప్రతిమ, శ్రావస్తి నగరము నుండి లభించి నట్టిది, భద్రపరుపబడి యున్నది. విభూతి గుర్తులు - అనగా త్రయాంగుళీయకము, నొసటన స్పష్టముగా కానవచ్చుచున్నది. ఈ శిల్పము క్రీస్తుశకము 3-4వ శతాబ్దికి చెందినది.

ఈ విధముగా నీ ముఖ చిహ్నముల గణముల లేక గుహ్యరూపముల



ఘూళికట్ట గణము (క్రీ. పూ. 2 వ శతాబ్ది)

చున్నది. ఈ చిహ్నము కూడ, పైని పేర్కొన్న గుహ్య లేక గణములపై నున్న చిహ్నముల నిమిడి యున్న ప్రాభవములను చూపు చిహ్నముగా తీసుకొనవలయును.

పైన పేర్కొన్న నాలుగు స్వరూపములు వివిధ ప్రాంతముల నుండి లభించినను రమారమి ఒకే కాలమునకు చెందినవి మొదటి మూడు గుహ్య లేక గణములు బౌద్ధశిల్పమందు లభించినవి. గుడిమల్లంలోని గుహ్యుడు శైవ లేక రుద్రునితో నున్నాడు. ఇవన్నియు క్రీ. పూ. 3-2వ శతాబ్ది నాటివి. అన్నియును, చాల అరుదైనవి. భారతీయ శిల్పము చిహ్నముల, యేకత్వమును, శక్తి ప్రాభవమును ధాటి చెప్పుచున్న శిల్ప రాజములు.

ధూళికట్ట గుహ్యుడు గజపాదములు గల్గి యుండుటే గాక, తూర్పు ఆయక పటమున చూపబడియున్నాడు. ఇంద్రుని వాహనము గజము. వైదిక దేవత యైన ఇంద్రుడు తూర్పుకధిపతి. ఈ గుహ్యుని యట్లు తూర్పున యుద్దేశించుటలో బహుశ నితడు ఇంద్రుని గణముగా యుద్దేశింపబడి యుండవగును.

కుపిరిక యక్షుని మోయుచున్న గణము యొక్క చెవులు గజము యొక్క చాట చెవులు. ఈ రెండు గణముల నీ విధముగా గజేంద్రుని యంశ చూపబడినది ముఖముపైని నీయబడిన చిహ్నముల బట్టి, ఈ ఐరావత గణము— శివ గణముగా తోచుచున్నది. అట్లగుచో ఊర్ధ్వత్రిపుండ్ర చిహ్నమున్న ధూళికట్ట గుహ్యుని వైష్ణవ గణముగా తీసుకొన వచ్చును. ఏకపుండ్రకము గల గుడిమల్లపు గణము, పాతాళ లోకపు పద్మనాభుని అనగా, వైష్ణవ గణము గానే చెప్పుకొన వచ్చును-



శ్రావస్తి మట్టి బొమ్మ (క్రీ. శ. 3-4 వ శతాబ్ది)





గుడిమల్లము. శివలింగము గుహ్య ప్రతిమ (క్రీ. పూ. 2 వ శతాబ్ది)

ప్రకృతిని, శక్తిని తెలుపు మత లేక శాఖ చిహ్నములుగా నిలిచినవి. ప్రాచీన భారతదేశమున యిట్టి సాంప్రదాయము యెప్పుడు వాడుకలోనికి వచ్చెను.

హరప్పా సంస్కృతి గల్గిన రాజస్థానములోని కాలిబంగయను పురావస్తు స్థలమున, త్రవ్వకములలో నొక మట్టితో చేసిన మానవుని తల లభించినది. ఈ తలనొసట భాగమున మూడు అడ్డగీతలు క్రమముగా గీయబడినవి. స్పష్టముగ త్రయాంగుళీయక చిహ్నములుగా తోచుచున్నవి.

అనగా క్రీ. పూ 2500 సంవత్సరముల క్రిందనే ఈ వైదిక బ్రాహ్మణ యాచారమున్నట్లు, బొట్టుకట్టులలో-విదితమగుచున్నది.

ఈనాడు ఊర్ధ్వపుండ్రకమును, మూడు విధములుగ కుంకుమ, పసుపు లేక తెల్లరంగులలో వైష్ణవులు నొసటన పెట్టుకొనుచున్నారు. శైవులు కుడిచేతి వ్రేళ్ళతో విభూతిని మూడు లేక ఐదు వేళ్ళకు పూసుకొని - త్రయ లేక పంచా కుక బొట్టును ముఖమున, భుజముల - వక్షస్థలమున పెట్టుకొనుచున్నారు.

క్రీ. శ. 10-11వ శతాబ్ది నాటికి ఈ ముఖ చిహ్నములు, బొట్లు, శిల్ప శాస్త్రమునందు, బ్రాహ్మణ మతశాఖలను ఇట్టి వేరువేరుగా నిడుకొను సాంప్రదాయము వచ్చినది. శ్రీ వైష్ణవులలోనే వడగల, మరియు తెంగలై యను శాఖలు ప్రబలెను. ఇక శైవులు, స్మార్తులు కూడ, విభూతి అడ్డ పట్టికలు ముఖమున ధరించుట యాచారమైనది.

ఈ విభూదిని ఒక్క ముఖముపై మాత్రమేగాక పతంజలి కాలమున (క్రీ. పూ॥ 3వ శతాబ్ది) శివభాగవతులు శరీరము నంతటను పూసుకొనుచుండిరట. ఈ విభూతి కేవలము శైవ చిహ్నమే కాదు. ఐశ్వర్య సంపదలకు పవిత్రతకు మారుగా వేదముల పేర్కొనిరి.

క్రీ. శ. 4వశతాబ్ది అమరుడిట్లు చెప్పి యున్నాడు.

విభూదిర్ భూది రైశ్వర్యం అణిమాదికమష్టధా !

అణిమా మహిమాచైవ గరిమా లఘిమాతథా ! !

ప్రాప్తిః ప్రాకామ్య మీ శత్వం వశిత్వం చాష్ట సిద్ధయః !!

అణిమాది అష్ట సిద్ధుల ప్రసాదించు నీ విభూతిని, ఒకటి, రెండు, మూడు, లేక అయిదు వేళ్ళతో అడ్డముగా ఫాలభాగమున అలంకరించుకొను ఆచారము చాల పురాతనమైనదిగా తోచుచున్నది. ఆ చమన పాత్రలు బహుళ బౌద్ధ జైన చైత్యాలయములకూడ నీ విభూతిని వుంచుటకై యుండనగును. మరొక విశేషమేమన యిది వైదికాచారము గాన, బ్రాహ్మణ మతమున, బౌద్ధ జైనములందున కూడ వ్యాప్తిచెందినది. మధ్యయుగమున దేవాలయములందు విభూతి గుండును ప్రాంగణములలోనుంచుట పరిపాటి యైనది.

పైన వివరించిన గుహ్య, గణ శిల్పములు వేరువేరు చిహ్నముల ముఖముపై గల్గియుండుట వలన వీరి మత శాఖ సాంప్రదాయ చిహ్నములు కూడ వేరని గ్రహింపక తప్పదు.

విభూతిని రాచుకొనుట మానవ జీవితమున, ముఖ్యముగా మన భారతావనిలో వేదకాలము నుంచి, వచ్చినట్లు కొన్ని నిదర్శనములున్నవి. మానవ జీవితమున, పశు సంపద, భూ వృక్ష వ్యవసాయము. మున్నగు నట్టివి స్థిరనివాసము లేర్పడిన నాటినుండి జీవితము విధానమయ్యెను. ఇట్టి గ్రామ జీవనమున కృషి వలురు పశువుల పాలించుట, పశువుల పాలు, వెన్న-పేడ. మూత్రములు గూడ పవిత్రములుగా భావింపబడెను. విభూదిని నొసటన పవిత్రముగా, శక్తి స్వరూపముగా నెరిగి నొసటను రుద్దుకొను ఆచారము యీ పశు సంపద యొక్క ఘనతను చూపుటకే ! భారతావనిలో భూ-పశుసంపదలే మానవుని పవిత్ర సంస్కృతికి దోహదములయ్యెను.

## అధోజ్ఞాపికలు


1. ఆనంద కె. కుమారస్వామి, యక్షులు (పునర్ముద్రణ, 1971), 1, పుటలు- చిత్రము - 23, II చిత్రము- 12, నం, 4.
2. "ది యక్ష ఆఫ్ ది వేదాస్ అండ్ వుపనిషద్స్" జర్నల్, ఆఫ్ ది మిథిక్ సొసైటి, సంపుటి. 28, నం, 4 పుటలు. 232- 234, 243.
3. అరవింద ఘోష్, రిమైన్స్ ఆఫ్ బార్హుత్ స్తూప ఇన్ ది ఇండియన్ మ్యూజియం, సంపుటి. 1, (కలకత్తా, 1978) పుట. 70 చిత్రము - 5.
4. బి. కె. శర్మ, ది డెవలప్ మెంటు ఆఫ్ యెర్లీ శైవ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చరు, (న్యూఢిల్లీ, 1982), పుటలు. 56- 62. చిత్రములు 30-31. □

# సంతాప సభ

మూలం: శ్రీమతి నందినీ శతపథి

తెనుగుసేత: బాసంగి శ్రీరాములు

సమావేశ ప్రాంగణంలోపలికి తన నెవరూ గమనించక ముందే విశ్వజిత్ బాబు ప్రవేశించి ఒకమూలనున్న స్థలములో కూర్చున్నాడు. ఆరోజున ఒరిస్సాలో ప్రఖ్యాత కళాకారునిగా పేరుపొందిన స్వర్గీయ శర్మగారికి శ్రద్ధాంజలి ఘటించే కార్యక్రమం జరుగబోతోంది. విశ్వజిత్‌కు శర్మగారితో చాలాకాలంగా సన్నిహిత సంబంధం వుంది. కాల్రకమేణా విశ్వజిత్ తన కళాసృష్టిని జీవనోపాధిగా మలచు కోగలిగాడు. కాని శర్మ జీవితం పూర్తిగా వేరే విధంగా వుండేది. జబ్బుతో మంచం పట్టినప్పుడైనా 'నీవు కొట్టినా సరే, తిట్టినాసరే కళ వలన డబ్బు సంపాదించాలనే కోరికను నేను తలపంచేది లేదు' అనేవాడు శర్మ విశ్వజిత్‌తో.

ఆరోజు విశ్వజిత్ మౌనంగా వుండిపోయాడు. శర్మ విచిత్రమైన, విలక్షణమైనవ్యక్తి. తన మంచంపై పస్తుపడైనా వుంటాడు (ఉపవాసం చేయనైనా చేస్తాడు) గాని, ఇతరులను దేనినీ అడిగేవాడుకాదు. ఎవరికైనా తన కళాఖండమొకటిచ్చేటప్పుడు అతని నుండి బహుమతిగాని—కనీసం ప్రతిఫలంగాని—ఆశించేవాడు కాదు. అకారణంగా పలుమార్లు ఆకలితోనే వుండి, తరచు జబ్బుకు గురిఅవుతూండే వాడు. అప్పుడైనా సరే ఎవరినీ డబ్బు అడగడానికి ఇష్టపడే వాడుకాదు.

"ప్రభుత్వమువారు, కష్టాలలో వున్న కళాకారుల నాదుకొనేందుకు పింఛను మంజూరు చేస్తున్నారని మీకు తెలుసునా, శర్మగారూ" అని ధైర్యం చేసి విశ్వజిత్ ఒకసారి అన్నాడు. "దయచేసి మీరు అరకమైన పింఛనుకు దరఖాస్తు చేయండి. నేను మంత్రిగారితో మాట్లాడి, పింఛను మంజూరు చేయిస్తాను."

శర్మనవ్వేడు. ఆ నవ్వు ఇప్పటికి కూడ తన చెవులలో మారు మ్రోగుతోంది. "నీ దయకు చాలా కృతజ్ఞతలు. నన్ను కళాకారునిగా గుర్తించలేని దేశంలో మంత్రివద్దకు సహాయానికై వెళ్ళడం నాకిష్టంలేదు. నీవు మంత్రితో మాటాడుతావు. కాని నిజంగా కళాకారునికి కళారాధనలో తన జీవితం త్యాగం చేయడం (మరణించడం) చాల మంచిది కాదా ?" అన్నాడు శర్మ.

యదార్థానికి శర్మ ఏ వైద్యచికిత్సగాని, మందులు గాని పొందకనే కన్ను మూసాడు. ఈ రోజు అతనికి శ్రద్ధాంజలి ఘటించే కార్యక్రమం నిర్వహించబడుతోంది. ఆ రోజు శర్మ నవ్విన మాదిరిగానే, ఇప్పుడు విశ్వజిత్ కూడ నవ్వాలను కున్నాడు.

ప్రేక్షకులతో హాలంతా నిండిపోతోంది. వేదికపై శర్మగారి చిత్రపటం చిన్నదొకటి వుంచబడింది. చిత్ర పటానికి పూలదండ వేయబడివుంది. తన కళాఖండాల ద్వారా, దేశకళాభాండాగారాన్ని నింపిన కళాకారుని పెద్ద చిత్రపటమొకటైనా కనుగొనడానికి సాధ్యపడలేదు. హాలంతా నిశ్శబ్దమావరించివుంది. ఏదో విశ్వజిత్‌కు గుర్తు వచ్చింది. సభా ప్రాంగణంలోనికి ముఖ్యమంత్రి ప్రవేశించారు. ఆ నాటి కార్యక్రమానికి ఆయన ముఖ్యఅతిథి.

పెద్దపూలదండ మంత్రిగారి కంఠాన్ని అలంకరించిన తరువాత, ఆయన కూర్చున్నారు. కరతాళ ధ్వనులతో హాలంతా మారుమ్రోగింది. కళాకారుని చిత్రపటం, బహుశ ఇంకా కాంతి విహీనమౌతున్నట్లనిపించింది విశ్వజిత్‌కు.

"హలో" అంటూ ఇంతలో తనను ఎవరో తాకగానే విశ్వజిత్ ఉలిక్కి పడ్డాడు. కొంచెం జరిగి కవిగారికి చోటిస్తూ "కాళాకారుడు శర్మ ఆత్మకు అంజలి ఘటించేందుకు ఈ రోజు ఏర్పాటైన కార్యక్రమంలో పాల్గొనేందుకు మీరు కూడ వచ్చారా ?" అని బాధగా అడిగాడు.

కవి అతని భావాల్ని అర్థం చేసుకున్నాడు. "లేదు, విశ్వజిత్‌బాబు, ఈ అట్టహాసమంతా చూడాలనుకునే నీవంటి మౌనప్రేక్షకుడినే నేనుకూడ" అన్నాడు.



వేదిక వైపు విశ్వజిత్ తన దృష్టిని నిలిపాడు. ప్రొఫెసర్ పాండే ఉపన్యాసం ప్రారంభమైంది— "వ్యక్తిగతంగా శర్మగారితో నాకు పరిచయం లేనప్పటికి, అనేక ప్రదేశాలలో అతని ప్రజ్ఞను గమనించాను. గౌరవనీయులైన ముఖ్యమంత్రి నన్నుపిలిచి, రాష్ట్రములోని కళాకారుల జాబితా తయారు చేయమని కోరినప్పుడు శర్మగారి పేరును కూడ సూచించాను. గతసారి అంతర్రాష్ట్ర సారస్వత సమావేశానికి ఒక వ్యాసం సమర్పించినపుడు శర్మగారి పేరును, ప్రఖ్యాతిపొందిన ఒరిస్సా రాష్ట్ర కళాకారునిగ ఉదహరించాను."

నలభైయైదు నిముషాలపాటు తాను సాధించిన విషయాలను గూర్చి ఉపన్యసించి ప్రొఫెసరు తన కుర్చీలో ఆసీనుడయ్యాడు. సభాధ్యక్షుని ఉపన్యాసానంతరము, ఇతర ప్రముఖుల ఉపన్యాసాలు అదే రీతిలో కొనసాగాయి. కోపంతో వివశుడైన విశ్వజిత్ ఉద్రేకపడ్డాడు. వేదిక నుండి అందరిని ఈడ్చివేయాలనుకున్నాడు. అతి కష్టం మీద తన మనస్సు నిగ్రహించుకొని, "చూసారా ! శర్మగారు జబ్బుతో బాధపడుతున్నపుడు ఒకసారైనా అతనిని చూడని వారు కూడ తమ ఉపన్యాసాలతో శర్మగారితో తమ సాన్నిహిత్యాన్ని గూర్చి ఢంకా బజాయించుకొంటున్నారు" అని కవిగారితో అన్నాడు.

సభాస్థలాన్ని విడిచి పెట్టాలనుకున్నాడు విశ్వజిత్. కవి అతనిని పట్టుకొని కుర్చీపై కూర్చొనేలా చేసాడు "కాస్త ఆగండి, విశ్వజిత్‌బాబు, ముఖ్య అతిధి ప్రసంగం మీరు విననేలేదు. కళకు, కళాకారులకు నిజంగా అతడు చాలా మంచి స్నేహితుడు. శర్మగారిపై అతని మేగజైన్ రేపు ప్రత్యేక సంచికను వెలువరిస్తోంది. దయతో ఆగి అత్యున్నత రాష్ట్ర కళాకారుని ఆత్మకు రాష్ట్రప్రముఖ పౌరుదర్పించే శ్రద్ధాంజలిని గమనించండి" విశ్వజిత్ కూర్చొనక తప్పలేదు.

మంత్రిగారు తన ఉపన్యాసాన్ని ప్రారంభించారు. శర్మగారి మరణానికి తన ప్రగాఢ సంతాపాన్ని తెల్పుతుండగా, అతని గొంతు జీరబోయింది. చేతిరుమాలుతో కళ్ళనద్దుకుంటూ తన ప్రసంగాన్ని కొనసాగించారు— "ఈ ప్రపంచంలో శర్మగారు లేకపోయినా, అతని కళ దేశానికి విలువైన సంపదగ శాశ్వతముగా వుంటుంది. సరియైన ఆహారం, వైద్యసదుపాయం లేక శర్మగారు మరణించారని చాలా మంది ఇప్పుడే చెప్పారు. కళాకారుల విలువను ఈ దేశం గుర్తించకపోవడమే దీనికి కారణం. రాష్ట్రములో చాలా మంది ప్రముఖులున్నప్పటికి, వారు దురదృష్టవశాత్తు, అతని మరణశయ్యకైనా ఏర్పాట్లు చేయ పూనుకోలేదు. బాధలలో వున్న కళాకారులకు, మన ప్రభుత్వం, సహాయ మందించే పథకానికి, ఏర్పాట్లు చేసింది కాని సరైన సమయంలో ఆ శాఖకు ఈ కళాకారుని గూర్చి భోగట్టా తెలియని కారణంగా ఆ పథకం ఇతనికి వర్తింప చేయబడలేదు. భోగట్టా తెలిసినట్లయిన ఆశాఖ ఇతనిని గూర్చి అన్ని వివరములు సేకరించి సహాయానికి ఏర్పాట్లు చేసివుండేది. కాని ఈ కళాకారుని గూర్చి విషయ సేకరణకు సమయం లేకపోయింది.

"అలా అయినప్పటికి, శర్మగారి జ్ఞాపకాలను నిలిపేందుకు ఇప్పుడైనా ప్రయత్నం చేసేందుకు సమయం మించిపోలేదు. ప్రతివారు ఈ ప్రయత్నాన్ని చేయాలి. ఈ దేశంలో కళలయెడ ఎంతో ఉత్సాహాన్ని గమనించాను. ఈ రోజు ప్రారంభించబోయే ఆ స్మారక నిధికి నేను ఏబదిరూపాయలు విరాళాన్ని ప్రకటిస్తున్నాను."

తక్షణమే హాలు ప్రతి మూలనుండి హర్షధ్వానాలు మారుమ్రోగాయి. తరువాత సభాధ్యక్షుడు లేచి తన ఉపన్యాసములో కళాకారునితో, తనకుగల వ్యక్తిగత సంబంధాన్ని గూర్చి వివరించాడు.

విశ్వజిత్, కవిగారితో బయటకు వెళ్ళాడు. చాలా సేపటి వరకు వారిద్దరిలో ఏ ఒక్కరూ ఒక్కమాటైనా మాటాడలేకపోయారు.

"సరే, ఇంతమంది మీవంటి ప్రముఖులుండి, ప్రభుత్వంనుండి శర్మగారికి ఏ యేర్పాటు చేయలేకపోయారా ! కనీసం ఈ విషయం ఒకసారి మీరైనా ముఖ్యమంత్రికి చెప్పివుండవలసింది గదా" అని విశ్వజిత్ కొన్ని క్షణాల తర్వాత అన్నాడు. బరువెక్కిన హృదయంతో కవిగారు ఆ మాటలకు అలవోకగా నవ్వారు. "మంత్రిగారి ఉపన్యాసం మిమ్ములను చాల ప్రభావితులను చేసిందని నమ్ముతున్నాను. కాని ఇదే అతని ప్రత్యేకత. మేమంతా అతనివద్దకు వెళ్ళాము. నాతో పాటు ఇద్దరు సారస్వత ప్రముఖులుకూడా వున్నారు. సుదీర్ఘమైన మూడు గంటల కాలం ఈ మంత్రిగారింటి వద్ద వేచివున్నాము. అప్పటికే మేము వర్షములో బాగా తడిసిపోయాము. అయినా అతని ఎదుటకు వెళ్ళడానికే మాకు అవకాశం దొరకలేదు. ఇంటిలోనుండి ఒక సందేశం మాత్రం మాకు పంపబడింది. "వారి కోరికను పరిశీలిస్తున్నాను. ఇక వారు వెళ్ళవచ్చును."

"మేము కొద్దిసేపు ఒకరి మొఖాలొకరు చూసుకున్నాము. బాధతోను, అవమానంతోను అక్కడనుండి కదిలాము."

విశ్వజిత్ దీనిని విని గాఢంగా నిట్టూర్చాడు. "నిజానికి మంత్రి మొదలు వర్తకుని వరకు గల యీ పెద్దమనుషులు,కళను ఏ విధముగా అర్థము చేసుకొన్నదీ ఎంత చక్కగా ప్రదర్శించారు ! ఈ దేశానికిక నరకమే శరణ్యం"

"అదైనా ఆహ్వానించదగ్గదే" అంటూ ప్రజలగుంపులో కలిసిపోయేరు కవిగారు. □

# నన్నర్థం చేసుకోడానికి ప్రయత్నించు

నేను కవిత్వాన్ని
నన్నర్థం చేసుకోడానికి ప్రయత్నించు
"అయ్యబాబోయ్ కవిత్వమా"?
అని ఆశ్చర్యపోతావేం
ఆమెడ దూరం పారిపోతావేం
ఓరి పిచ్చివాడా!
నీవే గుట్టవద్దకు వెళ్లాలి తప్ప
కవిత్వం నీ పొలిమేరలో అడుగు పెట్టదు
కప్పి పుచ్చేది కవిత్వం మాట నిజం
అర్థం చేసుకోడానికి ప్రయత్నించకపోతే
పెళ్ళాం సైతం ఖాతర్ చేయని మాటనిజం
నిఘంటువుకు అర్థం తెలియక
అది గ్రంథమో, ప్రబంధమో అనుకోవడం నీ వెర్రితనం
పదాల నిచ్చెన్లు ఎక్కలేక ఆకాశమంతా శూన్యమనేది
అబద్ధం
సూదిని పొట్లం కడితే ఉండటం అబద్ధం
కవిత్వం తుప్పు పట్టడం అబద్ధం
కవిత్వానికి మాటలు పదును పెడతాయి
వెంట్రుకల్ని నిమురుతున్న చేతులు పదును పెడతాయి
మహాకవి ఆలోచన పరంపరలు పదును పెడతాయి
నేను కవిత్వాన్ని
నన్నర్థం చేసుకోడానికి ప్రయత్నించు
ప్రయత్నించినా నేను నీకు అర్థం కాను
ఎలా అర్థమవుతాను?
నా వీపు వంతెన చేసుకొని
వాహనము చేసుకొని
అటువైపున్న నాగరిక ప్రపంచాన్ని దర్శిస్తున్నావే తప్ప
నేను నీకు అర్థం కాను
ఎలా అర్థ మవుతాను?
నా కవిత్వపు వంతెనా, వాహనమూ అర్థం కాదు
కనీసం నీవు
అక్షరాభ్యాసం చేస్తున్న చిన్నారి శిశువ్వి కాదు
ఆకలి డొక్క చూయిస్తూ అడుక్కు తింటున్న
అంధ బిచ్చగాడివి కాదు
చిగురిస్తున్న లేత రెమ్మవి కాదు
అన్నీ తెలిసి చదివి మొద్దు బారిన దద్దమ్మవి
నీవు ఏమీ కాని అజ్ఞానివి
అందుకే నీకెలా నేను అర్థమవుతాను
నీకు నీరు అర్థం కాదు
నీరు అర్థం కానప్పుడు
నీటి మధ్యలో పుట్టిన అల ఎలా అర్థమవుతుంది
'అల' విప్పుతున్న పంజా ఎలా అర్థమవుతుంది
విత్తంటే ఏమిటో తెలియని వాడికి
రేపటి ఆశావసంతోదయం గురించి తెలియదు
మంచు తెరల మధ్య సూర్యోదయం తెలియదు
నా మాటలు నెమరు వేయందే
నేను నీకు అర్థం కాను
లబ్‌డబ్ మంటున్న నా గుండె చప్పుళ్ళు వినందే
నాలో ప్రవహిస్తున్న అంతర్‌వాహిని ఎలా వినపడుతుంది
నదిని అర్థం చేసుకోవాలంటే
ముందు నదిలో జలకాలాడు
అప్పుడు నది నిన్నర్థం చేసుకుంటుంది
నీవు నదిని అర్థం చేసుకుంటావు
అన్నా చెల్లెల్లా భావిస్తున్న
ఆనందభైరవి రాగం అర్థమవుతుంది
నన్నర్థం చేసుకోడానికి
నా కళ్ళ సముద్రాల్ని ఒక్కొక్కతే పరీక్షగా చూడు
సుదూరాన దాగి సుళ్లు తిరుగుతున్న
నావలు తేలాడుతుంటాయి
అయినా పిండి తెలియని వాడికి రొట్టెలా అర్థమవుతుంది
అంతరిక్షం తెలియని వాడికి
రాకెట్టులోని రాకేశ్‌శర్మలు ఎలా అర్థమవుతారు
అక్షరాల అల్లిక తెలియనివాడికి
కవితా ప్రపంచం ఎలా అర్థమవుతుంది
నీకు మట్టి అర్థం కాదు
మట్టిలో మొలిచె ఉదయం అర్థంకాదు
ఉదయం నుంచి వెదజల్లే శతసహస్ర కిరణ పుంజాలు
అర్థంకావు
నీ మాట నీకే అర్థం కాదు
నీ మాట నీకే అర్థం కానప్పుడు
మట్టే కవిత్వమని చెప్పిన మాటలు ఎలా అర్థమవుతాయి
నా చూపుతో ముట్టుకున్నదీ
నా చేత్తో ముట్టుకున్నదీ
నా దేహంతో ముట్టుకున్నదీ కవిత్వమే
అన్న కవి మాటలు ఎలా అర్థమవుతాయి
కవిత్వం పుట్టలోని పాము
అది అర్థం కాక పుట్టను చెరిచావో బుసకొడుతుంది
నీవు ప్రయత్నించి పాములవాడి నాదస్వరమై
పాటగా మారితే నీముందు పడగ విప్పి నాట్యం చేస్తుంది
కవిత్వమూ అంతే

శ్రీ కందుకూరి శ్రీరాములు

ప్రథమ చికిత్సతాలుకు వార్త!

# గుండ్రానివీ, పట్టీలూ

## కేవలం బ్యాండ్-ఎయిడ్ మాత్రమే వీలైన యీ ఆకారాల్లో వస్తుంది



గుండ్రటి డ్రెసింగ్,
మరేదీ సరిపడదు దీనికి



చదరపు డ్రెసింగ్,
మరేదీ పట్టుకోదు అలా




**బ్యాండ్-ఎయిడ్**

మరింతగా కాపాడేది, మరింత త్వరగా మాన్పేది.

Johnson & Johnson

శ్రీ కపిలవాయి లింగమూర్తి

# ఒక అముద్రిత నిఘంటువు "దేశ్యాంధ్రనామ సంగ్రహం" కృష్ణయనామధేయ ప్రణీతం

తెలంగాణంలోని ప్రాచీన గ్రామాలలో చారిత్రకావశేషాలకు శాసనాలకు, సాహిత్య సంపదకు కొదువలేదు. అవి మారుమూలలలో ఎక్కడనో నక్కి అపుడపుడు తలసూపుతుంటవి కాబట్టి ఈ ప్రాంతంలోని ప్రాచీన గ్రామాలపై సమగ్రమైన పరిశోధన మవసరం.

తాలూకాల వారిగా వాటిని గుర్తించుకొని ఆయా గ్రామాలపై పరిశీలన జరిపితె ఎన్నెన్నో విశేషాలు బయలు పడుతవి.

ఒకప్పుడు నాకు ఒక గ్రామంలో చెల్లాచెదరైన కొన్ని తాళపత్రాలు లభించినవి. ఇంటికి తెచ్చుకొని వాటిని జాగ్రత్తగా పరిశీలించగా పై నిఘంటువుకు సంబంధించిన మూడుపత్రా లందులో తేలినవి. అవి పుట సంఖ్యవైపు మరియు తక్కిన వైపుగూడా కొంత విరిగినవి కాబట్టి యిది ఎన్ని పుటల గ్రంథమో తెలిసిరాలేదు. పత్రాలకు తక్కిన అంచులు గూడ బాగా చెదపురుగుల వాతబడినవి. కాని అదృష్టవశంగా చివరి పత్రం మిగిలి దానిలో కవిపేరు నిలిచింది. గ్రంథంపేరు "దేశ్యాంధ్రనామ" అన్నంతవరకే మిగిలింది. ఆంధ్రనామసంగ్రహ ప్రసిద్ధిని బట్టి నేనిది దేశ్యాంధ్రనామ సంగ్రహం కావచ్చునని భావించినాను. గద్యను బట్టి ఈ కవి నందవరీకుడు గంగయామాత్య పౌత్రుడు పాపయమంత్రి పుత్రుడని తెలుస్తుంది. గ్రంథం చివర రామార్పణం. కృష్ణార్పణం అని తప్ప వ్రాయసకాడు తేదీ ఏదీ వ్రాసికోలేదు కాబట్టి ఈ కవి యెప్పటివాడో ?

గద్యలో కవి వనజబాంధవ వరప్రసాద లబ్ధ కవితావిశారదుడనని చెప్పుకొన్నాడు. ఈ నిఘంటువు మాత్రం తిరుపతిలో వెలసిన శ్రీ వెంకటేశ్వరునికి అంకితంగా ఉంది. ఇది ఇప్పటివరకు లభించిన నిఘంటువుల్లో క్రొత్తకాబట్టి నాకు లభించిన ఈ పద్యాలు భావి పరిశోధకుల కొఱకు భారతీముఖంగా పాఠకలోకానికి తెలుపుతున్నాను.

సీ॥ ....................దవర్ణ
మానక యనియెడు మాటవర్తిలుచుండు
విడువకయనుటకు విజయవరద.

తే॥ తడసెననునామధేయంబు దనరు నొకట
యవని నాలస్య..............
.... ... ....
.........సెననుట శేషనగేంద్రసదన.

తే॥ ఏవియన పోయెననుట వేరేదియనగ
వవని పోషించియనుట రిచ్చవడియనగ
మాన్పడియటన్న మాటదిమ్మపడి....

..........

క॥ ....... చ్చియనినచో
ప్పుడమిందీయించి యనుట పొంచియనుటకున్
నుడి వానవెప్పియటంచును (?)
కడుబల్కుదురెల్లవారు కనకగిరీశా.

క॥ ఇల్లింగుల..........
తెల్లము పల్లసకట్టన......జెల్లునుహయరత్నములకు
సింహాద్రివరా!

సీ॥ గద్దించెననుటకు గలదావ్వాయంబు...
....మెననా గద్విజరాజమిత్రనేత్ర
పో........
.......రుత్పట్టభద్ర.
చెక్కినయనుటకు జెల్లుతాచినయని
తన్నినయనిపేళ్ల దనుజమథన.
ప్రొద్దువోకనుటకు బొలుపొందునభిదాన
మలవోకనాగ చ.......

................

యనుట కూర్మిమీనరూప.
పరగవెదకి యనుటకరసియ కర్నయను (?)
పలుకులొప్పు శేషపర్వతేశ.

తే॥ ....విలువడనగనొక నామధేయమదరు
లావడంగ...........
..........వరలుచుండు.
చంపెననుటకు వెంకటాచల విహార

తే. చెల్లిపోయె నటంచు పేరుల్లసిల్లు
చిన్నబోయె ననుటకు లక్ష్మినివేశ
ముంచుకా .... .... ....
.... .... .... నేనంచు ధరణి వెంకట గిరీశ

తే. వరుస యనుటకు నోలినా వార్తగలుగు
వియ్య మనకూడి యుండుట తియ్యమనగ
.... .... ....
.... .... ....

## రెండవవైపు

కం. .... .... ....
.... .... ....
.... .... ....
.... ---- .... త్వరిత మంజన గిరీశా.

తే. జ్ఞాపకము దప్పియేమనుటకు సంజ్ఞ వెలయు
నెదమరచి యనాగనుమేళ వినుత
పుడమిలోపల కళవళ పడియెననుట
కు .... .... ...

కం. .... .... .... ననుటకు మహి
నామము నిప్పచ్చరంబు నాగలదెపుడున్
దీమసమనగా ధైర్యము
శ్రీమద్వేంకట నగేశ శ్రితధవకోశా !

కం. త్రెక్కొనియె నాగ నెలకొని
గ్రక్కునయ .... ... ....
.... .... ....
చక్కెరము కాని గన్న స్వర్ణగిరీశా.

కం. అరుపుళ్ళ నాగ పొడిపొడి
దుఃపిల్లియ నాగనొప్పు దుఃఖ పడుటకున్
మరి హోరాహోరియనన్
ధరనెద తెగళము .... .... ...

తే. .... .... .... రంగలించె
తురగలించె ననాగను ధరణిలోన
కసు ప్రకాసించె ననుటకు నదుకకయన
జెల్లు నకుకక యనుటకు శ్రీ గిరీశ

కం. మారిమసంగె నన్నంగా
.... .... ....
రావాపన నౌకటౌకటికి
సారెకు నౌరయికగు గరుడశైల నివాసా.

కం. చుట్టుకొని యనుట పేరగు
గట్టిగగిరికొని యనంగ కడుపెద చెవులన్
బెట్టె .... .... ....
.... .... ....

కం. జడియించె యనుట యగు సం
దడి సెదరం దోలియనుట తబ్బాటనగా
పుడమిని నాకస్మికమగు
నుడుగక నా నెపుడు ననుట యురగ గిరీశా.

కం. .... ... ....
.... .... .... వెతాఖ్య యగున్
గలమ మడిగి సంవెలి తన
తలదడిని యటంచు గరుడ ధరణీ ధరవరా !

సీ. ఎంచనా యనుటకు నెంపనా యనజెల్లు
న్యగమునకు .... .... ....
.... .... ....
ననజెల్లు తూంచనుట కపుడు
జోకు మనం జెల్లు చుంగులు గనిపించ
ననుట రింగులు వారననగ జెల్లు
విపకు సంజాలు నీవిలబలుగు ....
.... ... ....

## ఇంకొకపత్రం

.... .... .... రంజిల్లు పేరు
.... ... ....
తెలియ మిరుమిట్లు గొనెనన దృష్టి జెదర
జేసి చీకట్లు గ్రమ్ముట శ్రీగిరీశ.
కోలు పోయెననంగ బేలు వోయెననుట
కోల్కొనె నన .... ....
.... .... .... కోల్.
త్రెంచెనంచన తల్త్రెంచె ననుట
పీడుకోలనగను విడిచిపెట్టె యనుట
మేలుకోలన నిద్రమాలి యనుట
మహి నియ్యకోలన మతి సమ్మతించుట
........ గటయన వలం దరయనుటగు.

తే. బరువడిని తలకరిచన బండ్లు కొటికి
యన వవ కాపురమనగ నట్టి
కాపురంబని యనుట వెంకట గిరీశ.

ఆ. తట్టు .... .... ....
.... .... .... బరగుపేరు.
బండి కంద్లయందు బట్టించు చమురిర్వి
వెలయుకందె ననగ వృష గిరీశ.

కం. అంకిలిసేసె ననంగని
రంకుశమగ నడుపడియె ననుటకు బేరౌ
కుంక ... .... ....
.... .... వెంకటాద్రి నివేశా !

కం. పెడకట్టె మాటలనగా
పుడమిని విపరీత వచనములకును బేరౌ
తడయనగ నడ్డగింపుట
కడమన్నా మంబు వెంకటాచల రమణా !

తే. అగ ... .... ....
• .... కట్టున కొనరించు సంజ్ఞయమరు
జోమనగ తిమ్మిరియగు కంప్రబామి యనగ
మోసపుచ్చి యనుట శేషభూధరేశ.

క. ధరలో వెడయను నామము.
గిరిగొని ---- .... ....
.... .... కొప్పును
వెరవొప్పన్ సుగుణ భరణ వెంకటరమణా.

కం. కలువయన కలువవిరికిం
గలయంగా ననుట కాఖ్య కడు విలసిల్లున్
నలి యనగ లెస్స యనుటకు
నలి .... ....

కం. ? డియన తాలికి మొక్కకు

నెదపక కదళమున కాఖ్య యెల్లి యనంగా
గొడుగునకున్ రేపనుటకు
పుడమిందగు పేరు శేష భూమి ధరేశా !

కం. కోపన గారాయికి
.... .... ....
.... .... ....
నేపున కేర్లగును వెంకటేశరమేశా !

గీ. గౌరనాగ ఏనుగకుమ–గౌరనాగ
తెలికాఖ్య యగుచునుండునవని లోన
పులుగ నాగపక్షికల రంగ గురుతున
.... .... .... కాహ్వాయంబు నగును,

కం. .... .... ....
.... .... వానికిం బేరొప్పున్.
గిరి యనజిగి బిడుసులకున్
చిరుగందకు పేరుజెల్లు శేషగిరీశా !

తే మెరుకు రెక్కలు నాగను మిన్నుచుక్క-
లకుమ పగడంబులకును నామంబులగును
.... .... ....
.... ...,. దైత్యరాజి విరామా !

తే. అకెయన తోడబుట్టిన యట్టిదాని
కాపెయనుటకు నామధేయంబు జెల్లు
చెట్టయన చెర్దవానికి చేతికాఖ్య
వెలయుచుండును .... ....

తే. .... .... యనుటకు .... ....
సాము గరిడికి జెల్లును సరసిజాక్ష
.... .... రోయునా వెదకుటకును
చెలగు నాహ్వాయ మహిరాజ శిఖరివాస.

క. ఎలుగన భల్లూకము .... ....
.... .... ....
.... ....గట్టి వొలానకు
వెలి చనుకట్టునకు పేరు వృషభ గిరీశా!

కం. ధరలో మేల్లినగా
నురుతరమగుచంద్రశాల కొప్పెదమునకున్
నిరతంబును నామం.

అ. ? ప్పయననుష్ణమున బొంగుపొక్కు-
నకటహాసమునకు నాఖ్యదనరు
కందనగ్ర శిశువుకుందగనల్లని
యంకమునకు బేరు వెంకటేశ !

తే. .... .... .... ....
పుట్టయ.... .... ....లుమూరిక త్తెకగును.
కులిపికట్టెకు చిలుమువాల్ పలుకుజెల్లు.
శరజసరసీత చాంతరస్థిర నివాస.

కం. పూచిన మావులనంగా
సీవపు తెలిమం.... .... ....ముల్
పూచిన మామిళ్ళగు శే
షాచలపర వాస పాలితాఖిలవాసా

కం. పొగాయన హయిశాలకు
పొగాయనతలకు జుట్టు పొగకు బేరా
.... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... ....

తే. .... .... ....రించిన పల్కునకును.
జలదరించి యటంచును బలుక బెల్లు
హొంగినిండిన యందుకు బూరటిల్లె
ననుచు నుడువగ జెల్లు సింహాచలేశ.

సీ ఎత్తైల యనగు యెత్తుగ.... .... ....
పొందుగా ననుటకు.... ....
యమరిదొను గాననీయిచ్చగాననుటకు
నెఱిగి దండమిడి యనుటకు
వెగులుంచినామాలు లుడించెననుటకు
నొప్పు.... .... ....
. . . . . . . . . . . . . . . . . .
.... ... నాగనుదట్టమునకు

తే. నొర్దగిలెనో స-లెనన నొక్క-వార్క్వ
మున కొరగెననుటకివిఘన సమాఖ్య
లతులితంబగు సత్కవి కృతులజెల్లు
సరసగుణ ధామ వృషగిరి సార్వభౌమ

కం. .... .... .... .... ....
.... ....రినమంకలనగగిట్టెన బొట్టిం
చనబాల్యక్రీడాపర
ఘననామ విభేదములగు కనకాద్రివరా!

కం. నికరము నిగరమ్మనుటకు
ప్రకటితముగపేరుదనరు పంటియసాకా
.... .... .... .... .... ....
.... .... ....ద్రి ధామ శొభననామా !

కం. చింగులు వారనంగా
చుంగులు వారంగనునట సూరెలనంగా
సంగతియగు పార్శ్వమ్ముల
కుంగడునామంబు శేషకుధరావాసా!

తే. .... ....భువనేశ.
నందజన మిత్ర తేవయన సొగసనుట
తీవియన రాజసంబగు దేవదేవ
తవరయన దిట్ట యగు వెంకటగిరివాస.

కం. ఎంచగవార్చవ యునుదే
.... .... .... .... .... ....
.... ....నుడుగచ్చట వాన
రించియనా భుజగవరగిరి ప్రవరేశా !

ఆ. ఉప్పతించెనమగ నొగి దృష్టిదాంకను
తించెననుట పేరు దివిజవినుత

# అన్నీ కాలిపోవలసిందేనా ?

డా॥ సి. వి. కొండయ్య

వరద వెల్లువ
ఆనకట్ట దగ్గరే ఆగిపోయింది.
కొందరి మూగ బాధ
కన్నీటి చాటునే ఆగి పోతోంది.
జారిన ప్రతిబిందువులో కొంత బాధ
పేర్చిన చితిలో — మిగిలిన బాధ
మంది పోవటంలోనే మనిషి (నగటు) జీవితం
బూడిదకు స్వాగతం పలుకుతోంది
ఇది చూసి బిగిసిన పిడికిళ్ళు
జేబుల్లో దాక్కుంటున్నాయి.
అనుబంధాల సుమ-మాల
తెగిపోయిన క్షణం నుండి
అద్దంలో నా ప్రతిబింబం
నాకే కొత్తగా వుంది
గులాబైనా, చామంతయినా
వసంతమైనా, శిశిరమైనా
అడివిలో రగుల్కొన్న యీ దావాగ్నిలో
అన్నీ కాలిపోవలసిందే.
చిటు-పటుమని ఎగిరే నిప్పు రవ్వల్లో
నీవెన్నో నావెన్నో ఎవరు చెబుతారు?
ఈ మంటల్ని ఎవరు రగిలించారో
ఎవరు చూశారూ?

# ఎడారి భూమి !

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

కన్నీటి బిందువులు
ఆణిముత్యాలు గానే
మిలమిల లాడుతుంటాయి
పసితనంలో
"అది పచ్చికమైదానం" !
సారమైన వలపు పంటలు
పండుతుంటాయి
పరువంలో
అది
'డెల్టాప్రాంతం' !
గడచిన జీవితంలోని
అనుభవాలు
ఒక్కొక్కటి ఖర్జూరపు చెట్లలాగా-దొడ దొడా
తియ్యటి తేనెల్ని -
కార్చుతుంటాయి
ముసలితనంలో :
అది
"ఎడారిభూమి" !

---

తండ్రి యనగ నుదుట.... .... ....

తే. .... ....జల్లాణ దనగను తారుమారు
గబ్బియన కొట్టియనుట నంకిత పదంబు
పల్లటిలెనన చింతచే బరగెనసుట
చారుతర హాస వెంకటాచలనివాస.

సే. అవని జోహారు జోహారు నాగనువేడి
కోళ్ళనా మరియు గొబ్బిళ్లనాగ
నల్లానేరేళ్ల జాటిల్లాయనగ డెంక
రాలనగాను జో.... ... ....

.... .... .... .... ....

.... ....నాల్గడిగిళ్ళ.నంగ విదియ
నొక్కటసతుంకు నొప్పుచునుండును
భాసిల్లు దేవతాభజనపట్ల

తే. సకలసురవర మస్తక ప్రకటమకుట
ఘటితనవ.... .... ....
.... .... ....దసౌందర్య విజిత
శతరతీశ్వర వెంకటాచలవిహార.

గద్య - ఇది శ్రీమన్నందవరవంశ పావన వనజ బాంధవ వరప్రసాద లబ్ధ సరసకవితా.... .... గంగయామాత్య పౌత్ర పాపయమంత్రి పుత్ర సకల సుకవిజన విధేయ కృష్ణయ నామధేయ ప్రణీతంబైన దేశ్యాంధ్రనామ.... .... ....

శ్రీకృష్ణార్పణ మస్తు — శ్రీరామార్పణమస్తు
యాదృశం పుస్తకం దృష్ట్వా తాదృశం లిఖితం మయా
అబద్ధం వా సుబద్ధంవా మమదోషో నవిద్యతే.

శ్రీ బి. ఎన్. శాస్త్రి

# సదర్ షాపూర్ శిలా శాసనము

## శాసనము:

నల్లగొండ మండలములోని మోత్కూరు తాలూకా కేంద్రమునకు 15 కిలో మీటర్ల దూరమున సదర్ షాపూర్ గ్రామమున్నది. ఈ గ్రామ మతి ప్రాచీనమైనది. 'పత్తెపాడు' ఈ గ్రామమునకు పూర్వముపేరు. గ్రామమునందు, మూసీ నదికి ఉపనదియగు బిక్కేరు ప్రవహించుచున్నది. బిక్కేరు తీరమునందున్న సోమేశ్వరాలయ ముఖమండపము నానుకొనియున్న స్తంభముపై నాలుగువైపుల తెలుగు భాషలోనున్న రెండు శాసనములు చెక్కబడియున్నవి.

నల్లగొండ-తొరూరు రోడ్డుపై, కంచెనపల్లి స్టేజి కభిముఖముగా సదర్ షాపూర్ గ్రామము చేరుటకు మూడు కిలోమీటర్ల సమితిరోడ్డు వేయబడినది.

సోమేశ్వరాలయమున్న ప్రాంతమున శిథిలమైన ఆలయములున్నవి. నంది విగ్రహములు. వీరభద్రుని విగ్రహములు, నాగులు చెక్కబడిన శిలలు, పార్వతీ దేవి విగ్రహము, దేవాలయమునకు చేరువలో గ్రామమునందీయున్న ఆలయమున గల అమ్మవారి విగ్రహము, ప్రాచీనవైభవమును చాటుటకు నిలిచియున్నవి.

సోమేశ్వరాలయ ముఖద్వారము తూర్పుదిశలో నున్నది. ఆలయ శిఖరము శిథిలమైనది. విశాలమైన మండపము, గర్భగుడి, అంతరాళమండపము, చూచుట కందముగ నున్నవి. ఆలయమునకు దక్షిణదిశలో రెండంతస్తుల మండపమున్నది. ఆలయమునగల శివలింగము భిన్నమైనది. గ్రామీణులు మట్టితోచేసిన శివపార్వతుల మూర్తులను పూజించుచున్నారు. శివరాత్రి పర్వదినములందచట ఉత్సవములను నిర్వహింతురు. మోత్కూరు తాలూకాలో కాకతి రాజన్యులకు సంబంధించిన శాసనములున్నవి. అందు దుప్పల్లి కూరెళ్ళ, సదర్ షాపూర్ గ్రామములందున్న శాసనములు, కాకతిరుద్రదేవ, ప్రతాపరుద్రులను పేర్కొనుచున్నవి. మోత్కూరు గ్రామమందున్న శివాలయము కాకతి సామంతులచే నిర్మింపబడినది. ఈ ఆలయము ముందుగల ద్వారతోరణము ఓరుగల్లు కోటలోని స్వయంభూ సోమేశ్వరాలయము నాలుగువైపులనున్న ద్వారతోరణములవలె చక్కని శిల్పసంపదతో నొప్పారుచున్నది. మోత్కూరు, సదర్ షాపూర్ దేవాలయముల ప్రాకారములు, బంటకుడ్యములు కలవి.

మోత్కూరు తాలూకాలో చారిత్రక ప్రసిద్ధిగన్న ప్రదేశములున్నవి. జానకీపురము, పొడిచేడు ప్రాంతములందు నవీన శిలాయుగపు సమాధులున్న శ్మశానవాటికలున్నవి. గోలకొండరాజ్య పతనానంతరము, మొగలు చక్రవర్తియగు ఔరంగజేబు ప్రతినిధుల పాలనాకాలమున విజృంభించి దేశము నల్లకల్లోల పఱచిన సర్వాయి పాపన్నకోట మోత్కూరు తాలూకాలోనున్న వేములకొండ గుట్టలపై నిర్మింపబడినది. ఇతని రెండవ దుర్గము జనగామ తాలూకాలోని ఖిలాషాపురములో నున్నది.

## ఆకారాదికములు:

ఈ శాసనము నల్లరాతి స్తంభముపై, నాలుగువైపుల చెక్కబడినది. శాసనశిల పొడవు 110 సెం. మీ. వెడల్పు 35 సెం. మీ. శాసనశిఖరము ఎత్తు 15 సెం. మీ.

శాసనశిల మొదటిప్రక్క ఆవు, లేగ, బాకు, డాలు చిహ్నములును, రెండవప్రక్క సూర్యచంద్రుల చిహ్నములును, మూడు, నాలుగువైపుల పానవట్టముతోగూడిన శివలింగములను చెక్కబడినవి.

మొదటి శాసనము శాసనశిల మూడువైపుల చెక్కబడియున్నది. ఈ శాసనమును కాకతి రుద్రమదేవి గజసాహిణియు, మహాప్రధానియునగు పొంనయ ప్రెగ్గడ అధికారి వేయించెను. రెండవ శాసనము వెలుంగొండ కేతయ వేయించినట్టిది.

శాసనము మొదటిప్రక్క 23, రెండవప్రక్క 18, మూడవప్రక్క 25 నాలుగవప్రక్క 17 మొత్తము 83 పంక్తులలోనున్నది.

## లిపి:

ఆంధ్రదేశమున 13వ శతాబ్ది ఉత్తరార్థమున వాడుకలోనున్న తెలుగులిపి ఈ శాసనమున వాడబడినది. శాసనాక్షరములు గుండ్రముగాను, పొంకముగాను, చక్కని వరుసలలో చెక్కబడినవి. కాకతీయుల కాలమున తెలుగులిపి ప్రత్యేకతను సంతరించుకొనినది. ముఖ్యముగా కాకతి గణపతిదేవ చక్రవర్తి, మహారాణి రుద్రమదేవి కాలమున, తెలుగు-కన్నడ లిపి విడిపోయినది. నల్లగొండ మండలములోని బొల్లేపల్లి గ్రామమునగల మైలారు దేవాలయ ఆవరణములోనున్న రెండు తెలుగు శాసనముల [1] పరిశీలనమువలన తెలుగులిపి కాకతీయుల కాలమున ప్రత్యేక స్థానమును పొందినట్లు తెలియుచున్నది.

బొల్లేపల్లిలోని మొదటి శాసనము చాళుక్య ప్రతాపచక్రవర్తి రెండవ జగదేకమల్లుని కాలమునాటిది, క్రీ. శ. 1146లో వేయింపబడినది. శాసన మిచ్చినవాడు కొల్లిపాక ప్రభువగు మేడెయభట్టు. ఈ శాసనలిపి తెలుగు-కన్నడ లిపి.

రెండవ శాసనము కాకతి రుద్రమదేవి పాలించునాటిది, తేరాల ఏడిండ్ల రెడ్లు వేయించిన ఈ శాసనకాలము క్రీ. శ. 1267. ఇందలి లిపి తెలుగులిపి, నేడు మనము వాడు తెలుగులిపి కత్యంత సన్నిహితమైనది. ఈ రెండు శాసనముల నడిమికాలము 120 సంవత్సరములు.

సదర్ షాపూర్ శాసనాక్షరములు బొల్లేపల్లి రెండవ శాసనము,[2] దుప్పల్లి[3], కందుకూరు[4], మేళ్ళచెరువు[5], కూరెళ్ళ[6], శాసనాక్షరములను పోలియున్నవి.

## భాష:

ఈ శాసన శిలపై చెక్కబడిన రెండు శాసనములు తెలుగు భాషలో వేయబడినవి. ఇందు 'ఱ' రకార పొల్లు, రకార పొల్లునకు పూర్వాక్షరము ద్విత్వముగను, పూర్ణానుస్వారము, ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు, సరళ, పరుషము లొకదానికొకటి, శ బదులుగ వాడబడినవి. శాసనమున

| | | |
|---|---|---|
| పురవరాధీశ్వర - | బదులు - | పురవరాధీస్వర |
| చేయగా | " | సేయంగా, |
| సేయించినవాండ్లు | " | సేఱంపినవాండ్లు |
| పిన్నపడిశాల | " | పిన్నపడి సేల, |
| ఈ ధర్మము | " | ఇదమ్మఱాము. |
| చెఱిపినాను | " | సెఱ్ఱినాను. |
| కార్తికశుద్ధ | " | కాత్తిఁకశుద్ధ |
| సర్వమాన్యము. | " | సవ్వఁమాన్యము |

ఆదులున్నవి. పిన్నపడిశాల నేడు భిన్న పడిశాలగా వ్యవహరింప బడుచున్నది. పరెపాడు గ్రామము పరియ పాడుగా, పత్తెపాడుగా మార్పు చెందినది. అచ్చ తెనుగు పదము లీ శాసన మందంతట కనిపించు చున్నవి.

## శాసన విషయములు:

సదర్ షాపూర్ శిలాస్తంభముపై గల రెండు శాసనములలో, మొదటి

శాసనము, కాకతిరుద్రమదేవి, గణసాహిణి, మహా ప్రధానియనగు పొంనయ ప్రెగ్గడ, పరెపాడి సోమనాథ దేవరకు, ప్రజాపతి సంవత్సర పుష్య బహుళ శనివారము మకర సంక్రమణ పుణ్యకాలమున భూమి దానమిచ్చు సందర్భమున వేయించినట్టిది. ఈ శాసనమున కాకతి రుద్రమదేవి "మహా మండలేశ్వర, అనుమకొండ పురవరాధీశ్వర, కటక చూఱకాఱ, శరణా గత వజ్ర పంజర, స్వయంభూదేవర దివ్య శ్రీ పాదపద్మా రాధక నామాది, సమస్త ప్రశస్తి సహితులైన కాకతీయ్య రుద్రమహారాజులని" వర్ణింప బడినది.

మహా ప్రధాని పొంనయ ప్రెగ్గడ పరెపాడి సోమయ దేవునకు, కొండ మడుగు, మేడికుంటి, పిన్నపడిశాల గ్రామములందలి కుంటల, చెఱువుల వెనుక భూములను, భీమయ పరెపాడి ఊరి ప్రజల దేవర అంగ భోగానకు దానమిచ్చిన విషయమును శాసన మందున్నది.

రెండవ శాసనమున శకవర్షము పేర్కొనబడలేదు. నందన సంవత్సర కార్తికశుద్ధ పౌర్ణమి గురువారమునాడు సోమేశ్వరదేవుని అంగరంగ భోగములకు, వెలుగొండ కేతయ, ఏటి యొడ్డున, 7000 కాటి వనము పెట్టించి, దేవరకు దీపము నిలిపి, గుడి తూర్పున భూమిని దానమిచ్చినట్లును, పరెపాడి మహాజనాలు దేవరకు మడిమాన్యము లొసంగినట్లును, శాసనమందున్నది, ఈ శాసనము శాసన శిల నాలుగవ ప్రక్కన 17 పంక్తులలో నున్నది.

## కాలనిర్ణయం :

ఈ శాసనమును శక వరుషములు 1173 ప్రజాపతి సంవత్సర పుష్య బహుళ వడ్డివారము మహా సంక్రాంతి పర్వదినమున, కాకతి రుద్రమదేవి. పృథ్వీరాజ్యము చేయుచుండ, గణసాహిణి, మహా ప్రధాని పొంనయ ప్రెగ్గడ వేయించెను. గణపతి దేవ చక్రవర్తికి జాయప సేనాని బావమఱది. అతడు కాకతీయుల గజసాహిణి. మహా ప్రధాని పొంనయ ప్రెగ్గడ కాకతి రుద్రమ కాలమున గజసాహిణిగ నుండెనని ఈ శాసనము వలన తెలియుచున్నది. గజసాహిణి రాజధానీ నగరమందుండ వలెను. మోటుపల్లి (?) ప్రాంతీయుడగు పొంనయ ప్రెగ్గడ, పరెపాడి సోమనాథునకు భూమి దానమిచ్చుట వలన ఈ సోమనాథాలయ మాకాలమున ప్రసిద్ధి వహించి యుండెనని భావింప వచ్చును. ఇతడు చరిత్రకు క్రొత్తవాడు. పొంనయ ప్రెగ్గడను పేర్కొను తొలి శాసనమిది. శాసనమున పేర్కొనబడిన వడ్డవారమును శనివార మందురు. శక సంవత్సరము 1173. క్రి. శ. 1251 కి సమానము.

కాకతి గణపతి దేవ చక్రవర్తి క్రి. శ. 1269 వరకు జీవించి యున్నట్లు కాయస్థవంశీయుడగు జన్నిగ దేవుని దుర్గి శాసనము వలన తెలియుచున్నది. గణపతి దేవుడు వృద్ధుడైనందువలన, రుద్రమదేవి క్రి. శ. 1251 నాటికే రాజ్యభారము వహించి పాలించు చుండెనని ఈ శాసనము తెలుపు చున్నది. కాకతి రుద్రమ పరిపాలనా కాలము క్రి. శ. 1251 - 1289.

రెండవ శాసనము నందన సంవత్సర కార్తీక శుద్ధపౌర్ణమి గురువారమునాడు వేయించి నట్టిది. శాసన మిచ్చినవాడు వెలుంగొండ కేతయ. మొదటి శాసనము వేయింపబడిన 22 సంవత్సరములకి శాసనమివ్వబడినది. కేతన శాసన కాలము క్రి. శ. 1273.

## సదర్ షాపూర్ శిలాశాసనము

### శాసనము - మూలము

#### మొదటి ప్రక్క

1. స్వస్తిశ్రీ జయాభ్యుద
2. యశక వరుషములు 1173
3. యగు ప్రజాపతి సంవత్సర పుష్య
4. బహుళ వడవారము నాండు



శిథిల సోమనాథ దేవాలయము
రెండంతస్తుల మండపము

5. మహామండలేస్వర అన్మకొం
6. డ పురవరాధీస్వర కటకచూ
7. ఱకాఱ శరణాగత వజ్ర
8. పంజర స్వయంభు దేవర ది
9. వ్య శ్రీ పాద పద్మారాధక పర
10. బల సాధక నామాది సమ
11. స్త ప్రశస్తి సహితులైన కాక
12. తీయ్య రుద్రమహారాజులు
13. ప్రిధ్వీ రాజ్యము సేయంగా
14. గజసాహిణి మహాప్రధా
15. ని పొంనయ్యపెగడ అధి
16. కారి పరెపాడిసోమనా.
17. థ దేవరకు సంక్రమణ
18. కాలమప్పు(డు) భరిసాలడి
19. ప మరియగు దెతోర
20. ణము మడవు నిల
21. న్నయ సేఱంపినవా
22. ండ్లు పరాయమణ
23. పగరం పాటి వరం—

#### రెండవ ప్రక్క

1. సోమయ దేవుని వ్రిత్తి
2. కాల్వను దేవర గుడికడను
3. మం॥ మోగవాడ అర్థ॥
4. మేడికుంటను మ ∩ . మల్లో
5. జుకుంటను అడ॥ ఏటిలోదా
6. రిమం, కొంద మండిగణి
7. పతిద వెండు వాయుపోయ
8. అర్థ। పిన్నపడిసేల పె
9. ద్ద చెరువు వెన్క రూపోడి
10. పెట్టేడి అర్థ మేడికుం
11. ట వెన్క శ్రీరామునిదేవ
12. య ఇచ్చినది అర్థముప్పది.
13. కరణము పెద్ద పళ్యము ఆ

## సవర్‌షాపూర్ శిలాశాసనము



మొదటి ప్రక్క [23 పంక్తులు]



మూడవ ప్రక్క [25 పంక్తులు]



రెండవ ప్రక్క [18 పంక్తులు]



నాలుగవ ప్రక్క [17 పంక్తులు]

14. ద్ధన్న పడిగరమూకిత శైగణ
15. నర్ధము అబడిగంట్లు దీప్ప
16. కంబాలు చందనపు మా
17. ట్ట స్పిల్మిసకమరముకర
18. న తవెదు.

### మూడవ ప్రక్క

1. ఠిమయాను అయా.
2. రివారు జాతుల ప్రజ
3. ను. దేవర అంగభోగాన
4. కు ఇచ్చిన ఉమూరాచం
5. ం మాడ పెట్టెడివారు దే.
6. వరకు అఖు మాసాలు
7. పెట్టెడిది. ఇసమయా
8. నకుందప్పిన వారు క
9. ము-ఇరువ ఒక్కొబడా
10. ధ్ధాను నరకానంబడిన వా
11. రు. ఊరి వెలపలు సిద్ధా
12. యములోనిది అని కొన__
13. దు సుంకిటిరమగసుంక
14. ములోని దని కొనరేదు
15. ఇధమ్మ ణము ఎవ్వరు సెఱ్ఱిం
16. వానుగంగ కఱుత క వెం
17. ల బొడ్చిన పాపానం బొ
18. ందు బారు॥ స్వద త్తం పరద
19. త్తం వాయోహరేతివసు
20. ంధరాం ! షష్ఠివరుషస
21. హస్రాణి ! విష్ఠాయాం.
22. జాయతే క్రిమి॥ దేవర
23. భోగానకు _ _ మన
24. పాల 1 పెదలకుంపుంటి దేను॥
25. — — — —

### నాలుగవ ప్రక్క

1. నందన సంవత్సర కార్తిక
2. శశుద్ధ 16 గురువారమూ
3. నాండు శోమయదేవుని
4. అంగరంగభోగా నకు పె
5. టాం గొండ కేతయ పెట్టం
6. చ్చిన పేటిమదతాడివనము
7. 7000 గుడి తూప్పుణ చేను.
8. 11 వల్ను దేవుని దీపనుం
9. చెను॥ ఊరచంతములు
10. దాన్యము ఎవ్వరు పెట్టినా
11. మాడ అడ్డెండు పెట్టేది.
12. వర్ధ వార పరియపాటి మ
13. హాజనాలు యధమని లనమ
14. గాజనకు తములాండి పన్నుమ
15. న్నము కాండులు అ
16. మడిసవ్వణమాన్య
17. ము —

### అధోజ్ఞాపికలు

1. శాసన సం॥ పుటలు - 196-207; 238 - 243;
2. శాసన సంపుటి — పుటలు. 238 - 248
3. " 251 - 267
4. " 258 - 264
5. హైదరాబాద్ ఆర్కియో లాజికల్ సిరీస్ నం. 19. పేజీలు 90-92
6. అప్రకటితము.

# అలనాటి అల

ఒక గాలి లేచింది
ఒక ధూళి రేగింది
ఒక మేఘ శకలమ్ము
పకపకా నవ్వింది.

ఆ గాలి సుడి దిరిగి
ఆకాశ పథమంటె
ఆ ధూళి పైకెగసి
ఆంధ్యమంతట క్రమ్మె

ఆ మబ్బు విగ్రబాకి
అటువైపు పడగెత్తి
ఇటువైపు పురివిప్పి
ఇంతలో గహనమ్మై
దిగ్దంతి సితదంత
దీధితులు కోల్పోవ
కాలాశ్వనిచయమ్ము
కట్టుదప్పినయట్లు
గండుతుమ్మెదగుంపు
కలగబారినయట్లు
కాటుకల కొండలను
గోటమీటినయట్లు
నీలకాదంబినీ
హేలావినోదమై
గగనసీమంతినీ
ఘనవేణి ముడివీడె

కరుగబోసిన వెండి
వరదపారినయట్లు
జలతారు పోగులతో
జాల మల్లినయట్లు
సానపట్టిన కత్తి
సాముతిప్పినయట్లు
శివజటా జూటాన
శిఖయొకటి తెగినట్లు
కోటి సూర్యులకాంతి
గుప్పిటను చేర్చుకొని
ఆకాశరంగాన
ఆడె మెరువుల కన్నె

నడుము పిడికిట నిముడు
నడుచు గజ్జలు కట్టి
తకథిమిత తకథిమిత
తక మృదంగ ధ్వనుల
మెలమెల్ల లయపెంచి
మెరుపుకన్నెను మించి
నిండు టాకాశమ్ము
రెండుగా ఖండించి
ఫెళఫెళలు వినిపించి
ప్రళయ ఘోషలువెట్టి
ఉరుములన్నీ ఉరిమి
కురిసినవి పిడుగులై

అప్పుడంభోధిలో
హల్లీసకమ్మాడు
చిరుతరగ లొకసారి
నురగతో తలలెత్తి
కాలిమువ్వలు మ్రోగ
గాలితో పైకెగసి
ముందుముందుకుదూకి
పుడమిమీదికి ప్రాకి
పరవశమ్మును పొంది
పరవళ్ళు తొక్కినవి.

తాళాలు మ్రోయించి
తప్పెటలు వాయించి
ఘూర్ణ కుంభమ్ముతో
పూనకములో నూగి
దయ్యమో దేవతో
కయ్యమాడినయట్లు
ఊర్మికాసందోహ
మున్మత్తమై పోయె

తాను చెలియలికట్ట
దాటిపోవునె జలధి?
తనకున్న మరియాద
తప్పినడచునె అబ్ధి?
తన గౌరవమ్మంత
ధారపోయునె ఉదధి?
తాను ధరణిని క్రమ్మ
ధైర్యమెక్కడిదంచు
తలపోసి రాజనులు
తాత్పర్యహీనులై.

తన నీటిగుణమ్ము, శి
తలమంచు తెలిసినా,
తన మనసు లోతులే
తన లోతులను మించ
కంటి కగపడకుండ
కడుపు లోననుదాచి
భుగభుగలతో నీరు
సెగలు కక్కగ నుమిసి
కమఠ మీనోరగ
గ్రాహభీకరమైన
క్షుభిత పారావార
ఘూర్ణ ప్రచండమే
ప్రళయ విస్ఫూర్జథువు
ప్రభవించె బడబాగ్ని!

చీకట్లలో కనులు
చెదరగొట్టెడి వెలుగు
చూచినంతనె జనులు
చిత్తవిభ్రమమంద.

ఆస్ఫాల వేలాంత
మాభీల సర్వాంగ
మాక్రోధ తామ్రాక్ష
మా మహాజలరాశి.
సారించి బాహువులు
పూరించి శంఖాలు
యుద్ధ సన్నద్ధయై
ఉరికినది శివమెత్తి.

తాళప్రమాణమ్ము
దాటిపోయిన ఎత్తు
యోజనమ్ములతీర
మార్చిపెట్టెడి పొడవు
రాకాసి బలగమ్ము
ఏకమై గుమిగూడి
తాకునట్టి బలమ్ము
తనకున్నదని తనిసి

లోకాలు లయమొందు
చీకటులు కమ్ముకొన
ఆదిశేషువు లేచి
పడగలన్నీ విప్పి
పగబట్టి బుసకొట్టి
నాల్కలన్నీ చాపి
నాట్యమాడినయట్లు
కనురెప్పపాటులో
కదిలి ముందుకుసాగి

ఊళ్ళుపూళ్ళు ఊడ్చి
పొలముప్రటా ముంచి
చేయవలసినదంత
చేసినది త్రుటిలోన

గూడుపోయిన పిట్ట
కూసినది మింటనే;
కూడుకొరకై వెదుకు
పాడియావింకేది?
పంటపండే పొలము
కంటనే పడదాయె!

అలనాటి అలతీరు
కలగానె నిలిచింది
తెలుగింటి సిరులన్ని
వెలుగారిపోయినవి.

— శ్రీ ఘండికోట బ్రహ్మాజీరావు

ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తి

# ప్రబంధరత్నాకరము చతుర్థాశ్వాసము ప్రత్యంతర విశేషములు

పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము అవతారిక యందు విషయ సూచిక కలదు.[1] అందు 'నారాయణస్తుతి' మొదలు 'గజాశ్వపదాతివర్గవిలసితంబు' వఱకు ప్రథమాశ్వాసము. 'నాయకోత్కర్షము' మొదలు 'సాముద్రికంబు' వఱకు ద్వితీయాశ్వాసము. 'రాజనీతి' మొదలు 'ప్రభాతరాగోదయంబు' వఱకు తృతీయాశ్వాసము. ఇంతవఱకు మాత్రమే తాళపత్రగ్రంథము, తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునందు కలదు. తంజావూరి ప్రతియే మానవల్లి రామకృష్ణకవి గారికి అంతస్థితార్థపేటి. అదియే వేటూరి ప్రభాకరశాస్త్రి గారికిని అలంబనయష్టి. 'ప్రభాత రాగోదయంబు' తర్వాత మధ్యాహ్నసూర్యవిడంబంబు' మొదలు నవరసోత్పత్తి, వఱకు రెండు ఆశ్వాసములు కావచ్చును. అందు 'మధ్యాహ్నసూర్యవిడంబంబు' మొదలు 'వ్రతమాహాత్మ్యంబు' వఱకు ప్రబంధరత్నాకరము ప్రత్యంతరమునందు కలదు. అది ఇంచుమించు చతుర్థాశ్వాసము. ఒకచో గ్రంథపాతము కలదు. ఆశ్వాసాంతము లేదు. అయినను లబ్ధాలబ్ధ, ముద్రితాముద్రిత గ్రంథములలోని పద్యరత్నములు అనేకము కలవు. మూడు ఆశ్వాసము లందును మూదలించిన పూర్వ గ్రంథముల పునరావృత్తియే గాక, నూతన గ్రంథముల శ్రుతసంపత్తియును కలదు.

## వాచవ సోమనాథుని

## మత్తలీలా విలాసము

వాచవ సోమనాథుడు ఉత్తరహరివంశము రచించినట్లు ప్రసిద్ధము. వసంత విలాసము , హరివిలాసము రచించినట్లు లాక్షణికోదాహృతులు కలవు.[2] అంతే కాదు. మత్తలీలావిలాసము రచించినట్లు ప్రబంధరత్నాకరము ప్రత్యంతరమునందు కలదు.

వసంతర్తువు

నాచిరాజు సోమయ దత్తలీలావిలానము

> సుకృతము కాఁబోఁగాక చెలి జూదరిపట్టు మదాళి మాలికా
> చికురభరంబు జీర్ణదళ చేలములం గుదియంపఁ ద్రెవ్వనే
> సకలవనావస్థిదుపదజాత జనార్దనుభంగిఁ జూడఁడే
> యకట వసంతుఁడీ కిసలయాంశుకసంహతి పెద్దసేయుటన్"

ఇందు దత్తలీలావిలాసము అని కలదుగాని,. అది మత్తలీలావిలాసము అగును. ఇట్టి లేఖకప్యత్యయములు బహుళము. ఈ పద్యమునందే 'చికురభరంబు' అనునెడ 'చికురవలంబు' అని, 'త్రెవ్వనే' అనునెడ 'పైంపునే'అని, 'సకలవనావనీ' అనునెడ 'సకలవనావసీ' అని, 'కిసలయాంశుక' అనునెడ 'కిసలయాసుత' అని లేఖక దోషములు కలవు. కనుక గ్రంథనామము మత్తలీలావిలాసము కావలయును. మహేంద్రవర్మ మత్తలీలావిలాసము ప్రసిద్ధమైన ప్రహసనము.నామసాదృశ్యముతో పాటు గ్రంథసాదృశ్యమును కలదేమో !

## అజ్ఞాతకవి

## వేంకట విలాసము

ప్రబంధరత్నాకరము ప్రత్యంతరమునందు ఇట్లు కలదు.

"వసంతర్తువు

వేంకట విలానము

> చాతుర్యంబెసఁగన్ హిమాహ్వయ దశాస్యధ్వంసియై తెచ్చె వి
> ఖ్యాతిం బంకజలక్ష్మి సీతబలె దానారామనామస్థితిన్,
> జేతోజాతవిభీషణున్ నిలుపఁజేసెన్ జేసి యిట్లేల కో
> జాతిద్వేషముపూనె రామసమతన్ జైత్రుండు పెంపొందియున్"

ఇందు కర్తపేరు లేదు. ఇతరత్ర వేంకటవిలాసము ప్రసక్తి కానరాదు. పద్యము హృద్యము. రామాశబ్దము యొక్క తత్సమరూపము, ఆరామ శబ్దములోని రామనామము ఆధారముగ- రామాయణపరముగ, రామామణిపరముగ చమత్కారకల్పనము కలదు. రామనామస్థితిని చైత్రుడు మంచు అనెడి రావణాసురుని చంపి, పంకజలక్ష్మి అను సీతను తీసికొని వచ్చెనట ! అంతేకాదు. మన్మథుడు అను విభీషణునికి పట్టాభిషేకము చేసెనట ! అయినను రామసమతను అభివృద్ధి చెందినను(రామునియెడ) జాతిద్వేషము పూనెనట ! రామ అన స్త్రీ. వసంతర్తువు విరహోద్దీపకము కద.

## బొడ్డపాటి కొండయ / పేరయ

## రాజశేఖర విజయము

బొడ్డపాటి కొండయ తిరుకాళహస్తి లింగశతకము; బొడ్డపాటి పేరయ మల్లికార్జునలింగశతకము, సూర్యశతకము, అనంతమహత్త్వము, మంగళగిరి విలాసము, పద్మినీవల్లభము, శంకరవిజయము రచించినట్లు పెదపాటి జగన్నాథ కవి ప్రబంధరత్నాకరము నందు కలదు. అంతేకాదు. ప్రత్యంతరమునందు ఇట్లు కలదు –

"వనవిహారము

బొడ్డపాటి రాజశేఖర విజయము

> కరపదాధరకాంతి గప్పినచో లెల్ల
> పువ్వులఁ జిగురులు పోలికలుగ
> నళికపోలస్థలముఖరోచులించుచోఁ
> బరలఁ దుమ్మెదలనును విరులుఁగాఁగ
> కజ్జలాంతకటాక్షకచరుచుల్ పొలయుచోఁ
> దలిరులు విరులును నళులుగాగ
> కక్షవక్షోజాంగకచ్ఛవి సోఁకిన

నన్నియు గోరింటలగుచు మెఱయ
వెఱగుపడి నవ్వు నవ్వుచో వింతరీతి
నిల్చియును గుసుమంబులే నివ్వటిల్లఁ
దన తనూవిభ్రమములని తలఁపకొకతె
గుఱుతు లరయుచు నొకభంగిఁ గొనియె విరులు"

ఇందు కవిపేరు లేకపోయినను ఇంటిపేరు కలదు. కనుక రాజశేఖర విజయకర్త బొడ్డపాటి కొండయ గాని, బొడ్డపాటి పేరయ గాని కావలయును. పేరయ బహుగ్రంథకర్త. అతని కృతులందు శంకరవిజయము కలదు. ఇది రాజశేఖర విజయము. రాజశేఖరు దన శంకరుడు. అయినను శంకర విజయము రాజశేఖర విజయము కాఁజాలదు. ఇది ఏ రాజశేఖరుని విజయమో, మాదయగారి మల్లన రాజశేఖరచరిత్ర వంటిది కావచ్చును.

తిక్కన విరాటపర్వములోని 'పదతలంబుల కెంపు' (808 ప., 1 ఆ.) అను పద్యమునకు రాజశేఖర విజయములోని పద్యము అనుకరణము. కుమార సంభవములోని అనుకరణము[3] కంటె సరసము.

## ప్రెగడపల్లి పోతయ గోదావరీ శతకము

ప్రెగడపల్లి పోతయ రచించిన గోదావరీ శతకమును ఆంధ్రసాహిత్య జగత్తునకు ప్రథమతః పరిచయము చేసినవారు మానవల్లి రామకృష్ణకవి గారు.[4] వారికి ఆధారము తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని ఛందము లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారము అను ఒక అముద్రిత లక్షణ గ్రంథము. అందు ప్రెగడపల్లి పోతయ గోదావరీ శతకములోని పద్యములు రెండు కలవు. రెండును సహజసుందరములు. ఒక పద్యమునకు కుమారసంభవమునందు అనుకరణము కలదు అది కృతకము.[5] రెండవ పద్యము ప్రబంధరత్నాకరము చతుర్థాశ్వాసమునందు కలదు.

"నదీవర్ణనము
ప్రెగడపల్లి పోతరాజు

ద్విరదాకారత నెంచి సంతమసరీతిం బర్వి మేఘాకృతిన్
బిఱపై శైలధృతిన్ దనర్చిన మహాపాపౌఘముం గిట్టి కే
సరిమాడ్కిన్ రవిభాతి గాడ్పుగతి పక్షస్ఫూర్తి దారించు వే
హరియించున్ విహరించుఁ ద్రుంచు భవదుద్యద్వారి గోదావరీ"

ఒక తెలుగునదిని - అంతేకాదు - దాక్షిణాత్యనదిని అధికరించి వ్రాసిన శతకము బహుశః గోదావరీ శతకమే అగును. విషయగౌరవముచేతను, విధాన వైభవము చేతను విశిష్టమైన గోదావరీశతకము శతకవాఙ్మయ పరిశోధకులకును గోచరము కాకపోవుట దురదృష్టము.

## శరభాంకుని శరభాంకలింగ శతకము

గణపవరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరమునందు 'నవశపుల శతకము' అను ఆకరముతో 'శరభాంకలింగమా' అను మకుటముతో, నాలుగైదు పద్యములు కలవు. అదే మకుటముతో, అట్టిదే మఱొక పద్యము శరభాంకుడు కర్తగ ప్రబంధరత్నాకరమునందు కలదు.

"పుణ్యక్షేత్రములు
శరభాంకుఁడు

శకలమునందె (మౌనిసతి) జారసహోదరుఁ జూడఁగల్గె నే
చికి వెదనాండు శ్రీగిరిపతిన్ దరిశింపఁగఁ గోర్కి లేక కా
శికిఁ జనెఁబూఁ పచంద్రునికిఁ జిచ్చరకంటికిఁ జిత్తజన్మ భూ
తికిఁ బదలేదె నీటికిఁ దుదిన్నిటువంటిది యారవల్ గడిం
చుకొనినఁ జొచ్చుచెట్టులు విశుద్ధులె శ్రీ శరభాంకలింగమా"

ఇది పంచపాది. అంతేకాదు. వ్రాతప్రతి యందు బహు దోషబంధురము 'శకలము' అనునెడ 'సకులము' అని, 'శ్రీగిరిపతిన్' అనునెడ 'శ్రీగిరివతిన్' అని, 'కాశికి' అనునెడ 'క్రాశికి' అని 'చనె' అనునెడ 'చని' అని 'అరపల్' అనుచోట 'యారముల్' అని కలదు.

ఇవి నాలుగు నూతన గ్రంథములు. ఇక పునరావృత్తమైన పూర్వ గ్రంథములు !

## చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము

చిమ్మపూడి అమరేశ్వరుడు 'పేరెన్నికఁగన్న' కవి అని అనంతామాత్యుని భోజరాజీయము నందు కలదు. ఎంతపేరు ఎన్నికఁగన్నను అమరేశ్వరుని విక్రమసేనము అనుపలబ్ధము. కాని చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేన పద్యములు ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు ఏడు, ద్వితీయాశ్వాసమునందు అయిదు కలవు. అందు ప్రథమాశ్వాసములోని రెండు పద్యములు ప్రబంధరత్నావళి యందు అనుసంధింపబడలేదు. ప్రామాదికము కావచ్చును. ఆ పద్యము లివి :

"సరస్వతీ స్తుతి
చిమ్మపూడి అమరేశ్వరుడు_విక్రమసేనము

చదువుచున్న వే చిలుకబాయ నురస్స్థలరాగదీధితుల్
పొదవిన సాంధ్యరాగరుచిఁబొందిన[?]యిందుని కాంతిఁబోలు సొం
పెద యలరంగఁజొచ్చి సుఖియించు శుకాంచితపాణి వాణి మ
ద్వదనకుశేశయానన నివాసినియై విలసించుచుండెడున్"

"కవిత్వలక్షణము
చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము

చవియన వేగయానకరసంజ్ఞరసంబు లెఱింగి పానముల్
చివిఁగామమాడ్కిఁ గావ్యమును జయ్యన మేలని పోక కట్టముల్
చెవి ధరియించి యీ రసవిశేషములెల్ల నెఱింగి మెచ్చు స
త్కవి విని మెచ్చఁజేయునది కావ్యముగాఁ గవియైన వానికిన్"

ఇందు 'వేగయాన' అనునది 'వేదయాగ' అనుదానికి లేఖకదోషము కావలయును. ఇవిగాక ప్రబంధరత్నాకరము చతుర్థాశ్వాసమునందు చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేన పద్యములు ఇంకను మూడు కలవు.

"వర్షర్తువు
చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము

అంబుదంబులు రత్నాకరంబు నీరు
దలఁచి పద్మరాగములతోఁ దలముఁదప్పఁ
ద్రావి దక్కింపఁజాలక ధరణిమీఁద
గ్రక్కినోయన సురగోపకములు వొలిచె

శిశిరర్తువు
చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము

ద్యుమణికినైన జక్కవ లెదుర్పఁగ దుస్తరమైనయట్టి శీ

తమునఁ బ్రియంబుపాటిన సుధాకరమౌళికి ఫాలదేశ నే
త్రమున వెలుంగుమంటల కతంబున నీరసపోయెఁగాక ని
క్కమునకు నంగమోచి మనఁగావశమే మదినెంత గూర్చినన్. 2

వేట వర్ణన
చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము

ఇది నెలలోనున్న యిట్టినైనను దాల్చు
నట్టి నేర్పున బాజిఁబట్టు దేవ
బట్టనై [గై?] చిన మట్టి బలువున నిది దివిఁ
బాజి చంపును సాళువంబు దేవ
యిది వాజి విచ్చినయది సన్నకౌనొంది
యెలయించుఁ గక్కెరపులుగు దేవ

యిల నిది తూమెడు తలలకుఁ బొరగాని
నిజగరి ( ? ) యైన కైరవము దేవ
దేవ దేవ నీకుఁ దెచ్చితి నని చెప్పి
యిచ్చి నిలిచి మ్రొక్కి యెదురనున్న
మృగమునకు సమస్త మేదినీపతి దన
యంగపూజ యొసఁ...... .......న" 3

ఇవిగాక చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేన పద్యములు ఇతోధికముగ ఉదాహరణ పద్యములు అను సంకలన గ్రంథమునందు, లక్షణగ్రంథములందును కలవు.

ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతిలోని చిమ్మపూడి అమరేశ్వరుని పద్యములకు కలదు[6] గాని, ప్రత్యంతరములోని చిమ్మపూడి అమరేశ్వరుని పద్యములకు, కుమారసంభవమునందు అనుకరణము లేదు. ఇది గమనార్హము.

## పెదపాటి సోమయ
## అరుణాచల పురాణము

పెదపాటి సోమయ అరుణాచల పురాణములోని పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు తొమ్మిది కలవు. అందు సంస్కృతకవి స్తుతి అనంతరము కల తెలుగుకవుల స్తుతి. 'ప్రతిభావిజృంభిత అను పద్యము కూడ ఆకరము లేకపోయినను ప్రకరణమునుబట్టి అరుణాచల పురాణములోని పద్యము కావచ్చును. అయిన, ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసములోని పది పద్యములు, తృతీయాశ్వాసములోని ఒక పద్యము కాక, చతుర్థాశ్వాసము నందు అరుణాచల పురాణములోని పద్యములు మూడు, నాలుగు కలవు.

"సూర్యోదయము
పెదపాటి సోమయ అరుణాచలపురాణము

వివిధ సదాచారవిదులు వీడ్వడకుండఁ
గౌశలి కాలముఁదెల్పు గురుఁడనంగఁ
జక్రవాకాహ్వయశకునిదంపతులకు
విరహానలము మాన్పు వెజ్జయనఁగ
మంజులనక్షత్రమండలనికరంబు
పాలిటి నిశ్వాసపవన మనఁగ
నాకాంగనలమీఁద నరుణితన రజంబు
కడిగి జల్లు వసంతకాండ మనఁగఁ
బుట్టదమ్ముల పాలిటి చుట్టమనఁగఁ
గప్పుఁజీఁకటి మూకల విప్పనంగ
సకలలోకములకు ముఖ్యనేత్రమనఁగ
సూర్యుఁడుదయించెఁ బరిరక్షితార్యుఁడగుచు

గ్రీష్మర్తువు
కవిలోకబ్రహ్మయ అరుణాచలపురాణము

గహ్వరస్థలమెల్ల గాడి నెరెలువాఱి
యురగలోకమునకుఁ దెరువులయ్యె
జలమెల్ల నుడుకెత్తి జలచరంబులు మ్రగ్గి
వారిపైఁ బొట్టలు వాచి తేలె
మృగతృష్ణ నీళ్ళని మృగసంఘ మెదురేఁగి
నాగిలి నడ్డెసలకు నోళ్లు దెఱచె
నాకాశచరకోటి యాతపంబునఁ గ్రాఁగి
నింగి సల్పఁగలేక నేలఁగూలె
నింకి నదనదీకూపంబు లెండెఁ జెలువు
లుండలేరైరి నరులెల్ల నుబ్బచేతఁ
గుంది పథికులు మ్రాఁకులక్రిందఁబడిరి
కడు భయంబున పీవరి ( ? ) గాడ్పులెసఁగ 2

మృదునయనాగ్నిఁ గ్రోలి హరు మేచక కంఠముమీఁద వ్రాలి య
జ్జలనిధిబాడబానలము చక్కడిఁ దేలి దవప్రభూతముల్
తడఁబడి తోలి తేలి బెడిదంబగు వేడిమితోడ వచ్చె న
ప్పుడమదిగాలి లోకముల ప్రాణులజాలి నిదాఘవేళలన్ 3

పుణ్యక్షేత్రములు
కవిలోకబ్రహ్మ అరుణాచలపురాణము

అలఘుతరాపవర్గము సమంచితశంకరతీర్థరాశిలో
పల నధికంబు కాశి యది ప్రాణులఁ జంపక యీదుముక్తి యే
యలజడిఁ బెట్టకిచ్చు నరుణాచల మించుక యాత్మ (లోపలన్)
దలఁచిన మోక్షలక్ష్మి యిఁక దానికి సాటి (యె య) న్యతీర్థముల్"4

ఇందు మూడవపద్యమునకు ఆకరములేదు. అరుణాచలపురాణములోని పద్యము కావచ్చును. కాకపోవచ్చును. అందు 'దవప్రభూతముల్' అనుచోట 'దవిప్రభూతముల్' అని కలదు. అనవబోధము.

## పెదపాటి సోమయ
## కేదారఖండము

పెదపాటి సోమయ కేదారఖండములోని పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు ఒక పద్యము, ద్వితీయాశ్వాసమునందు ఒక పద్యము కలవు. ప్రథమాశ్వాసములోని 'పదలాలిత్యము' అను పద్యమునకు ఆకరము లేదు. కేదారఖండములోని పద్యము కావచ్చును. కాక పోవచ్చును. ఆ పద్యమునకు అనంతరము ప్రబంధరత్నాకరమునందు క్రింది పద్యము కలదు.

సౌరభ్యంబున బంధురాతురగతిన్ శయ్యాచమత్కార శృం
గారంబున్ వివిధార్థముల్ సరససాంగత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభవమున్ బాంధారీతిం దగన్
వారస్త్రీయనుబోలె నొప్ప వలదా వర్ణింపఁ గావ్యంబులన్.

ఇదికూడ ఆకరములేని పద్యము. కేదారఖండములోని పద్యము కావచ్చును. కాకపోవచ్చును. పెదపాటి సోమయ కేదారఖండములోని పద్యములు ప్రబంధ

రత్నాకరము ప్రథమ ద్వితీయాశ్వాసము లందు మాత్రమే గాక చతుర్థాశ్వాసము నందును మఱొక పద్యము కలదు.

నదీవర్ణనము

పెదపాటి సోమయ గారి కేదారఖండము

భవ్యులకును మోక్షభవనంబు భువనంబు
కపటాత్ములకు గుచ్చు గసికె యసికి
తత్‌జ్ఞులకును గల్పతరువులు నురువులు
ఖలులకుఁ జొరరాని గడ్డ సుడ్డ
ధీరులఁ గడతేర్చు తెప్పలు తిప్పలు
పాపకర్ముల కతిభయము లయము
సభ్యుల కాధారసారంబు తీరంబు
మలినాత్ములకు మహామాయ ఛాయ

యనఁగఁ బొలుగియుఁ దనవారి యందమొంద
సాధువులనైన నత్యంతశఠులనైన
పరమపుణ్యులఁగాఁ జేయఁబొలుగినట్టి
హరశిరస్సంగ యదియహో [యమలగంగ]"

ఇది, అవిగాక ఇంకను పెదపాటి సోమయ అరుణాచలపురాణములోని, కేదారఖండములోని పద్యములు ఉదాహరణపద్యములు అను సంకలన గ్రంథము నందు కలవు.

## భావన పెమ్మన
## అనిరుద్ధచరిత

భావన పెమ్మన అనిరుద్ధచరితలోని పద్యములు ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు రెండు, ద్వితీయాశ్వాసమునందు రెండు, తృతీయాశ్వాసము నందు రెండు కలవు. అవిగాక ద్వితీయాశ్వాసములోని 'ధూర్జటి కోపాగ్ని' అను పద్యమునకు ఆకరము లేదు. అది భావన పెమ్మన అనిరుద్ధచరితలోని పద్యము కావచ్చును. కాకపోవచ్చును. ఈ ఏడు పద్యములను ప్రబంధరత్నావళియందు కలవు. ప్రథమాశ్వాసములోని 'చెలువములొప్ప' అను పద్యమునకు అనంతరమునందు కల ఆకరములేని క్రింది పద్యమును భావన పెమ్మన అనిరుద్ధచరితలోనిది కావచ్చును.

కలమవనప్రతానములు గాచుటకై చనుదెంచి యింపులన్
జిలిబిలి మంజురీతి విలసిల్లఁగ నార్చుచు ముద్దుటల్కలన్
జిలుకలఁదోలి లేఁజెమరుఁజెందఁగొలంకులకేఁగి చిల్కలన్
జిలుకల నాడుచుండుదురు చెన్నుగఁ బామరబాలికాజనుల్

ఇది ప్రబంధరత్నావళి యందు లేదు. ఇవిగాక భావన పెమ్మన అనిరుద్ధ చరితలోని పద్యములు ప్రబంధరత్నాకరము చతుర్థాశ్వాసమునందు రెండు కలవు.

"వర్షర్తువు

భావన పెమ్మన గారి అనిరుద్ధచరిత

ఉల్లాసనర్తనోత్ఫుల్లవిభుక్షేత్ర
బర్హాతపత్రతవిభాతి మెఱయ
శంపాలతాజాలసంపాదితోన్మీల
దాలోలనీరాజనాంశు లుదర
శాతమన్యవచాపజాతశోభాయత్న
బహురత్నతోరణప్రభలు నెఱయ
జటిలీకృతాభోగపటలీసముత్తుంగ
మాతంగఘనఘటామహిమ దనర

గ్రీష్మశాత్రవుఁ డేతయుఁ గ్రిందుపడఁగ
జటుల గర్జాభయానకస్వనము లెసఁగఁ
జారుసలిలవిధాభిషేచనము లొదవఁ
బ్రావృడాగమ-రాజన్యపట్ట మమరె

మరాళదంపతులు

భావన పెమ్మన అనిరుద్ధచరిత

లలితమృణాళముల్ సెలవులన్ రసముట్టఁగ రెండొకంటికిన్
బొలయఁగ నిచ్చుచుం దరఁగయూయెల లూఁగుచు సైకతస్థలం
బుల విహరించుచున్ దొగలపొంతల నాడుచుఁ జారులీలలన్
గొలకులనెల్ల భోగములఁగూడి చరించు మరాళదంపతుల్"

ఇందు మరాళ వర్ణన సరళము. వర్షర్తువర్ణనము ప్రౌఢము. ఇవి పది పద్యములు కాక, భావన పెమ్మన అనిరుద్ధచరిత లోని పద్యములు ఉదాహరణ పద్యములు అను సంకలన గ్రంథమునందు ఇంకను ఏబదినాల్గు పద్యములు కలవు. మొత్తము అరువది నాలుగు. అరువదినాలుగు పద్యము లందును సారళ్యముకంటె ప్రౌఢిమ సమధికము. అది కేవలము శైలీప్రౌఢిమ కాదు. కవితాప్రౌఢిమ కూడ. ఇంత ప్రౌఢమైన భావన పెమ్మన అనిరుద్ధచరిత అనుపలబ్ధమగుట ఆంధ్రసరస్వతి దురదృష్టము.

## నంది మల్లయ
## మదనసేనము

తెలుగు సాహిత్యమునందు తొలి జంటకవులు గోన కాచ, విట్ఠల రెడ్లు మలి జంటకవులు నంది మల్లయ, ఘంట సింగనలు. వారు ఉత్తర రామాయణ కర్తలు. వీరు వరాహపురాణ, ప్రబోధచంద్రోదయ, భాగవత షష్ఠస్కంధ కర్తలు. మలి జంటకవులలోని నంది మల్లయ విడిగా మదనసేనము రచించినట్లు కలదు. నంది మల్లయ మదనసేనము లోని పద్యములు, పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు రెండు, ద్వితీయాశ్వాసమునందు రెండు కలవు. చతుర్థాశ్వాసమునందు రెండు, మూడు పద్యములు కలవు.

వర్షర్తువు

నంది మల్లయ మదనసేనము

వర్షధారలు సన్నగావళులు గాఁగ
బబలు మెఱుపులు తన్మణిప్రభలు గాఁగ



భాను శుభ్రాంశుకాంతులు గానరాక
యుండె రోదసి పాతాళమో యనంగ 1

జలకేళి

చేదెలు క్రింది మెట్టునకుఁ జేతులు పట్టుకు దిగ్గుచుండఁగా
నీరలుఁదోఁచె నంబువులు నెమ్మిఁ దలిర్పఁగ నాగకన్యకల్
చూడఁగవచ్చిరో యనఁగఁ జూచెడి పందువసేసె వేడుకన్
దోడుగవచ్చె నంచలు మనోహరయానము లభ్యసింపుచున్ 2

దుమికిన మీఁదికై యెగయు తుంపరల న్నవతారలుబ్బి త
ద్విమలముఖేందుబింబములు వెన్నెల గాయఁగఁ దత్సరోవరా
బ్జములు వడంకఁజొచ్చె దివసంబు నిశాసమయంబు శంక సే
య ముదముతోడఁ గల్వలు రయంబున గంతులువైచె నత్తఱిన్" 3

ఇందు 'దుమికిన' అను పద్యమునకు ఆకరము లేదు. కనుక నంది మల్లయ మదనసేనములోని పద్యము కావచ్చును, కాకపోవచ్చును.

నంది మల్లయ మదనసేనము లోని పద్యములు ప్రబంధరత్నాకరము నందు మాత్రమేగాక లక్షణ గ్రంథములందును కలవు.

## పొన్నాడ పెద్దిరాజు ప్రద్యుమ్న చరిత

పణిదపు మాధవుని ప్రద్యుమ్నవిజయముగాక, పొన్నాడ పెద్దిరాజు ప్రద్యుమ్నచరిత కలదు. ఇవి బహుశః పింగళి సూరన ప్రభావతీప్రద్యుమ్నమునకు అనంతర గ్రంథములు అగును. ఇది ఊహ మాత్రమే. ఇంతకు, పొన్నాడ పెద్దిరాజు ప్రద్యుమ్న చరితలోని పద్యములు ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు పదాఱు, ద్వితీయాశ్వాసమునందు మూడు కలవు. అందు 'ఇతవుల యందు నెల్ల' అను పద్యమునకు అనంతరము నందు కల 'లలితలతాంత', 'కలయగాడ్పున' అను పద్యములకు ఆకరములు లేవు. అవి ప్రద్యుమ్న చరితలోని పద్యములు కావచ్చును, కాకపోవచ్చును. ఇవిగాక ప్రబంధరత్నాకరము చతుర్థాశ్వాసమునందు ఆరు, ఏడు పద్యములు కలవు.

"వర్షర్తువు
పెద్దిరాజు ప్రద్యుమ్నచరిత

లలితాకారచితాంతరంబు చపలాలోకప్రభాసంజ్ఞలన్
జితరాసహ్యగిరాం (రిం ?) వికారమును భూషావేషమున్ ధూర్త క
ర్మకవృత్తంబుగ దుర్దినావళి సుదూరస్థంబు చేసెన్మహా
శఠముంబోలెఁ గుముద్వతీకమలినీచంద్రార్కలీలన్ (వెసన్)

కలయంగ వనవాటికలఁ జోడు ముట్టుచుఁ
గొండమ (ల్లియ) కావి గుబులుకొనియెఁ
బురివిచ్చి పంచమస్ఫుటనాదములతోడ
నర్తించి గిరులెక్క నమలిపింఛ
దిశల నెల్లని ఛాయఁ దిలకింపఁగాఁ జేసెఁ
గణప్రమాఁకులఁ గోరకముల సొబగు
విరహమానసములు వేగఁదొడఁగ జల్లి
కల్ల (ద్రుమ ?) గ్రక్కొనె తూర్పు గంధవహుఁడు
చెలఁగె నెడనెడ నాభీలసలిలపూర
విహరణోద్దండమండూ కపీతకంధ
ఘర్ఘరధ్వానడిండిమాఖండనినద
మభినవంబైన యా జలదాగమమున 2

అళివర్ణన

పొన్నాడ పెద్దిరాజు ప్రద్యుమ్నచరిత

సకలారామములన్ మదాళి వినుతుల్ సంపూర్ణమైయొప్పఁ బు
ష్పకదంబంబులు హత్తుచున్ విడుచుచున్ బాటించు చొక్కించు కిం
చుక కవ్వించుచుఁ బాంథచిత్తములు సంక్షేపింపఁగా మ్రోయుచున్
ప్రకటానంగధనుర్గుణక్రియలు చూపన్ దారియై యేపునన్ -8

కోకిల వర్ణన

పొన్నాడ పెద్దిరాజు ప్రద్యుమ్నచరిత

కామినీసమితికిఁ బంచమస్వరముల
బాగులుసూచు నేర్పరు లనంగ
విటవిటీజనులకు విన్రమోసి మన్మథా
దేశంబుఁ గావించు వెజ్జులనఁగ
విరహిబృందములకుఁ బోరినుల్కు పుట్టించు
గొరలెకు మరువెఱగొంగ లనఁగ
నిలవసంతునికి మిక్కిలి సొంపుగలిగింప
డాలైనయట్టి చుట్టములనంగ
సొగసి తలిరుల వాచవిఁ జూచి చూచి
పక్వసహకారఫలరసపాయు లగుచు
ధరఁ బురారామపాదపవరులు కాఁపు
లున్న కోకిలదంపతు లుల్లసిల్లె 4

చిలుకలు

పెద్దిరాజు ప్రద్యుమ్నచరిత

పలుకులు బాలికాజనుల భాషలు పీడుపడంగఁ జంచులున్
ఫలములు కెంపుపొత్తుఁ గొనఁ బక్షములున్ బసరాకుజొంపముల్
చెలిమియొనర్ప వర్తనము చిత్రజుఁ డాడియుఁ గూడి రా
చిలుకలు వాల్చుతోటల వసించిన పొందులు వేటలాడుచున్ -5

పెద్దిరాజు ప్రద్యుమ్నచరిత

మీనపతాకకేళిఁ దమ మేను లెఱుంగక వ్రాలునప్డు సూ
న్యూనత తమ్మితేనియల నూనిన తేంట్లననొప్పు నచ్చటన్
దొనలినారి చేతమును నజ్జని వ్రేళ్లను బెల్లగింపఁగాఁ
బూని య(నే) కరూపములఁబుట్టిన భంగిఁ గళంకితచ్ఛవిన్ -6

సముద్రవర్ణన

పెద్దిరాజు ప్రద్యుమ్న(చరిత)

దైతేయుం డంతఁజూచెన్ దళసలిలతలద్వా (రదుర్వా) రలీలా
పాతోన్మజ్జన్నిమజ్జద్బహుళజలచలాపా (ర గంభీర) శశ్వ
ద్వ్యాతూలస్థూలకేలీవశవిశదకణావాలకల్లోల (మాలా)
జాతాఘాతాదిరౌద్రున్ జలదచలకులాసన్నభ (ద్రున్ సము)ద్రున్"- 7

ఇందు రెండవ పద్యమునకు ఆకరము లేదు. అది పొన్నాడ పెద్దిరాజు ప్రద్యుమ్నచరితలోని పద్యము కావచ్చును, కాకపోవచ్చును.

## బొడ్డపాటి పేరయ
## శంకర విజయము

బొడ్డపాటి పేరయ శంకరవిజయములోని పద్యములు ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు రెండు, ద్వితీయాశ్వాసమునందు ఒకటి, తృతీయాశ్వాసమునందు నాలుగు కలవు. అవిగాక చతుర్థాశ్వాసమునందు మూడు కలవు.

*శిశిరర్తువు

బొడ్డపాటి పేరయ శంకరవిజయము

మేదినీజలమెల్లఁ గేదారజలమయ్యెఁ
గాకున్న పలి యుదకంబులెట్లు
భూమిలో వరగళ్లప్రోవులయ్యెను భూధ
రంబులు గాదె నివంబు గలిసె
నిందుండు భాస్కరుండిందుండు గాఁబోలుఁ
గాకున్న రవి వేఁడి గామియెట్లు
అఖిలతరులు చలి నంతర్భవించెఁ బో
కాదేని చలి కదగానరాదె
యగరు మాంజిష్ఠపటము ప్రియాంగనాంగ
సంగతియు నిచ్చగల భాగ్యశాలి దక్క
మనుజు లీ చలి నేమని మనుట గలుగు
ననఁగ శిశిరంబు భువనంబు లాక్రమించె

వసంతర్తువు

బొడ్డపాటి పేరయ శంకరవిజయము

రాగరంజితకుసుమపరాగపటలు
లంబరముఁగప్పె మలయజోద్ధతములగుచు
గగనచరులెల్ల పీథు. బుత్కంఠనాడు
రమ్యవాసంతకుంకుమరజ మనంగ

దశదోహదములు

బొడ్డపాటి పేరయ శంకరవిజయము

పాది గండూషమధు పుల్కి పల్కుఁ జిల్కు
జూచి గోరాత్తి ముద్దిడి దాఁచి నవ్వి
డాపు దాలించి కౌఁగిట నుపచరించి
ననువుచేనుండెఁ దరువులో నాథులొక్క"

ఇవి మూడు. అవి ఏడు. మొత్తము పది. ఇందు తంజావూరి ప్రతిలోని బొడ్డపాటి పేరయ పద్యమునకు కలదు[7] గాని, ప్రత్యంతరములోని బొడ్డపాటి పేరయ పద్యమునకు కుమారసంభవమునందు అనుకరణము లేదు. ఇదియును గమనార్హము.

## తెనాలి రామలింగయ
## హరిలీలావిలాసము

తెనాలి రామలింగయ హరిలీలావిలాసములోని పద్యములు ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు పదమూడు, ద్వితీయాశ్వాసమునందు ఒకటి, తృతీయాశ్వాసమునందు ఆరు కలవు. తృతీయాశ్వాసములోని '-ఉడుపథంబు'అను పద్యమునకు ఆకరము లేదు. అది హరిలీలావిలాసములోని పద్యము కావచ్చును; కాకపోవచ్చును. ఇక ప్రబంధరత్నాకరము తృతీయాశ్వాసములోని 'తెలతెలవాఱ' అను పద్యమునకు ఆకరము కలదు గాని, అది తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యమునందు కలదు (119 ప., 1 ఆ.) ఇవిగాక చతుర్థాశ్వాసమునందు ఇంకను ఆరు పద్యములు కలవు.

*శిశిరర్తువు

తెనాలి రామలింగయ హరిలీలావిలాసము

పెదవియుఁ బెదవియు నుదురును
నుదురును గేల్ గేలు పదముమంబదము నొగిన్
గదియించి సంధిఁబెరుగు ప
గిది నొదిగిరి సతులుఁ బతులు కేళిగృహములన్ -1

వనవిహారము

తెన్నాలి రామలింగయ్య హరిలీలావిలాసము

నిటుపేద కౌనింత నిక్కింతన దళియై
రోమాళి తన కలరూపుఁదెలుప
నున్నతోన్నతమూర్తిఁ జెన్నొందు కటిసీమ
కనయంబు తొంటి పొంకంబు సడలి
పసపుఁబయ్యెదఁ జాటు బయలైన పాలిండ్లు
చూపర కోర్కులు చూఱలిడఁగ
నవవిభాగంబున నలవలనైయున్న
వేణి దొల్తటి కమ్మవిరులు దొరుగఁ
గళభాగరుచులు కసికంపుఁబొడి వెద
చల్లులాడు నొక్క చంద్రవదన
కొసరి కుసుమబంతిఁగోయు కైతవమున
నత్తపస్వి ప్రౌఢ చిత్తరించె _2

మధుపానము

తెన్నాలి రామలింగయ హరిలీలావిలాసము

సింధుపూరితముగాఁ జిప్పనివాళింపుఁ
జేవెలుంగిడి చూచుఁ జేతి మదిర
యించుక చవిగొను నించుఁ జేరువనున్న
బోటికిఁ బొలమట్టి తేటలించు
నొకయేల పదము మిన్నకపాడి తోడన
నేమంటినే యేసు నేలికైన
సవరని మొగమెత్తి జాబిల్లి నీక్షించుఁ
గడురహస్యములైన కథలనాడు
మెచ్చుఁ దలయూఁచు నగుఁదోన [వచ్చుఁజెంత]
నలరు లోఁబడు జాతులఁగలియఁ దరుల
నొఅగు [తొలఁ] గు నేర్పుఱుఁగు నలరు [లుదాల్చు]
మగువ యొక్కత మధుపాన [మత్తయగు] చు -3

ద్యూతములు

తెన్నాలి రామలింగయ హరిలీలావిలాసము

ఉరుతరాంబుదము [లు] వోలె నొడ్డి నిలిచి
వైణికులు వోలె సారెలు వరుస నుసిచి
పుష్పలావికలను బోలె [ఁబుకిసిలించి]
యెత్తు [లిడియెద] రార్యయు నిందుధరుఁడు

నదీవర్ణనము

తెన్నాలి రామలింగయ హరివి[లాస]ము

ఆ మునిసార్వభౌముఁడు సమంచిత కాం[చనసారి] జాత లా
జీమతి భానుభానికరజిత్వరతత్పరమాణ పేనిల
శ్రీమతి వాతధూతజలశీకర సేకపవిత్రితాంక ధా
త్రిమతి దర్భికాఖిలసుధీమతిగోమతిఁ గాంచె ముందటన్

పుణ్యక్షేత్రములు

తెన్నాలి రామలింగయ హరి [లీలావిలాసము]

ఈఁతపండికిఁ దాటిపండంత కింత
మ [శకమైనను] గొండొక శశకమైనఁ
గాశికాసీమఁ గడ న్నిద్రగ [న్నుమొగి] చి
మేరు ధనునెత్తి కదలని తేరునడుపు"

ఇవి ఆరు. అవి ఇరువదియొకటి (13 + 1 + 6 + 1) మొత్తము ఇరువదియేడు. తెనాలి రామలింగయ హరిలీలావిలాసములోని పద్యములు లభించినవి. ఇదొక తారావళి.

## తెనాలి రామలింగయ
## కందర్పకేళీవిలాసము

తెనాలి రామలింగయ కందర్పకేళీవిలాసములోని పద్యములు ప్రబంధరత్నాకరము ద్వితీయాశ్వాసమునందు రెండు, తృతీయాశ్వాసమునందు ఒకటి కలవు. ద్వితీయాశ్వాసమునందు 'వారిజమీన కోక' అను పద్యమునకు, 'లలితాస్యాంబురుహంబు' అను పద్యమునకు ఆకరములు లేవు.

'అక్కమలాక్షి' అను పద్యమును బట్టి అవి కందర్పకేళీవిలాసములోని పద్యములు కావచ్చు; కాకపోవచ్చును. కావ్యము పేరు 'కందర్పకేతు విలాసము అని తంజావూరి ప్రతి యందు కలదు. ప్రత్యంతరమునందు 'కందర్పకేళీ విలాసము' అని కలదు. తంజావూరి ప్రతిలోని పేరుకంటె ప్రత్యంతరములోని పేరు అర్థవంతము. ప్రబంధరత్నాకరము చతుర్థాశ్వాసమునందు కందర్పకేళీ విలాసములోని పద్యము ఒకటి కలదు.

సిద్ధపురుషుఁడు

తెన్నాలి రామలింగయ కందర్పకేళీవిలాసము

మౌళిఁ గెంజడల జొంపము ఫాలపట్టికఁ
దీండ్రించు భసితత్రిపుండ్రకంబు
కర్ణకీలితరత్నకామాక్షియుగళంబుఁ
బలుచని నెమ్మేని బట్టుకంథ
కరముల బంగారు సరకట్టుఁ గిన్నెర
హరిణశృంగంబుఁ బేరురమునందుఁ
గరమూలమున భూరితరవారి సన్నంపు
నడుమున నొడ్డియాణంబు దిద్దు

పెరగుపై వ్యాఘ్రచర్మకౌపీనకలన
యోగవాగలు శూలంబు నాగసరము
పొలుపు దళుకొత్తు చెట్టునఁ బుట్టినట్లు
నిరుపమాకారసిద్ధుఁడు నరుగుఁదెంచె"

ఇందు మూడవ సీసపాదము నందు 'భూరికరవాల' అని కలదు. అది యతి మైత్రిఘటితమే కాని సమాసత్రుటితము. కనుక 'భూరితరవారి' కవి పాఠము కావలయును ఇది ఒకటి. అవి అయిదు. మొత్తము ఆరు ఇందు తంజావూరి ప్రతిలోని సంశయాస్పదమైన తెనాలి రామలింగయ పద్యమునకు కలదు[8] గాని, ప్రత్యంతరములోని తెనాలి రామలింగయ పద్యమునకు కుమారసంభవమునందు అనుకరణము లేదు. ఇదికూడా గమనార్హము.

## నందూరి మల్లయ్య
## హరిదత్తోపాఖ్యానము

నందూరి మల్లయ్య హరిదత్తోపాఖ్యానములోని పద్యము ఒక్కటి ప్రబంధ

రత్నాకరము ప్రథమాశ్వాసమునందు కలదు. చతుర్థాశ్వాసమునందు మఱొక్కటి కలదు.

వసంతర్తువు

నందూరి మల్లయ్య హరిదత్తోపాఖ్యానము

శుకవాక్యస్ఫుటమంత్రముల్ దనర నస్తోకప్రసూనోల్లస
న్మకరందాజ్యసుధార లొప్పఁగ వసంతజ్వాలసద్వీథిఁ గిం
శుకపుష్పాగ్నులఁ జైత్రయాజకుఁడు దా సూనేష్వజప్రీతి ను
త్సుకతన్ వ్రేల్చె ద్విజాతియందు శశిదత్తున్ శ్రీవరున్ ప్రేమతో"

ఇది ఒకటి. అది ఒకటి. ఈ రెండు పద్యములు వినా, నందూరి మల్లయ్య హరిదత్తోపాఖ్యానము నామమాత్రముగనైన ఇతరత్ర కనరాదు. వినరాదు.

## ఘటవాసి మల్లుభట్లు
## జలపాలి మాహాత్మ్యము

ఘటవాసి మల్లభట్లు జలపాలి మాహాత్మ్యములోని పద్యములు ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు ఒకటి, ద్వితీయాశ్వాసమునందు రెండు కలవు. చతుర్థాశ్వాసమునందు మూడు పద్యములు కలవు.

"దశదోహదములు

ఘటవాసి మల్లుభట్లు జలపాలి మాహాత్మ్యము

అతివ పాదాంబుజాహతి నశోకము పూచె
వెలఁది యూర్చున [కు] వావిలి పాలించె
లలన చూపులచేతఁ దిలకంబు పులకించెఁ
గోమలి కౌఁగిటఁ గురవి నవఁచె
గామినీపదనసంగతి నబ్బె సంపెంగ
తరుణి చేఁబడ్డ చూతము ఫలించె
వనితగీతమున ప్రేంఖణము వాసనమించె
నారి నవ్విన కర్ణికార మలరె
నాతిమాటల వలనఁ బున్నాగతరువు
పొలఁతి మద్యంబు లుమియఁగఁ బొగడ మించెఁ
జంద్రవదనలు విహరించు చతురగిరిమ
నీరసంబులు సారస్యనిరతిఁబొందె

వేటవర్ణన

ఘటకాశి మల్లుభట్లు జలపాలి మాహాత్మ్యము

శార్దూలభల్లూకచయముల మర్దించి
సింహపోతమ్ముల సంహరించి
ఖడ్గపోతంబుల ఖడ్గముల హరించి
వనవరాహముల గర్వము లణంచి
చామరప్రియమునఁ జమరుల మన్నించి
మదగజంబులకు సమ్మద మొనర్చి
విద్యుల్లతానేత్ర విభ్రమంబు లణంచి
హరిణచయంబుల నాదరించి
భ్రమసియుండిన, వడిదప్పి పాఱలేక
యలసి పడ్డను, రతికేలి మెలఁగుచున్నఁ
బాలకులఁ జూచి పోలిక భక్తినున్న
విపినమృగముల కృపతోడ విడిచిపుచ్చె 2

నదీవర్ణన

ఘటకాశి మల్లుభట్లు జలపాలి మాహాత్మ్యము

గురు ముక్తిమార్గానుకూలంబు కూలంబు
భాసురసుజ్ఞానఫలము జలము
బహుళకల్మషగర్వభంగంబు భంగంబు
శ్రవణసంతోషగౌరవము రవము
యోగీంద్రహృదయానురాగంబు వేగంబు
వసుధదుర్మతికి నావర్ల సుళ్లు
సురపథప్రాప్తికిఁ దెరువులు నురువులు
యిహపరంబుల కుప్ప యిసుకతిప్ప
యంబురాశి సమాలింగనానుషంగ
విప్రనిగమోత్తమత్రితంత్రప్రసంగ
.................... కారణజలవిహంగ
గౌతమీగంగఁ గాంచె [క్ష్మానేతయ] పుడు

ఇవి మూడు. అవి మూడు. మొత్తము ఆరు పద్యములు. ప్రబంధరత్నాకరము మొత్తముమీద కవి ఇంటిపేరు 'ఘటవాసి, ఘటికాశి, ఘటసాసి, మదిదాసి' అని బహువిధములుగ కలదు. గ్రంథముపేరు 'మహత్వము' అని కలదు. అది 'మహాత్వము'నకు గాక, మాహాత్మ్యమునకు లేఖకదోషము.

## అంగర బసవయ
## ఇందుమతీ కల్యాణము

అంగర బసవయ్య ఇందుమతీ కల్యాణములోని పద్యములు ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు ఒకటి, ద్వితీయాశ్వాసమునందు రెండు, తృతీయాశ్వాసమునందు ఒకటి గలవు. ద్వితీయాశ్వాసమునందు 'హిమసింహాసనం బెక్కి' అను మఱొక పద్యమునకు అకరములేదు. అది ఇందుమతీకల్యాణములోని పద్యము కావచ్చును, కాకపోవచ్చును. ఇవి అయిదుగాక చతుర్థాశ్వాసమునందు మఱొక మూడు పద్యములు కలవు.

వస్త్రములు

అంగర బసవయ ఇందుమతీ కల్యాణము

బొమ్మంచు లవ్వంగములు గిజపొప్పళ్లు
జిలుగుఁజెంగావులు చిలుకచాళ్లు
వలిపెంపు లెరమదావళము [లు] ముత్యాల
పందిళ్లు నోఁజులు పచ్చబట్లు

గుఱ్ఱవాపులు చిత్రకోలాటములు గంధ
గావులు నఠినీలు గర్భసుఖులు
మేఘవన్నియలు లక్ష్మీవిలాసమ్ములు కం
టక గుబ్బగలును నందనవనాలు

మండలా చరణంబులు నిండు జంత్రి
కలు చలారులు షీటులు కారికములు
తోరహస్తుర్ కలంబీలు దుప్పటములు
కటితలంబులు నొప్పగాఁ గట్టుకొనిరి

భూషణములు

అంగర బసవయ ఇందుమతీకల్యాణము

బబ్బిలికాయలు బంగారు మొగలు పి
ల్లాండ్లు మట్టియలు పాదాంగకములు

మొలనూళ్లు కంకణంబులు వీరముద్రిక
అంగుళీయకములు హారతతులు
కేయూరములు భుజకీర్తులు తవపాలు
కట్టాదిముత్యాల కంటసరులు
సూదిగంటులు చేరుచుక్కలు బవిరెలు
గుబ్బసరంబులు కుండలములు
ముంగరయు బన్నసరములు మొలపురిఁగె
లల్లిపువ్వులు పతకంబు లంజికట్లు
చేకటలు నాగవడిగెలు చెవుల పువ్వు
లవయవంబుల దాల్చిరి యమరఁగాను 2

నదీవర్ణన

[అం]గరబసవయ ఇందుమతీకల్యాణము

[శ్రీహే] లాపరదిత్తుజుండుఁడు చూచెన్ నర్మదా [వాహిని] న్
సౌహిత్య ప్రథమాన జీవన సరస్సద్దేహినిన్ [దీరరే]
హాహంసీబకచక్రవాకపటుపక్షక్షేపసం [జాత] వా
తాహత్యుచ్చలితాంబుపాంశుపటలవ్యా [కీర్ణ న] మ్మోహినిన్" -8

ఇవి మూడు. అవి ఆయిదు. మొత్తము అంగర బసవయ ఇందుమతీ కల్యాణములోని పద్యములు ఎనిమిది కలవు. అంతేకాదు. అదృష్టపూర్వములైన భూషణములు, అశ్రుతపూర్వములైన వస్త్రములు కలవు. ఉపరి, అందు "షీటులు" కలవు. 'షీటు' అను పదము కేవలము ఆంగ్లపదము. షీట్ అనగా 'నేప్కిన్, క్లాత్ ఆఫ్ టవల్, ఎ బ్రాడ్ పీస్ ఆఫ్ లెనిన్ ఆర్ కాటన్ స్టఫ్' అని ది కాంప్లీట్ ఎడిషన్ ఆఫ్ ది ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీ' యందు కలదు. మరి ఆంధ్రభాషాగ్రంథమునందు ఆంగ్లభాషా పదమును ప్రయోగించిన అంగర బసవయ ఇందుమతీ పరిణయము, అందలి పద్యమును అనుసంధించిన పెదపాటి జగన్నాథ కవి ప్రబంధరత్నాకరమును అర్వాచీన గ్రంథము లగుట అపరిహార్యము. ప్రబంధరత్నాకరము సంకలన కాలము పదునెన్మిదవశతాబ్ది అని పూర్వోక్తము. ఇది తన్నిర్ధారక సాధనము.

## తులసి బసవయ్య
## సావిత్రి కథ

తులసి బసవయ్య సావిత్రి కథలోని పద్యములు ప్రబంధ రత్నాకరము ప్రథమాశ్వాసమునందు పదొకండు, ద్వితీయాశ్వాసమునందు తొమ్మిది, తృతీయాశ్వాసమునందు ఏడు కలవు. అవిగాక చతుర్థాశ్వాసమునందు మఱొక పద్యము కలదు.

"జోగిణి

తులసి బస్వయ్య సావిత్రికథ

కప్పెరయున్ గళాసమును గంథయు లూతము సింగినాదమున్
విప్పగు భూతిబొక్కణము ప్రేలు పిశంగ జటాకదంబమున్
త్రిప్పురు నక్షమాలికయుఁ దిన్నని కూలముఁ గల్గి సంతసం
బుప్పతిలంగ వచ్చు నొక యోగినిఁ గాంచె నభోంతరంబునన్"

ఇది ఒకటి, అవి ఇరువదియేడు. మొత్తము తులసి బసవయ్య సావిత్రి కథలోని ఇరువదియెన్మిది పద్యములు ప్రబంధరత్నాకరమునందు కలవు.

## అముడూరి నరసింగభట్లు
## షోడశరాజచరిత

అముడూరి నరసింగభట్లు షోడశరాజచరిత్రలోని పద్యము, ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు ఒక్కటి కలదు. చతుర్థాశ్వాసమునందు మఱొక్కటి కలదు.

"సేతుబంధనము

అముడూరి నరసింగభట్లు షోడశరాజచరిత

ఇచ్చోటన్ వినుఁడీ యథార్థకథ ను [త్ప్రేక్షింప సీతున్] స్తుతిన్
మెచ్చింపంబన్నని కాదు రాఘవచమూనిర్మూల [నోద్రేకియై]
విచ్చున్మార్గ విరాళి మొగ్గి యనుచున్ విచ్చేసె నంబోధి కి
[యుచ్చన్ ద] ర్పయనార్థమే నిలిపినాఁ డుర్వీశుఁ డీ 'సేతువున్'

ఇందు ఎవరో వక్త ఎవరెవరో శ్రోతలకు — సేతువును నిర్దేశించి, ఉర్వీశుడైన శ్రీరాముడు తచ్ఛత్రువాచ్యుడైన రావణాసురుని సంహరించుటకు సేతుబంధనము సేసినట్లు వివరించుట కలదు.

## జయతరాజు ముమ్మన
## విష్ణుకథా నిధానము

జయతరాజు ముమ్మన విష్ణుకథానిధానములోని పద్యములు ప్రబంధరత్నాకరము ప్రథమాశ్వాసమునందు పదకొండు, ద్వితీయాశ్వాసమునందు మూడు కలవు. అవిగాక ప్రథమాశ్వాసమునందు 'కమలజ కృష్ణశంకరులు', మూడ్కి మోమున' అను పద్యములకు, ద్వితీయాశ్వాసమునందు 'అరుణజటాచయంబును' అను పద్యమునకు ఆకరములు లేవు. అవి విష్ణుకథా నిధానము లోని పద్యములు కావచ్చును. కాక పోవచ్చును. అంతేకాదు. ప్రథమాశ్వాసములోని 'ఉరక ముయ్యరి' అను పద్యము ద్వితీయాశ్వాసములోని 'వెనుకకుఁబోక' అను పద్యము పురుషార్థసారములోని పద్యములుగ సకలనీతిసమ్మతమునందు ఇంకను మూడు నాలుగు పద్యములు కలవు.

"మృగమునకు

జయతరాజు ముమ్మన విష్ణుకథానిధానము

వీక్షణవిస్ఫురద్విస్ఫులింగంబులు
బడబానలార్చులఁబంగిఁ బఱువ
నిర్ఘాతసంఘాగ్రఘర్ఘరధ్వానంబు
లంబునిధిధ్వాన మడిచిపుచ్చ
భాసురభీకరకేశ్రపమాణంబు
లభ్రచక్రంబుల యదులవాప
కఠినమౌ దోర్దండఘనవాలదండంబు
శరధిశైలంబుల సత్త్వముడుప

నిశితదంష్ట్రిచలము పయోనిధులలోన
మెఱయు మత్స్యపు మోసల యొఱపు దఱుప
దైత్యవీరుని గుండియల్ దల్లడిల్ల
నపుడు యజ్ఞవరాహేంద్రుఁ డతిశయిల్లె

సముద్రవర్ణన

జయతరాజు ముమ్మన విష్ణుకథా [నిధానము]

గాంభీర్యసంపద గణుతించునప్పుడు
తన్ను [మొదలు] గాఁగ నెన్నవలయు
సకలంబు లోఁగొను సద్గుణంబె [న్నుచోఁ]
దను నిదర్శనముగా వినుతిసేయఁ

గడునేదియు [ద్రమించుక] దఁ దమిఁజెప్పఁచోఁ
దనకు మర్యాద యుదాహ [రణము]
[బ] హుసువస్తువుఁ గన్న భాగ్యంబుఁ బల్కఁచోఁ
దనపేర్మి [యగుఁబం] తమునకుఁ గూడ

మఱియు మంచితనంబుల యొరువు [మురువు]
చెప్పఁబూనఁగఁ దానయై చెన్నుమిగులఁ
దనకు సాటి [వస్తువుఁదలఁ] పదాన యగుచు
నఖిలసౌభాగ్యమయ్యె నయ్యంబురాశి

అసమబాణుని మాత వెసఁగన్న పురుటిల్లు
భూతనాథుని వేఁడిబోనమిల్లు
కూటవ వేల్పుల కుడి వెన్న తరియిల్లు
పుణ్యపుఁగోమలి పుట్టినిల్లు
పాఁపపాన్పుంవాని పవ్వళింపులయిల్లు
జలచరగ్రహముల సత్రమిల్లు
వాలిసుగ్రీవుల వారత్రవారిల్లు
కొండలు దాఁగెడు గొందిదిల్లు
క్రూరసురగజహయముల కుట్టిముట్టు
మణులు గన్పట్టు పెల్లువ మనికిపట్టు
వాహినుల కూఁత వారిద్రవణము మేఁత
యూఁతలకు సీత పెమ్మహోతఁ ప్రాఁతజలధి

నదీవర్ణన

జయ [తరాజు ముమ్మన] విష్ణుకథానిధానము

అరు భవజ్జులుం [గొని] యాడుచు నెవ్వఁడువాఁడు [ముక్తి] దొ
ద్దాకును ప్రేమతో సరసమాడు హిమాచల కన్యతోడ, ము
ద్దాడు గణాధినాయకుని నాడు మహాద్భుత తాండవంబుఁ జెం
దాడు విధిన్ గృతాంతుఁ దునుమాడు విచిత్రమె జహ్నుకన్యకా"

ఇందు మూడవ పద్యమునకు ఆకరములేదు. అది విష్ణుకథావిధానములోని పద్యము కావచ్చును; కాకపోవచ్చును. ఇవి మూడు లేక నాలుగు, అవి పదునాల్గు లేక పదియేడు మొత్తము పదియేడు లేక ఇరువదియొకటి - జయతరాజు ముమ్మన విష్ణుకథానిధానములోని పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము నందు కలవు.

ఇవి ప్రబంధరత్నాకరము ప్రత్యంతరమునందు గల అనుపలబ్ధ గ్రంథముల పద్యరత్నములు. ప్రత్యంతరము వ్రాతప్రతి యందు 'వ్రాలస్ఖాలిలు చాల గలవు' అవి యథోచితముగ యథాశక్తిని పరిష్కృతములు. కాగితములు చిరిగిన స్థలము లందు చేర్చిన, కూర్చిన పదములు కుండలీకృతములు. ఎడనెడ భ్రమప్రమాదములు ఎవ్వరికిని సహజము. ఏకైక ప్రతినిబట్టి పరిష్కరించుట ఎంతైన కష్టము. ప్రామాణికమైన పరిష్కారము పరిత్యాజ్యము. ప్రామాణికమైన సంస్కారము పరిగ్రాహ్యము.

మొత్తముమీద ప్రబంధరత్నాకరము ప్రత్యంతరము/నందు 1. అజ్ఞాతకవి కళావిలాసములోని పద్యములు పందొమ్మిది; 2. నారాయణదేవుని కళాభిరామము లోని పద్యములు అయిదు, 3. త్రిపురారి ప్రేమాభిరామములోని పద్యములు నాలుగు; 4. కానుకొల్లు అన్నమరాజు అమరుకములోని పద్యము ఒకటి; 5. పణిదపు మాధవుని ప్రద్యుమ్న విజయములోని పద్యములు రెండు; 6. తులసి బసవయ్య సావిత్రికథలోని పద్యములు రెండు; 7. లక్కాభట్టు శతపక్షి సంవాదములోని పద్యము ఒకటి; 8, 9, 10. పెదపాటి సోమయ అరుణాచల పురాణములోని పద్యములు అయిదు, కేదారఖండములోని పద్యము ఒకటి, రత్నావళి లోని పద్యము ఒకటి, 11. నిజలింగ చిక్కని కథలోని పద్యము ఒకటి; 12. నాచన సోమనాథుని మత్తలీలా విలాసములోని పద్యము ఒకటి; 13. అజ్ఞాతకవి వేంకటవిలాసములోని పద్యము ఒకటి, 14. బొడ్డపాటి కొండయ/పేరయ రాజశేఖర విజయములోని పద్యము ఒకటి, 15. ప్రెగడపల్లి పోతయ గోదావరీ శతకములోని పద్యము ఒకటి; 16. శరభాంకుని శరభలింగ శతకములోని పద్యము ఒకటి, 17. చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనములోని పద్యములు మూడు; 18. భావన పెమ్మన అనిరుద్ధచరితలోని పద్యములు రెండు; 19. నందిమల్లయ మదన సేనములోని పద్యము ఒకటి; 20. పొన్నాడ పెద్దిరాజు ప్రద్యుమ్న చరితలోని పద్యములు ఏడు, 21. బొడ్డపాటి పేరయ శంకరవిజయములోని పద్యములు మూడు, 22, 23. తెనాలి రామలింగయ హరిలీలావిలాసములోని పద్యములు ఆరు, కందర్పకేళీ విలాసములోని పద్యము ఒకటి; 24. నందూరి మల్లయ హరి దత్తోపాఖ్యానములోని పద్యము ఒకటి: 25. ఘటవాసి మల్లుభట్టు జంపాలి మాహాత్మ్యములోని పద్యములు మూడు; 26. అంగర బసవయ ఇందుమతీ కల్యాణము లోని పద్యములు మూడు, 27 అముదూరి నరసింగభట్టు షోడశరాజచరితలోని పద్యము ఒకటి; 28. జయతరాజు ముమ్మన విష్ణుకథానిధానములోని పద్యములు నాలుగు - వెరశి ఇరువది యెనిమిది అనుపలబ్ధ గ్రంథములలోని ఎనుబదిరెండు అప్రకటిత పూర్వములైన పద్యరత్నములు కలవు. అంతేకాదు. 1. లక్కాభట్టు శతపక్షిసంవాదము, 2. అజ్ఞాతకవి నిజలింగచిక్కని కథ, 3. ప్రెగడపల్లి పోతయ గోదావరీశతకము, 4. శరభాంకుని శరభలింగశతకము - నాలుగు అప్రసక్తపూర్వము లైన గ్రంథములు కలవు. ఉపరి, 1. నారాయణదేవుని కళాభిరామము, 2, త్రిపు రారి ప్రేమాభిరామము, 3. భాస్కరుని శృంగార రత్నాకరము, 4. పెదపాటి సోమయ రత్నావళి, 5. నాచన సోమనాథుని మత్తలీలావిలాసము, 6. అజ్ఞాతకవి వేంకటవిలాసము, 7. బొడ్డపాటి కొండయ. పేరయ రాజశేఖరవిజయము - ఏడు అజ్ఞాత పూర్వములైన గ్రంథములు కలవు. మీదుమిక్కిలి కేవలము రసనారమణీయ కము మాత్రమే గాక సమకాలిక సమాచారమును కలదు

కవుల చరిత్రకు కరదీపిక. సాహిత్య చరిత్రకు మణిదీపిక, సాంఘిక చరిత్రకు గుణదీపిక అయిన పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము తంజావూరి ప్రతిని, ప్రత్యంతరమును జతపరచి యథాదథముగ సత్వరమే ప్రకటించుకొనుట సాపేక్ష్యము.

## సూచికలు


1. ప్రబంధరత్నావళి. ద్వితీయముద్రణము, పు॥లు 182-4
2. ఆంధ్రకవితరంగిణి, నాల్గవ సంపుటము, పు.
3. నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా?! పుటలు 76-8
4. కుమారసంభవము, ప్రథమభాగము, పు. 119
5. మూకు వలె, పు॥లు 56-7
6. అదే, పు॥లు 81-4
7. అదే, పు॥లు 55-9
8. అదే, పు॥లు 65-7




# కలగూరగంప

## "తత్వమసి"

ప్రసిద్ధ రాజకీయవేత్త మహామనీషి అయిన శ్రీ తెన్నేటి విశ్వనాథంగారి రమణీయ కృతి "తత్వమసి"అనే రూపంలో 1976వ సంవత్సరంలో అవతరించింది. విశాఖ సారస్వత వేదికవారు దీనిని ప్రచురించేరు. శ్రీ ఓంకార స్వాములవారికి యీ కృతి సమర్పితమైంది, నాంది, ప్రస్తావన, రంగ విభజన వుండటంచేత యీ రచన నాటకీయధోరణిలో నడిచిందనే చెప్పాలి. అంతమాత్రంచేత నాటక లక్షణాలన్నీ దీనిలో వున్నాయని చెప్పడానికి వీలులేదు.

ఈ కృతి ఉపనిషత్తులలో నిర్వచించబడి మహావాక్యాలకు సంబంధించిన జిజ్ఞాసను ప్రజ్వలింప చేస్తుంది. గ్రీసుదేశంలో, ప్రాచీనకాలంలో నివసించిన "ప్లేటో"యొక్క సంభాషణలనుపోలిన సంభాషణలు గల యీ రచన విజ్ఞులందరికీ శిరసావహించదగినది. తత్వమసి అనే మహావాక్యంలో గల విశిష్టతను, మనోజ్ఞంగా నిరూపించడానికి, శ్రీ విశ్వనాథంగారు చక్కని సాహిత్య ప్రక్రియను చేపట్టేరు- "సైన్సు"ప్రయోగాలతో ఒకవస్తువుయొక్క స్వరూపస్వభావాలను నిర్ధారణ చేసినట్టే ఒక ఋష్యాశ్రమంలో జరుపబడిన కొన్ని ప్రయోగాల ద్వారా "తత్వమసి"లో గల సత్యాన్ని ఋజువుచేసేరు. ఉద్దాలకుడు అతని కుమారుడైన శ్వేతకేతువు మరికొందరు, ఋషి కుమారులు, యీ నాటకంలో పాత్రధారులు.

కావ్యాలంకారాన్ని అధ్యయనం చేయడానికి విధిగా గురుకులవాసం, చేయ నక్కరలేదనిన్నీ "నీవెవరు ?" "నేనెవరు ?" "ఎక్కడనుండి వచ్చేము" "ఎక్కడకు పోతాము" అసలు ప్రకృతి ఎలా ఆవిర్భవించింది ? ఆత్మ అంటే ఏమిటి ? ఏది పురుషార్థం" అనే విషయాలను గురించి తెలుసుకోడానికి ముఖ్యంగా గురుకుల వాసం చేసి తీరాలని రచయిత ప్రస్తావనలో సూచించేరు. పేరుకు తగినట్టుగా శ్వేతకేతువు తెల్లని జందాను భుజముపై వేసుకుని తిరుగుతూ వుంటాడు. తత్వమస్యాది వాక్యాలలో గల సత్యాన్ని ఆయన తండ్రి వద్దనుండి గ్రహించి పూర్వపు అహంకారాన్ని విసర్జించి ప్రబుద్ధుడౌతాడు.

దేనిని గ్రహించడంచేత తెలియడానికి వీలుకాని విషయం, తెలిసిన దాని మాదిరిగా నిశ్చితం అవుతుందో, మననం చేయడానికి వీలులేని విషయం మనన మయినట్లవుతుందో, దానిని గ్రహించేవా" అని ఉద్దాలకుడు శ్వేతకేతువును ప్రశ్నిస్తాడు. శ్వేతకేతువు అదెలా సాధ్యమౌతుంది. అని తెల్లమొఖం వేస్తాడు. ఉద్దాలకుని ప్రబోధంతో మొదటి రంగం ప్రారంభం అవుతుంది.

ఆ మహర్షి తన ఆశ్రమంలో వున్న మట్టిముద్దను చూపిస్తాడు. తరువాత శిష్యులకు కొన్ని మట్టిపాత్రలను చూపిస్తాడు. కారణవస్తువైన మన్ను నిత్యమనిన్నీ కార్యవస్తువైన కుండ అనిత్యమనిన్నీ వారికి సప్రమాణంగా ఋజువుచేస్తాడు. నిత్యమైన మట్టితో అనిత్యమైన కుండ చేసినట్టే నిత్యమైన సత్‌పదార్థంతో అనిత్యమైన విభిన్న వస్తువులు రూపొందింపబడ్డాయి. వాటిపేర్లు వాగ్వ్యాపారములు మాత్రమే. నిత్యమైనదే సత్యము. అనిత్యమైనది కనుకనే అసత్యము అని చెబుతాడు. విశ్వమంతా పరమాత్మయొక్క రూపమేనని శిష్యులకు బోధించడానికి ఉద్దాలకుడు మరొక ప్రయోగంచేసి చూపిస్తాడు. కొంత బంగారాన్ని ఒక దగ్గర వుంచుతాడు. బంగారముతో చేయబడిన కుండలములు, కంకణములు మొదలైన వాటిని వేరొక చోట వుంచుతాడు.. "ఈ కంకణాన్ని మీరు తీసుకుని దీనిలోగల బంగారాన్ని నాకివ్వండి" అంటే మీకది సాధ్యమౌతుందా ?" అని ఋషి వారిని ప్రశ్నిస్తాడు. బంగారాన్ని వలయాకారంగామార్చి ఆ వలయానికి కంకణం అని పేరు పెట్టారు. అంటే వున్నది బంగారం మాత్రమే. కంకణం వలయాకారంలో వున్న కనకం యొక్క వ్యావహారికనామం మరో విధంగా చెప్పాలంటే కంకణం ఆభాస సత్యమైనది సువర్ణము మాత్రమే. సువర్ణం వంటిది ఆత్మ. కంకణాదుల వంటిది జగత్తు.

భిన్నరూపములు, విభిన్న క్రియలు గల ప్రపంచ వ్యష్టి సృష్టియందు, ఆ, చిన్మాత్రయొక్క సదంశ మాత్రమే వుంటుందనిన్నీ, అది ఏకము, అబాధితము అని నిరూపించడానికి గురువుగారు వేరొక ప్రయోగాన్ని చేస్తారు- ఋషి కుమారులు సూర్యబింబానికి ఎదురుగుండా అనేక రకాలైన అద్దాలను చేరవేస్తారు. మొదటిది సాధారణ దర్పణం. రెండవది నాలుగైదు ముక్కలుగా పగిలి వుంటుంది. మూడవ అద్దం ధూళిపట్టి వుంటుంది. నాలుగవది నీలి రంగులో వుంటుంది. మొదటి అద్దంలో సూర్యబింబం స్ఫుటంగా ప్రతిఫలిస్తుంది. రెండవ అద్దంలో పగిలిన ఐదు ముక్కల లోను, ఐదుగురు సూర్యులు కనిపిస్తారు. ధూళిధూసరితమైన అద్దంలో సూర్యబింబం అలికివేసినట్టు వుంటుంది. నీలి అద్దంలో సూర్యుడు నీలంగానే కనిపిస్తాడు.. గురువుగారు విద్యార్థులను ఆకాశంవైపు చూడమని ఆదేశిస్తారు. ఆయన, అక్కడ ఎంతమంది సూర్యులున్నారని అడగ్గా ఒకే సూర్యబింబం దేదీప్యమానంగా వెలుగుతున్నదని ఏక కంఠంతో ప్రత్యుత్తర మిస్తారు. అద్దాలలో రంగుల భేదంతో యెన్నో సూర్యబింబాలు కనపడినప్పటికీ, ఆకాశంమీదనుండే సూర్యుడొక్కడేనని వారిచేత ఒప్పిస్తారు. అవిధంగానే భిన్ననామములు, విభిన్న ప్రక్రియలు గల వ్యష్టిసృష్టియందు చిన్మాత్ర యొక్క సదంశ వుంటుందనిన్నీ, దాని ఆభాసవలన విభిన్నత్వం గోచరమౌతుందనన్నీ చెప్పి, ఒకే సూర్యబింబం ఏవిధంగా లోకాన్ని ప్రజ్వలింప చేస్తున్నదో అలాగే ఒకే పరమాత్మ విశ్వమంతటినీ ప్రకాశింపజేస్తున్నాడని ఆచార్యులవారు బోధిస్తారు. పరమాత్మ విశ్వమంతటా ఆవరించి వుందని అంతేవాసులు తెలుసుకుని ధన్యులౌతారు- ఇంతటితో మొదటి రంగం సమాప్తమౌతుంది.

"ఆపోవై యిద మగ్ర ఆసీత్" అనే వేదవాక్యంపై కొంత చర్చ జరుగుతుంది. అగ్ని, ఆదిత్యుడు, చంద్రుడు మొదలైన వాటియొక్క మూలాన్ని మనం తెలుసుకోగలిగినట్లయితే జ్ఞాతము కానిది సర్వమూ జ్ఞాతమౌతుందని గురువులు ప్రవచించేరు. దృశ్యమానమైన యీ జగత్తుయొక్క ఉత్పత్తికి పూర్వం "సత్" పదార్థము మాత్రమే వుండేదనిన్నీ అది విశ్వవ్యాప్తమైనదనిన్నీ, బహిరంతరములందున్న అఖండమైన ఆ "చిత్" స్వరూపమే మనయందుకూడా వుందనిన్నీ, ఆ చిత్ స్వరూపమే తాను అని అనుభవపూర్వకంగా తెలుసుకోగలిగిన వారు ధన్యజీవులనిన్నీ గురువుగారు చర్చద్వారా శిష్యులకు ప్రబోధిస్తారు. "మాయ" అనే శబ్దానికి, యేనమాతి నిర్మాతి "దేనివలన నిర్మాణక్రియ జరుగుతున్నదో అదే "మాయ" అని విశ్వనాథంగారు పాత్రలద్వారా చెప్పిస్తారు. - "చిత్" స్వకీయమైన శక్తిచేత అనగా మాయచేత విశ్వాన్ని సృష్టించిందనిన్నీ యీ చిత్ శక్తియొక్క వీక్షణాపూర్వక సంకల్పమే జగత్తునకు కారణమనిన్నీ గురువుగారు చెప్పేరు.

చర్చ యీ విధంగా సాగుతూవుండగా మనస్సు అన్న వికారము, ఉదకములు ప్రాణవికారములు అని గురువుగారు సెలవిస్తారు. ఈ విషయం విద్యార్థులకు సరిగా అవగతం కాలేదు. ఈ విషయం సుబోధకమయేలాగ చెయ్యడానికి ఉద్దాలకుడు శ్వేతకేతువును పదిహేను రోజులు ఉదకాన్ని మాత్రమే సేవిస్తూ తత్వజిజ్ఞాస చేయమని ఆదేశిస్తాడు. ఇంతటితో రెండవరంగం పూర్తి అవుతుంది.

పదిహేను రోజులు ఘోరమైన నిరశన వ్రతం చేసినఅనంతరం శ్వేతకేతువు తండ్రి గారి ఆశ్రమానికి వస్తాడు - ఉద్దాలకుడు శ్వేతకేతువును ఋగ్వేదంలో

గల కొన్ని ఋక్కులను ప్రవచించి వాటి అర్థం చెప్పమంటాడు - ఆ ఋక్కు-లేవీ తనకు స్ఫురణకు రాలేదని తనయుడు ప్రత్యుత్తరం యిస్తాడు - శ్వేతకేతువు యథాప్రకారం భోజనం చేసి తగిన విశ్రాంతి తీసుకున్న తరువాత, ఆచార్యుడు అతన్ని తిరిగీ యీ ప్రశ్నే వేస్తాడు – శ్వేతకేతువు ఋక్కులను వాటి అర్థాన్ని తండ్రిగారి ఆదేశం మేరకు చక్కగా అప్పజెబుతాడు - అప్పుడు ఉద్దాలకుడు "నాయనా! మనస్సు అన్నవికారం కనుకనే అన్నం తిన్న తరువాత నీ మనసు, పని చేసింది ఉదకములు ప్రాణవికారం కాబట్టి అవి పదిహేను రోజులు నీ ప్రాణాల్ని నిలబెట్టేయి" అని చెప్పేడు - ఈ పరమ సత్యాన్ని నిరూపించడానికి ఉద్దాలక మహర్షి తన తనయుని మీదనే చేసిన ప్రయోగానికి ఆశ్రమ వాసులు అబ్బురపడ్డారు.

ఒకనాడు ఉద్దాలకుడు, శ్వేతకేతువును పిల్చి "నాయనా రాత్రి హాయిగా నిద్రపోయావా" అని అడుగుతాడు - ఆ సుషుప్తి సమయంలో శ్వేతకేతునకు లోకంతోగాని, తన యింద్రియాలతో గాని సంబంధం లేదన్న విషయాన్ని అతని వల్ల రాబడుతాడు. ఆ సమయంలో శ్వేతకేతువు నిరతిశయమైన ఆనందాన్ని పొందేనని ఒప్పుకుంటాడు - ఆ సమయంలో శ్వేతకేతువు తనలోకి తాను వెళ్ళేడనిన్ని అందుచేతనే మాటలతో వక్తీకరించడానికి వీలులేని మహదానందాన్ని పొందాడనిన్ని గురువుగారు చెబుతారు. తెలియక అట్టి ఆనందావస్థలో దేనితో నీవు ఏకమై ఆనంద మొందితివో అది నిద్రావస్థ–తెలిసి అట్టిదానితో నీవు ఏకమై ఆనంద మొందగలిగి నప్పుడు అది పరిపూర్ణ జ్ఞానప్రాప్తి. ఆ, ఆనందము అఖండము, అద్వితీయము" అని ఉద్దాలక మహర్షి శిష్యులకు ప్రబోధిస్తాడు - తరువాత 5 వ రంగం ప్రారంభమౌతుంది.

తర్వాత జరిగిన చర్చలో శరీరమునకు మూలం యేది అన్న ప్రశ్న ఉత్పన్నమైంది - పంచభూతములు అనే సమాధానం వచ్చింది. అయితే యీ పంచభూతములు, "ఒకటి కొకటి మూలమా? లేక అన్నియు కలిసి మూలమా?" అని ముసలు ప్రశ్నిస్తారు - అప్పుడు ఉద్దాలకుడు శరీరానికి అన్నము, అన్నానికి ఉదకములు, ఉదకానికి తేజస్సు మూలభూతములని చెప్పి తేజస్సునకు సత్ పదార్థము, మూలమని చెప్పేడు. ఇదే ఆత్మ అనిన్ని, ఆ,, ఆత్మయే నీవనిన్ని ఆ మహర్షి విశదీకరించి "తత్వమసి" అని ప్రబోధిస్తాడు.

సుషుప్తిలో బ్రహ్మప్రాప్తి కలగ వచ్చును. నేనే ఆత్మనైనప్పుడు సుషుప్తి అనంతరం నాకు ఎందుకు అటువంటి అభిజ్ఞ కలగదు.అని శ్వేతకేతువు ప్రశ్నిస్తాడు. మహర్షి యీ విషయాన్ని బోధించడానికి చక్కని ప్రక్రియను చేపట్టేరు–తేనె పట్టులో గలతేనె, యెన్నో పుష్పాలనుంచి సమకూర్చబడింది. కదా. ఈ పువ్వులో తేనెఇది, ఆ పువ్వులో తేనె అది అని వేర్వేరు విభాగాలలో తేనె వుండదు కదా. మధువును సమాహారం చేసి ఒకే చోట ఉంచినప్పుడు ఈ మధుకణం ఫలానా పుష్పానికి చెందినది అని చెప్పలేం. ఆ విధంగానే సుషుప్త్యవస్థలో సమస్త వృత్తులు విరమిస్తాయి గనక, అద్వితీయమైన బ్రహ్మ మాత్రమే ఉంటుంది. యోగ సమాధిలో వాక్ప్రాణ మనస్సులను అరికట్ట గలిగిన మహనీయులు. సుషుప్త్యవంతరం కూడా బ్రహ్మానుభూతిని పొందగలరు". అని ఉద్దాలకుడు వారికి ప్రబోధిస్తాడు -

పరమాత్మ సర్వ వ్యాప్తమైనదని బోధించడానికి ఆచార్యులు లవణపు గడ్డను ఒక కుండెడు నీటిలో కలిపిస్తారు. లవణం నీటంతటిలో వ్యాపించి వుంటుంది. పరమాత్మ కూడా ఆ విధంగానే సర్వ వ్యాప్తమైనది. లవణం దర్శనానికి గాని స్పర్శకు గాని దొరకనట్టే, యీ సత్పదార్థం వాక్కునకు గాని, మనసునకు గాని, పట్టుపడదు. రసన చేత ఉప్పుయొక్క తత్వాన్ని తెలుసు కున్నట్టే, ఉపదేశ ఫలితంగాను సాధనచేత, పరమాత్మ తత్వాన్ని తెలుసుకోవచ్చును అని. "లవణపు గడ్డ" ప్రయోగం చేత ఉద్దాలకమహర్షి శిష్యులకు నిరూపిస్తాడు.-

ఆచార్యులవారు మఱ్ఱిపండును ముక్కలు చేసి లోపలనున్న బీజాన్ని పైకి తీయమంటారు. తరువాత బీజాన్ని బద్దలగొట్ట మంటారు. పిప్పి తప్ప ఏమీ కనపడ లేదని శిష్యులు చెబుతారు - పైకి కనపడక పోయినప్పటికీ మఱ్ఱి విత్తులో గల ఒకా నొక శక్తివల్ల ఒక మహా వృక్షం రూపొందినట్టే, అతి సూక్ష్మము, సన్మాత్రము, సర్వము అయిన ఆత్మ అతీంద్రియమైనది. సర్వ వ్యాపకమైనది. ఆ, ఆత్మయే నీవు అని వివరించేరు.

"నేనే ఆత్మనైనప్పుడు నాకు కర్తృత్వం యెలా కలుగుతున్నది ?" అని శ్వేతకేతువు తండ్రిని ప్రశ్నించగా తండ్రి చక్కని కథ చెబుతారు. ఇది ఆంగ్ల సాహిత్యంలో గల "యాలిగొరి" వంటిది - గాంధార దేశంలో కొందరు దొంగలు, ఒక కుఱ్ఱవానిని బంధించి, కళ్ళకుగుడ్డకడతారు. అతనిని అరణ్య మధ్య భాగానికి తీసుకువెళ్ళి అతని వద్దగల వస్తువులను దోచుకుని అతన్ని వదలిపెట్టేరు. నా కళ్ళకు దొంగలు గుడ్డకట్టేరు. నేను గాంధార దేశవాసిని నాకు సాయం చేయండని అంటూ అరుస్తూ ఆ అబ్బాయి అరణ్యంలో తోవ తెలియక తిరుగుతూ వుంటే, ఒకడు అతని చేతులకు, కళ్ళకు గల బంధాల్ని తొలగించేడు -"గాంధారానికి తోవ ఏది?" అని అడుగుతూ, అతను ఎలాగో స్వస్థలాన్ని చేరుకుంటాడు - దీని అంతరార్థం.

కుఱ్ఱాడు – సంసారి

దొంగలు–విషయేచ్ఛలు

కండ్లకి బంధం– సుకృత, దుష్కృతములు, వాసనలు అవిద్య.

అరణ్యం– ద్వంద సమావృతమైన ప్రపంచకం

తోవనడుగుట – కర్తృత్వమందు అభినివేశం

ముందు వెనకలకు పోవడం– జనన మరణాలు

అదృష్ట వశమున అడవిలో కనపడినవాడు– ఆచార్యుడు

తోవ తెలుసు కోవడం–అద్వితీయ బ్రహ్మతత్వ జ్ఞానాన్ని అలవరచుకోవడం

తిరిగి గాంధారానికి చేరడం – జీవాత్మ పరమాత్మలో ఐక్యం కావడం.

ఈ విధంగా "తత్వమసి" అనే రమణీయ రచనలో తాత్విక విషయాల్ని ప్రయోగాలద్వారా నాటకీయ ధోరణిలో. ఏడు రంగాలలో తెన్నేటివారు చిత్రించి ఆంధ్రులకు అమోఘమైన సేవచేసేరు —

## సాహిత్యకోవిద క్రొవ్విడి రామం

# సందేశకావ్యాలు - చకోరసందేశం

'ఖండకావ్యం భవేత్కావ్య స్యైకదేశాను సారిచ' అని విశ్వనాథుడను లాక్షణికుడు సూత్రీకరించి 'యథామేఘదూతాదిః' అని వివరించెను. కావున మేఘ సందేశం ఖండకావ్యం. ఖండ కావ్యములనే లఘు కావ్యములనవచ్చు. ఖండ కావ్యంలో వివిధరసాలకు తావుండదు. కథా దైర్ఘ్యమునకు తావుండదు. సంస్కృత మందలి ఋతుసంహార మేఘదూతాదుల ననుసరించి తెలుగులో ఖండకావ్యాలవతరించి నవి. ఆధునికయుగమున రాయప్రోలు వారి లలిత, తృణకంకణము, కష్టకమల, గురజాడవారి పూర్ణమ్మ చక్కని ఖండ కావ్యాలు.

కీ. శే. మోటూరి వెంకటరావుగారు వ్రాసిన 'చకోరసందేశం' ఖండ కావ్య మగుటయే గాక సందేశకావ్యమూను. ఇరువురిమధ్య కొంపోయెడి విషయము ఈ సందేశ కృతులందు ప్రధానమైయుండును. నాయకుడు నాయికకో, నాయిక నాయకునికో ప్రధానముగ సందేశములు పంపుటయే మన సందేశకృతులందు కన్పించుచున్నది.

'కాళిదాసు మేఘసందేశము' ప్రథమ సందేశ కావ్యము. తరువాతిది ధోయీ

కవిరాజు నిర్మించిన 'పవన దూతము' తరువాయి హంససందేశము. హంసదూతము కీరదూతము, చంద్రదూతము, భృంగసందేశము, కోకిలసందేశం, మేఘదూతము, తులసీదూతము, పదాంతదూతము, పాంథదూతం, పికదూతం, భ్రమర దూతం, మనోదూతం మొదలగునవి సంస్కృత సాహిత్యమున వచ్చిన సందేశకావ్యములు.

తెలుగు సాహిత్యమున కాళిదాసు మేఘసందేశము ననుసరించి సందేశకావ్యములు వెలువడినవి. ఋతుసంహారము, మేఘ సందేశముల కనువాదములు లెక్కకు మించి వెలువడినవి. కాళిదాసు గ్రంథమునను వదింపకుండ అతని గ్రంథమునాధారముగ గ్రహించి భిన్న నాయికా నాయకులతో, భిన్నదూతలతో రచించిన గ్రంథములు ఆంధ్రమున కొన్ని గలవు. కవులు కొంతకు కొంత స్వాతంత్ర్యమును ప్రదర్శించిన పద్ధతి ఇది.

విశ్వనాథ వారి శశిదూతము, జాషువా వారి గబ్బిలము, పుట్టపర్తివారి మేఘదూతం. మోటూరి వేంకటరావుగారి చకోరసందేశం ఈ కోవకు చెందినవి. వీనిలో శశిదూతము, చకోర సందేశం విప్రలంభ శృంగార ప్రధానములగు గ్రంథములు వీనిలో ప్రేయసీ ప్రియుల సుఖసంయోగం గూడ సూచించబడింది. పుట్టపర్తివారి మేఘదూతమున నాయకునకు విధింపబడినది దీర్ఘకాల పరిమితి గల శిక్ష.

కీ. శే. మోటూరి వేంకటరావుగారి 'చకోరసందేశం' అనువాదమూ కాదు. అనుకరణమూ కాదు. అనుకరణ రూపమైన స్వతంత్ర కావ్యము. కాళిదాసు మేఘ సందేశమున యక్షుడు తన భార్య యగు యక్షికి సందేశమంపగ, ఇందు యక్షి తన భర్తకు సందేశమంపుట ఇతివృత్తము.

కాళిదాసు మేఘసందేశమునకు మోటూరి వారి చకోరసందేశం పూర్తి కావ్యమనదగి యున్నది. అలకాపురము నుండి యక్షి యక్షునకు సందేశమంపుట చకోరసందేశము. అలకాపురినుండి రామగిర్యాశ్రమ ప్రాంతములలో వున్న యక్షునకు సందేశమంపబడును. ఒండొరుల వియోగాను బంధ స్థితిగతులను సందేశముల ద్వార పంపుకొనుటయే మేఘసందేశ చకోరసందేశములు.

## మేఘసందేశము- చకోరసందేశము తులనాత్మక పరిశీలన

కాళిదాసు మేఘసందేశమునందు స్వీకరించిన పుర, నదీపర్వత, దేవతాదులను - చకోర సందేశము నందును స్వీకరించెను. రెండు కావ్యములందును విప్రలంభ శృంగారమే పోషింపబడినది. యక్షుడు భూలోకములో చిత్రకూట పర్వతము నుండి నల్లని ఆషాఢ మేఘమును పంపగ. తేజస్వరూపులైన దేవతలు నివసించెడి అలకానగరమునుండి తెల్లని వెన్నెల పులుగును యక్షిదూతగ పంపుట రమ్యమైన కల్పన. యక్షునికి మేఘము వప్రక్రీడాపరిణత గజమువలె కన్పించగ, యక్షికి చకోరము 'రుచిర చిలుకు సిత మరీచిగ' తోచుట చక్కని కల్పన.

చకోర సందేశమున ప్రథమ ఖండమున యక్షి తన విరహమును పాతివ్రత్యమునకు ద్యోతకముగ సముచిత రీతిని భర్తృసందేశమునకు సమాధానమా యనునట్లు చెప్పి ద్వితీయ ఖండమున అలకాపురి నుండి రామగిరికి విలోమముగ మార్గమున గల వన. గిరి, నగర, దేవతలను భక్తిరస పూరితముగను, సముచిత శృంగార రస స్పృష్టములుగను వర్ణించి చెప్పెను. మేఘ సందేశమున పురుష పాత్రము గాన ధీరముగ హృదయమున గల ప్రేమంతయు వెల్లడి యగునట్లు జగమంతయు శృంగార రసమయముగ వర్ణించుట ఉచితము. యక్షిణి కులస్త్రీ పతివ్రత. ఎంత ప్రౌఢ అయినను లజ్జావతి గనే కన్పించును. గ్రంథమందలి ద్వితీయ ఖండమున రామగిరికి యక్షస్త్రీ మార్గనిర్దేశము గావించుట ప్రధానము.

కాళిదాసు మేఘునికి అలకా పురమును వర్ణించి చెప్పుట ఎంత రమ్యమో, వేంకటరావుగారు చకోరికకు చిత్రకూటాశ్రమమును గూర్చి చెప్పుట అంత

రమణీయము.

"దవ్వులన్ వికచ ప్రసూన వితాన చిత్రిత కూటమై
నివ్వటిల్లుచుఁ జిత్రకూటము నీ కనుంగవ కానెడిన్
నవ్వు మొల్కల యిమ్ములన్ వదనమ్మునన్ వెలచిమ్ముగా
జవ్వనిం దలపించి - వీహ్యాది జల్లు జల్లు మనంజెలీ ! "

— చకోరసందేశము.

"ప్రతిలతా సుమపత్ర రేఖ రామశబ్ద సుధాక్షర
శ్రుతులనే విరచించి, అక్షయరోచి యై ఉరశించి, ఆ
క్షితి ధరమ్మునఁ బ్రమ్మునంట - సఖీశిలా శకలమ్ములున్
బ్రతినినాదముతో నితాంతము గ్రాలునంట కదే ! అటన్"

— చకోరసందేశము.

అలకాపురిలో తన ఇంట కృశించి పడియున్న ప్రియురాలి రూపు రేఖలను వర్ణించినట్లు యక్షి చకోరికకు తన ప్రియుని స్థితిని తెలుపును.

"నూనంతస్యాః ప్రబల రుదితో చ్ఛూననేత్రం ప్రియాయా
నిశ్వాసానామశిశిరతయా భిన్నవర్ణా ధరోష్ఠం
హస్తన్యస్తం ముఖ మసకలవ్యక్తిలమ్బాల కత్వా
దిన్దోర్దైన్యం త్వదను సరణక్లిష్ట కాన్తేర్బి భర్తి"

—మేఘసందేశం 2_23

ఈ శ్లోకమునకు ప్రతి—

"గాడ్పులోఁ గదలాడు ఊరుపు కై వడిన్ బ్రసరించి పూ
దాడ్పునన్ వికసించి వెన్నెల ఛాయగాఁ బులకించి, సా
మోడ్పు కించెరలన్ వియోగపు ముద్ర సంధిలఁ గా చెలన్
గిడ్పుం తెలుపుండటన్, దిలకింపవే కరుణార్ద్రతన్, "

— చకోరసందేశము

మేఘసందేశమున యక్షుడు మేఘునితో 'మిత్రమా నాయందలి మైత్రివల్ల నీవు నా సందేశమును నా ప్రియురాలికి అందించు ఈ పని నీవంటి ఘనునికి తగనిదే అయినను నీవు నాకు సహాయము చేయుము. నావలె నీవు వియోగము అనుభవించిన పిదప వర్షాకాలములో సర్వదా నీ విద్యుత్కాంతను ఎడబాయకుండ హాయిగనుండుమనును.

"ఏ తత్కృత్వా ప్రియమను చితం ప్రార్థనా దాత్మనోమే
స్నేహార్ద్రా ద్వా విధుర ఇతివా మయ్యను క్రోశ బుద్ధ్యా
ఇష్టాన్దేశాన్జల దవిచార ప్రావృషా సంభృత శ్రీ
ర్మా భూదేవం క్షణ మపిచ తే విద్యుతా విప్రయోగః "

— మేఘసందేశం 2_55

అను శ్లోకమునకు ప్రతిగ - యక్షి ఈ చకోరసందేశ కావ్యములో చకోరికతో-

"కాన నాయెద కాన్కగైకొని కాంతునిన్ దరిసించి ప్రే
మానిలమ్ముల విశ్వసించుచు ఆగమింపరె చెచ్చెరన్
నేను నా పతియున్ వియోగపు నెవ్వగన్ దుఃఖపిల్లు చం
దానఁ గాక ఖగేశ్వరీ ! నిజనాథు గూడి సుఖింపవే"

— చకోరసందేశము

తమవలె వియోగ బాధ లేకుండ చకోరిక తన నాథునితో సుఖముగ నుండ వలెనని ఆమె కోర్కె.

## హేమమాలి - మేఘసందేశం-చకోర సందేశం

తెలుగులో దాగంటి కృష్ణమూర్తిగారు రచించిన 'హేమమాలి' లోని కథ మేఘసందేశ కథకు పూర్వగాథ, కుబేరుని ఆస్థానమున పని చేయు యక్షుడు తన విధి నిర్వహణలో అశ్రద్ధ చూపుట వలన శాపము పొందుట ఇందలి కథ 'హేమమాలి' ఆపాత్ర నాయిక.

శప్తుడైన యక్షుడు మేఘుని ద్వార యక్షికి సందేశ మంపుట కాళిదాసుని మేఘసందేశ కథ.

యక్షి యక్షునకు సందేశ మంపుట మోటూరి వేంకటరావుగారి చకోర సందేశము కథ.

ఈ మూడు హేమమాలి_మేఘసందేశము. చకోరసందేశముల కావ్యగాథలను ఒకచోట పేర్చిన పూర్తి కావ్యకథగును.

యక్షి తాను స్త్రీ. మేఘమునకు యక్షుడు చెప్పినటుల చెప్పలేదు. సిగ్గుతో చెప్పదలచిన భావములను సుకుమారముగా చెప్పను.

సందేశహారిణి చకోరిక, కావున చకోరసందేశమనునది నామము. హనుమత్సందేశము, శుకసందేశము, కీరసందేశము, మేఘసందేశము, ఇత్యాదుల వలెనె చకోర సందేశము.

### సందేశకావ్యములలో చకోర సందేశ స్థానము

వాల్మీకి రామాయణములోని హనుమత్సందేశము అన్ని సందేశ కావ్యములకు మూలము. ఈ సందేశము నాధారము చేసికొనినది మేఘసందేశము. కాళిదాసు వాల్మీకి నుండి స్ఫూర్తిపొంది మేఘసందేశం రచించెను. కాళిదాసును వాల్మీకినిలె కాళిదాసు తరువాతి కవులను పొగడిరి.

కాళిదాసుని మేఘసందేశము ననుసరించినను, దానినాధారముగ ఇన్ని నాయికా నాయకులతో భిన్నదూతలతో రచింపబడిన గ్రంథములు అనేకము కొన్ని గలవు. కవులు స్వాతంత్ర్యమును ప్రదర్శించిన పద్ధతిది. విశ్వనాథవారి శశిదూతము. జాషువాగారి గబ్బిలం, పుట్టపర్తివారి మేఘదూతం, మోటూరి వేంకటరావుగారి చకోర సందేశం మొదలగు కావ్యములిట్టివి.

రఘురామునకు హనుమంతుడు, నలునకు మరాళము, యక్షునకు మేఘము యక్షికి చకోరము దూతలు. కావ్యాలలో దూతల ప్రశంసలు గలవు. ఒక పనికి ఒకరిని ఒప్పించుటకు వారిని స్తుతించవలెను. పొగడ్తలకు లొంగనివారు అరుదు. కావున ఈ సందేశకావ్యములలో దూతల ప్రశంసలు గలవు. హనుమంతుడు, మరాళము, గబ్బిలము, మేఘము, చకోరిక పై కావ్యాలలో స్తుతింపబడుట గలదు.

కేవలము ప్రియులే తమ ప్రేయసులకు సందేశమంపుట కాక చకోర సందేశస్థితి భిన్నము.

సందేశకావ్యములు మొదట వెలువడిన మేఘసందేశమునకు అనుకరణములే. వానియందు పాఠకునకు స్ఫూర్తినిచ్చు నవీనగుణము లెట్టివియు కన్పించవు. మోటూరివారి చకోరసందేశము కాళిదాసు ననుకరించుచున్నప్పటికి ఒక విధమగు క్రొత్త ఊహకు హేతువగుచున్నది. యక్షుడే యక్షికి సందేశించుటతో వారి విప్రలంభమునకు పరిపూర్ణత యేర్పడదు. యక్షియు తన విరహము ప్రియునిపైగల అభిలాషయు వ్యక్తీకరించినవే యక్షిణీయక్షుల ప్రేమ పరిపూర్ణస్థితిని పొందదని భావించి మోటూరి వారీవిధముగా యక్షిణిద్వారా సందేశమిప్పించెను. ఇంతేగాక మేఘసందేశమునకు పూర్వరంగమైన ఇతివృత్తమును గ్రహించి హేమమాలిగా దాగంటి రచించిరి. ఇదియు మోటూరి వారి అభిప్రాయమునే సమర్థించుచున్నది.

ఇట్టి ఆలోచనాత్మకమైన ఒక క్రొత్త విషయమిందుండుటయే గాక రచన యెల్లెడల కాళిదాసుకు గీటుగ భావలోపములేక సాగుటయే ఒక విశిష్టగుణము. ఇట్టిది అన్య సందేశకృతులలో అంతటను కన్పించదు.

వెలువడిన సందేశ కావ్యములలో మోటూరి వేంకటరావుగారి చకోర సందేశము విశిష్టస్థానము నాక్రమించుచున్నది.

అకుల వి. పానకేశ్వరరావు

# అతిద్వయీకథా

సంస్కృత వాఙ్మయంలో పరమ ప్రౌఢము, అద్వితీయము, అయినది కాదంబరి. దీనిని బాణభట్టు రచించాడు. ప్రాచీనులైన కవులు తమ గురించి ఏమీ తెలియజేయకపోవడం పరిపాటి. కానీ, బాణుడు దీనికి అపవాదుగా, తన గురించి చెప్పాడు, హర్షచరిత్రలో కాదంబరిలో కూడా, అవతారికలోని. శ్లోకాలలో తన వంశానికున్న వైశిష్ట్యాన్ని చెప్పాడు. ఈయన హర్షుని ఆస్థానంలో మొదట తిరస్కరింపబడి, తరువాత ఆదరింపబడినాడుట! కన్యాకుబ్జాన్ని రాజధానిగా చేసుకుని, ఉత్తరభారతాన్ని పాలించిన హర్షుడు 7వ శతాబ్దివాడు. ఆయనా కవే. సోడ్ఢలుడు -

"శ్రీహర్ష ఇత్యవని వర్తిషు పార్థివేషు నామ్నైవ కేవల మజాయత వస్తుతస్తు,
గీర్హర్ష ఏవ నిజ సంసది యేన రాజ్ఞా సంపూజితః కనకకోటి శతేన బాణః"

అని సంభావిస్తాడు.

హర్షునిచే సంపూజితుడైన బాణుడు - కాదంబరీ, హర్షచరితము చండీశతకము, ముకుటతాడితకము వ్రాసినట్లు చెప్తారు. వీటిలో పార్వతీ పరిణయం నాటకం. ఇది కాదంబరీ కర్తకాక, వేరొక బాణుడు వ్రాసినాడని కొందరి అభిప్రాయం. హర్షచరితమనేది చారిత్రక గ్రంథం. ఇదొక నూత్న ప్రక్రియ, నాడు కాదంబరి కథ.

'కథాయాం సరసం వస్తు గద్యైరేవ వినిర్మితమ్' అని సాహిత్య దర్పణం. కథావస్తువు కల్పితం కావాలి. రసవంతమై ఉండాలి. అంతేకాదు, కథాకథనం రసవ్యంజకంగా ఉండాలి. కావ్యమనగానే పద్యం స్ఫురిస్తుంది. కానీ బాణకవి గద్యాన్ని స్వీకరించి కథని నిర్మించాడు. 'గద్యం కవీనాం నికషం' కదా! 'భుజంగమః' అని పరిహసింపబడిన తను, 'సకలవిద్యా పారంగముడ్యానికిది నికష దృషదమా' అన్నట్లు రచించాడు. ఇలా బృహత్తరం మహత్తరం అయిన కావ్య నిర్మాణానికి తగిన వైదుష్యాన్ని ఎంతో పట్టుదలతో అభ్యసించి ఉంటాడు.[1] భాషలో విశేషమైన కృషి చేశాడు. అవిరళమైన కృషి ఫలితంగా కాదంబరి జనించింది. తన ప్రాగల్భ్య ప్రకటనం కోసమే దీన్ని నిర్మించాడా అనిపిస్తుంది. గద్యాన్నాయన ఎన్నుకోవడంలోనే అది స్ఫురిస్తుంది. గద్యాన్ని వ్రాసి ప్రతిష్ఠ పొందడం కష్టం. పద్యం కన్న దుస్సాధ్యం అది. పద్యం ఛందస్సమాశ్రితం కనుక వ్యర్థపద ప్రయోగమున్నా అంగీకరించవచ్చును. గద్యం అలా కాదు. అనవసరమైన పదము ప్రయోగించరాదు. 'కావ్యం గద్యంచ పద్యంచ' అని వామనుడు మొదట కవిశక్తి నికషమైన గద్యాన్ని పేర్కొంటాడు.

కాదంబరి కొరకరాని కొయ్య అని కొందరి మతం. జటిలము, పండితైకవేద్యము, వ్యాఖ్యాపేక్షితమును. మరి దీనికింత ప్రశస్తి ఎలా వచ్చింది? అంటే, బాణుడు గద్యరచనలో దిట్ట! వామన భట్టబాణుడు ఆత్మ ప్రత్యయ ప్రకటనోపాధిగా అన్న నిజం ఇది. 'గద్యేపటీయాన్ కిల బాణభట్టః'

'ఓజస్సమాస భూయస్త్వ మే తద్గద్యస్య జీవితమ్! అని కదా! అంటే సమాస భూయిష్టంకాని గద్యం నిర్జీవమన్నమాట. అయితే - పటువు, కటువు అయిన సమాసరచన వల్ల గద్యం ప్రశంసనీయమవుతుందా? అంటే, అది 'రస నిర్భరం' కావాలి. 'నిరంతర రసోద్గార గర్భ సౌందర్యనిర్భరాః, గిరఃకవీనాం జీవంతి న కథామాత్ర మాశ్రితాః' అని కుంతకుని నిగమనం.

కొందరు వాగీశ్వరులు, కొందరు అర్థేశ్వరులు, మరికొందరు రసేశ్వరులు, కానీ బాణుడు సర్వేశ్వరుడు. కనుకనే - 'సర్వత్ర గభీరధీర కవితా వింధ్యాటవీ చాతురీ సంచారీ కవికుంభికుంభి భిదురో బాణస్తు పంచాననః -' అని ప్రశంస

కాదంబరిలో శ్లిష్టార్థాలు, క్లిష్టార్థాలు, గంభీరార్థాలు - ఇట్లాంటి అర్థభేదాలతో శబ్దజాలం వెనుక పదానకథ మరుగుపడటం కద్దు. విస్తృత వర్ణనలతో, వక్రోక్తిమార్గంలో ఉన్న ఇతని రచన ఆనాడే బహుళాదర పాత్రమైంది.

వాఙ్మయంలో కవులు స్వోత్కర్ష చేయడమున్నా, బాణకవి మాటలు యథార్థాలు

"ద్విజేన తేనాక్షత కంఠ కౌంఠ్యయా మహామనో మోహమలీమసాంధయా,
అలబ్ధవైదగ్ధ్య విలాసముగ్ధయా ధియానిబద్ధేయ మతిద్వయీ కథా." అంటాడు.

ఈయన రాసినది, కథ. దీనిపేరు కాదంబరి. ఇది అతిద్వయి. కథ అంటే ఏమిటో పైన చెప్పుకున్నాం. కాదంబరి అంటే మద్యం. అందుకేనేమో "కాదంబరీ రసభరేణ సమస్త ఏవమత్తః" అన్నాడు బాణపుత్రుడు. కాదంబరికి అయిదురకాల వ్యుత్పత్తుల్ని చెప్పారు విజ్ఞులు. ఇక్కడ కాదంబరి అంటే నాయికను పురస్కరించుకుని పెట్టినపేరు. కాదంబరీం, తదాఖ్యాం గంధర్వరాజకన్యాం అధికృత్య కృతాకథా, కాదంబరీ.

ఈ కథకు 'అతిద్వయి' అన్న విశేషణం వేస్తాడు. అతిద్వయి అంటే రెండిటిని దాటినది అని అర్థం. తనకన్నముందు వాఙ్మయంలో ఉన్న రెండు కథలను అతిగమించినదని అర్థం. 'అతిద్వయీతి విశేషణ బలాత్ బుద్ధేః తీక్ష్ణత్వం ఫలితం ద్వయీం, బృహత్కథాం వాసవదత్తాంచ అతిక్రాంతేత్యర్థః' అని వ్యాఖ్యాతలు.

'కిం కవేస్తస్య కావ్యేన! సర్వవృత్తాంతగామినా,
కథేవ భారతీ యస్య న వ్యాప్నోతి జగత్త్రయమ్.'---అని

అన్నమాటలు తన ఉదాత్తకావ్యాన్ని దృష్టిలో ఉంచుకొని అన్నవే. ఆయనకథ త్రిజగత్పరి వ్యాప్తం కూడాను.

## అధోజ్ఞాపిక

1. జగుర్గృహేఽభ్యస్త సమస్త వాఙ్మయైః ససారికైః పంజరవర్తిభిః శుకైః
నిగృహ్యమాణోవటవః పదే పదే యజూంషి సామాని చ యస్యశంకితాః॥

బాణునిపూర్వులు కులపతులు, వారింట శిష్యులు అధిక సంఖ్యలో ఉండేవారు. అనారత అధ్యయన తత్పరులు వారు. అయినా, వేదాన్ని వల్లె వేసేటపుడు- ఆ యింటనున్న గోరువంకలకు, చిలుకలకూ వెరచేవారట, శిష్యులు - ఎందుకు? - అంటే, అవి ఎక్కడ తప్పుపడతాయో అని. అట్లాంటి వంశములో తాను జనించానంటాడు, వక్తృవైలక్షణ్య ప్రతిపాదన చేస్తూ కాదంబరి ఉపక్రమణికలో.

శ్రీనివాసరామానుజమ్

# అనంతపురం జిల్లా గ్రామ, వ్యక్తినామాలు కన్నడ నిర్మాణ ప్రభావం ఉన్నది

శ్రీ ఎ. విజయ దత్తాత్రేయ శర్మగారు మల, కల్లు గ్రామ నామాను బంధంగా చేరే పూర్వపేర్లు ఇతర జిల్లాల్లోనూ వున్నాయనడం (భారతి, సెప్టె.1984, పు.81)తో నేను ఏకీభవిస్తున్నాను.నా వ్యాసం ప్రధానంగా కన్నడనిర్మాణ ప్రభావాన్ని చెప్పడ

ముఖ్యోద్దేశ్యం. శ్రీ కూరిగనూరు నరసింగరావుగారు 'కన్నడిగలు - తెలుగలు' అన్న వ్యాసం (సంపుటి. 2, పార్ట్ 2 భారతి 1930, పు. 429) లో కల్‌బావి (= రాతిబావి), నెల్లూరు (కన్నడ నెల్లు= వడ్లు), విజయవాడలలో. కన్నడ ప్రభావముంది అని ఏనాడో చెప్పారు. విజయవాడలోని (వాడ= గ్రామం) వాడ కన్నడంనుంచి వచ్చింది అన్నారు. కనుక మిగతా జిల్లాల్లో కూడా కన్నడప్రభావం ఉన్నదీ లేనిదీ ఆలోచించ వలసి వుంది. విజయ దత్తాత్రేయ శర్మగారు సూచించి నట్లుగా తిప్ప అంటే చిన్న కొండ - కొండ- దిబ్బ అనే (శబ్దార్థచంద్రిక కార్థం) అర్థం కూడా ఆలోచనాత్మకంగానే వుంది.

శ్రీ 'తి' గారు రాసిన కొన్ని విషయాలు (భారతి, సెప్టె. 1934, పు. 61-64) ఆలోచనాత్మకంగా వున్నాయి. చాలా విషయాలు గాలికో తేలి పోతు న్నట్లుగా వున్నాయి. ప్రతి దాంట్లోనూ కన్నడ ప్రభావముందని బలవంతంగా నేను సాధించ బూనతానని 'తి' గారు తమ వ్యాసం చివర్లో ఆరోపించారు. ఇది సరికాదు. ఇప్పుడొక్కటొక్కటే వివరిస్తాను.

న :

'స' కన్నడ సంబంధ సూచక ప్రత్యయం కాదు. వ్యక్తి నామాం త్యమని అన్నారు. అది సంబంధ సూచక ప్రత్యయమే. 'కర్నాటక నామ. శాస్త్ర: ఒందు స్థూల పరిచయ' అన్న వ్యాసం (సాధనె జులై - సెప్టె. 1982 పు. 98 లో రేణుకా ఆర్యగారు సంబంధ సూచక ప్రత్యయం కింద మక్కన హళ్ళి, కెంచన కెరె, చిక్క నాయకన హళ్ళి, గురువాయన కెరె మొ॥ ఉదాహరణలిచ్చారు (డా. రఘుపతి కెమ్తూరు గారు రాసిన 'ఒనొమాస్టిక్స్ అఫ్ కర్నాటక' అన్న దానికి ఆర్యగారి భావానువాదం) మదకశిర తాలూకాలో కరె సంకన హళ్ళి, మల్లి నాయకన హళ్ళి, గౌడన హళ్ళి మొ॥ గ్రామాలున్నాయి. వీటిని అన్న నామాంత్యంగా కరె సంకన్న, మల్లినాయకన్న, గౌడన్న అని ఎట్లా అనడం? కర్నాటకలో వున్న కెంచనకెరె గ్రామనామానికి సమానంగా కెంచానపల్లి ఇక్కడ వుంది. కాబట్టి కెంచానపల్లిలో 'స' కన్నడ ప్రత్యయమే. ఇక పోతే బసవనపల్లి, సింగన మల గ్రామాల్లో వున్న 'స' సంబంధసూచక ప్రత్యయంగానే కాకుండా 'తి' గారన్న ట్లుగా అన (అన్న) నామాంత్యంగాకూడా వుంది, అని చెప్పొచ్చు. ఇలాంటిచోట్ల రెండురకాలూ చెప్పుకోవడానికి అవకాశముంది.

బసవమత ప్రభావం :

మత ప్రభావం వల్ల వచ్చిన పేర్లు భాషాప్రభావమని భ్రమ పడకూడదన్నారు భాషా పరిశీలనను సాంస్కృతిక దృక్పథం(కల్చరల్ ఏస్పెక్ట్స్) తో కూడా చూడవచ్చు. ఇది భాషా శాస్త్రంలో వున్న పద్ధతే అందుకనే బసవమత ప్రభావంతో వున్న పేర్లు కన్నడప్రభావంగా చెప్పబడ్డాయి.

తిప్ప :

తిప్పయ్య మొ. పేర్లు తిప్ప (<తిర్ప<తిరుప) తిరుపతి స్వామి నుంచి వచ్చిందని అనడం కంటే ఈ క్రింది రెండు రకాలుగా ఊహించవచ్చు.

(1) తిప్పకు కిట్టెల్ డిక్షనరీలో చెప్పినట్లు (ఎ మ్యాన్ అఫ్ ది డంగ్ హిల్ డంగ్ = పెంట) పెంట అనే అర్థం చెప్పుకుందాం. మిగతా ప్రాంతాల్లో కొన్ని చోట్ల పెంటయ్య అని పేరు పెట్టుకోవడం ఒక ఆచారముంది. పుట్టిన ప్రతి పిల్ల వాడు చనిపోతే పుట్టిన పసిబిడ్డను పెంటకుప్పమీద కన్నతల్లి పారేస్తుంది. (అంటే పారేయ్యడమ పెంటకుప్పమీద పెడుతుందన్న మాట) ఆ బిడ్డను వేరొకరు ఎవరైనా తీసుకుని ఆ కన్నతల్లి దగ్గరకే వచ్చి ఈ బిడ్డనన్నా పెంచుకోమ్మా అని ఇచ్చి వెళ తుంది. అప్పుడా బిడ్డకు పెంటయ్య (పెంటకుప్పమీద దొరికింది కాబట్టి) అని పేరు పెడతారు. అట్లా నామకరణం చేస్తే బిడ్డ చనిపోకుండా బ్రతుకుతుందని ఒక నమ్మకం. అట్లే ఇక్కడ కూడా తిప్పయ్య మొ॥ పేర్లు పెట్టడం, తర్వాత ఆ ఆచారం వున్నా లేకపోయినా పేర్లు పెట్టడం మాత్రం మిగిలిపోయాయేమో అనిపిస్తుంది.

(2) తిప్పయ్య అన్నది రుద్రునికి మారుపేరుగా భావించవచ్చు. ఈ పేర్లు గల వాళ్ళు మెడలో కంబెను వేస్తారు. ఈ ఆచారం కర్నాటకలోనూ, దానికి సమీప ప్రాంతమైన అనంతపురంజిల్లాలోనూ వుంది. ఈ జిల్లాలోనే కాకుండా కర్నాటకకు సమీపప్రాంతాలైన ఇతరజిల్లాల్లోకూడా ఈ ఆచారముండవచ్చు. ఈ రెండు కార ణాల్లో రెండవదే సమంజసంగా వుంటుంది.

అప్ప:

ఈ పదం స్పష్టంగా కన్నడ ప్రభావంతో వచ్చిందే. ఒకప్పుడిది కన్నడ లోనూ, తెలుగులోనూ ఉంటే ఉండచ్చుగాక ఇప్పుడది కన్నడలో వుంది, సరిహద్దు ప్రాంతాల్లో మిగిలి వుంది. మిగతా ప్రాంతాల్లో తక్కువైంది. సరిహద్దు ప్రాంతాల్లో ఈ పదం మిగిలి వుండడమే కన్నడ ప్రభావం. వేరే భాషల్లో కూడా 'తి' గారు చెప్పినట్లు కొన్ని పేర్లలో పోలికలుండవచ్చు. ఇక్కడ దేనిలో పౌనః పున్యం (ఫ్రీక్వెన్సీ) ఎక్కువగా వుంది అనేదాన్ని ఆధారంగా తీసుకొని చెప్పాలి

అణ్ణ :

కన్నడ మాతృభాషవారు 'ణ్ణ' అని పెట్టుకుంటారు, 'ణ్ణ' అని పలుకుతారు, తమ భాష కాని వానిని లింగన్న అనే పిలుస్తారు. తమ భాష వానిని లింగణ్ణ అని పిలుస్తారు — అని 'తి' గారు అనడం సరికాదు. నేను ద్విభాషా ప్రాంతమైన కదె కల్లు మొ. ప్రాంతాల్లో క్షేత్ర పర్యటన చేసినప్పుడు సూక్ష్మంగా పరిశీలన చేసి చెప్పిన అంశమిది. కన్నడ మాతృ భాషగా గలవారు, కానివారు కూడా అణ్ణ అనే ఉచ్చరిస్తున్నారు. (రాయదుర్గంలో మాత్రం అన్న అనే రాస్తున్నారనుకో.) ద్విభాషా ప్రాంతంలో కేవలం తెలుగు భాష వచ్చేవారిపై కూడా దేవణ్ణ మొ. పేర్లలో అణ్ణ ఉచ్చారణ వినిపించడం నేను ఫీల్డ్‌వర్క్‌లోనూ గమనించాను, చిన్నప్పట్నుంచికూడా గమనించాను. (నేను ద్విభాషా ప్రాంతీయుడినే కాబట్టి) కాగా దేవన్న, లింగన్న అనే వ్యవహారాయా ఇక్కడలేకపోలేదు. నేను ఈ ప్రాంతాల్లో ఉన్నత విద్యలు చదువుకున్న కొందర్ని కూడా ఇంటర్వ్యూ చేశాను. దానిలో ఒక లెక్చరర్ కూడా వున్నారు (పకీరప్ప). యేమి ఇంత చదువుకున్న మీరు కూడా దేవణ్ణ అని వ్యవహరిస్తున్నారు అని నేనంటే- మాకేమో దేవణ్ణ అని పలుకుతేనే బాగుంటుంది అని వారు సమాధాన మిచ్చారు. మరి కొంతమంది మేము అప్రయత్నంగా పలుకు తున్నామని ఒప్పుకున్నారు. 'తి' గారన్నట్లు తమ భాష కానివానిని 'లింగన్న' అని, తమ భాషవానిని 'లింగణ్ణ' అని పిలవడం కన్నడ ప్రభావం తగ్గుతున్న గ్రామాల్లో (ఉదా. నింబగల్లు-ఉరవకొండ తాలూకా) వుంది. కాని నింబగల్లుకు పదిమైళ్ళ దూరం లోనే వున్న గోవిందవాడ గ్రామంలో అణ్ణ అని పిలవడం వుంది. సారాంశ మేమంటే కన్నడ ప్రభావం అన్నిచోట్లా ఒకే రీతిగా వుండదు. ఒక్కొక్కచోట ఒక్కొక్క దశలో వుంటుంది.

శ్రీ 'తి' గారన్నట్లు మన ప్రాంతం వారికి సరిహద్దు అయినట్లు వారి ప్రాంతం మనకూ సరిహద్దే కనుక తెలుగు మీద కన్నడ ప్రభావమున్నట్లే కన్నడ మీద కూడా తెలుగు ప్రభావముంది. 'తి' గారురాసిన వాక్యాల్ని నేను సుహృద్భావం గానే తీసుకుంటున్నాను. ఒక్కరే అయితే ఒకే కోణం నుంచి చూడటం వల్ల కొన్ని లోటుపాట్లతో అసమగ్రంగా వున్న వ్యాసం శ్రీ 'తి' గారు శ్రీ దత్తాత్రేయ శర్మగారు లాంటి వారి విమర్శల వల్ల సమగ్ర మవుతుంది.

ఆదవాని హనుమంతప్ప



# గ్రంథవిమర్శలు

## సంస్కృతాంధ్రపదార్ణవము

[ద్వితీయ సంపుటము. రచయిత : శ్రీ విత్రాల శేషాచార్యులు. డెమ్మీ 184 + 32 పుటలు. వెల. 5 రూ లు. ప్రకాశకులు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు - 4.

గత శతాబ్దిలో మధ్యభాగం వరకూ సంస్కృతంలోనూ, తెలుగులోనూ. నిఘంటువులు పద్యరూపంలోనే ఉండేవి. వాటివల్ల సామాన్యులకు శబ్దార్థ పరిజ్ఞానం కలగడం చాలా కష్టం. ఈ సంగతిని గ్రహించే సుప్రసిద్ధులైన విద్వాంసులు సంస్కృతంలోనూ, తెలుగులోనూ అకారాదిక్రమంలో నిఘంటువులను నిర్మించడం ప్రారంభించారు. సంస్కృతంలో ఆప్టే నిఘంటువు, తెలుగులో శబ్దరత్నాకర, లక్ష్మీనారాయణీయాలూ ఆంధ్ర ప్రాంతంలో ప్రచారంలో ఉండినవి. తర్వాత సూర్యరాయాంధ్ర నిఘంటువు, వావిళ్ల నిఘంటువూ వచ్చాయి. ఇంకా మరికొన్ని నిఘంటువులు రాకపోలేదు. వీటిలో ఇప్పుడు ఏవి లభ్యాలో, ఏవి అలభ్యాలో తెలియదు. ఇట్టి స్థితిలో ఈ నిఘంటువు వెలువడడం ఎంతో హర్షింపదగినది.

శ్రీ శేషాచార్యులుగారు సంస్కృతాంధ్రాలలో బహుముఖ పాండిత్యం కలవారు. అనుభవజ్ఞులు. ఆయన తెలుగువారి అవసరాన్ని మనస్సులో ఉంచుకొని, బాగా ఆలోచించి అమరసింహుని నామలింగానుశాసన పద్ధతిలో దీనిని సంకలనం చేశారు. అమరకోశం ప్రథమకాండలోని స్వర్గవర్గను, ద్వితీయకాండ లోని మనుష్య వర్గాన్ని గ్రహించి ప్రథమ సంపుటాన్ని యిదివరలో రచించి ప్రకటింప చేశారు. ఈ రెండవ సంపుటంలో అమరకోశం లోని ద్వితీయకాండలోని వనౌషధి, సింహాది వర్గములలోని పదాలు గ్రహించబడినవి. శేషాచార్యులుగారు విషయక్రమాన్ని దృష్టిలో పెట్టుకొని దీనిని సమకూర్చారు. ప్రతి తెలుగు పదానికీ సంస్కృతాంధ్రాలలో పర్యాయపదాలు ఈయబడినవి. ఈ పద్ధతి ఎంతో ఉపయోగకరమైనది. పుస్తకం చివర అకారాది క్రమంలో పదాల పట్టిక కూడా ఈయబడింది. దీనితో ఈ నిఘంటువు పూర్తికాలేదు. ఇంకా మరికొన్ని సంపుటాలు రావలసి ఉన్నది. ఇంకా ఎన్ని సంపుటాలలో ముగియగలదో! అయితే - ఇట్టి నిఘంటువులను వీలయినంత కొద్ది సంపుటాలలో ముగించడం అవసరం. ఎక్కువ సంపుటాలయితే పాఠకులకు వ్యయ ప్రయాసాలు కలగవచ్చును.

సంస్కృతాంధ్రాలలో అపూర్వ గ్రంథాలను పరిష్కరింపజేసి ప్రకటిస్తున్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు ఇదివరకే మాండలిక పదకోశాలు, ద్విభాషా, త్రిభాషా నిఘంటువులు మున్నగు కోశాలను ప్రకటించియున్నారు. ఇప్పుడు ఈ సంస్కృతాంధ్ర పదార్ణవ ప్రకటనకు పూనుకున్నారు. దీనివల్ల వారి అమోఘ భాషాసేవ వ్యక్తమవుతూ ఉన్నది.

బులుసు వేంకటరమణయ్య

## శ్రీ ఆంజనేయ చరిత్ర

[రచయిత : శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి. క్రౌన్ సైజు, 84 పుటలు, వెల 5 రూ. లు. ప్రకాశకులు - శ్రీ హనుమత్ సాంస్కృతిక సమాజము, ఒంగోలు - ప్రతులకు - శ్రీ ఎన్. సుబ్బారావు, 4-938, కె. కె జె. బిల్డింగ్స్, రామకృష్ణ ఆయిల్ మిల్సు ఎదుట, కర్నూలు రోడ్డు, ఒంగోలు-523002.]

హనుమద్దండకం, స్తోత్రాలు మున్నగునవి చాలామంది ఎరుగుదురు. కాని ఆంజనేయ చరిత్రని పురాణోక్త ప్రకారం తెలిసినవారు తక్కువ. దీనిని గ్రహించి శ్రీ హనుమత్ సాంస్కృతిక సమాజంవారు భక్తుల ఉపయోగార్థమై దీనిని ప్రకటించారు. ఇందులో పరాశరసంహిత లోని - ఆంజనేయునికి సంబంధించిన కొన్ని అధ్యాయాలను (పటలాలను) స్వీకరించి సంస్కృత మూలానికి తెలుగు తాత్పర్యం ఇయ్యబడింది. రచయిత చిదంబరశాస్త్రిగారు సంస్కృతాంధ్రాంగ్లములలో సమర్థులు కావడంవల్ల రచన సర్వజనోపయోగంగా సులభంగా సాగింది. ఈ భాగాలలో క్రమంగా అష్టోత్తర శతనామాలు, హనుమజ్జన్మ వృత్తాంతం, పంచరత్న ప్రభావం, హనుమద్దీప విధానం, హనుమద్ద్వాదశమాలా మంత్ర వివరణం ఉన్నవి. శ్రీ శాస్త్రిగారు హనుమద్భక్తులు. పయి సమాజానికి అధ్యక్షులు కూడా. అందువల్ల శ్రద్ధగా సమకూర్చబడిన యీ గ్రంథం హనుమద్భక్తులందరికీ మిక్కిలి ఉపయోగకరంగా ఉంటుంది. ఆధ్యాత్మిక చింతనకు దోహదంగా ఉంటుంది.

## శ్రీ సంతోషిమాతవ్రత కథ

[రచయిత : శ్రీ శిలపర సెట్టి రాములు నాయుడు. క్రౌన్ సైజు 36 పేజీలు. వెల 3రూ. లు ప్రకాశకులు - ఆంధ్రఫెడరేషన్, గేటు బజారు, ఖరగపూరు-721301 పశ్చిమ బెంగాల్.

పుస్తకాలు విశాఖపట్నం గుప్తా బ్రదర్స్ షాపులోను, ఖరగపూరు గేట్ బజార్ స్టూడెంట్స్ బుక్ సెంటర్‌లోను, విశాఖపట్నం పార్వతి బుక్‌స్టాల్‌లోను, అనకాపల్లి సంతోషిమాత మందిరంలోను దొరుకును.]

తాము తలచిన కోరికలు నెరవేరుటకు వివిధ దేవతలను గూర్చి వ్రతాలు చెయ్యడం మనకు పరిపాటి. అట్టివ్రతాలలో సంతోషిమాతవ్రతం ఒకటి. ఇది మొదట్లో ఉత్తరం, పశ్చిమ భారతదేశాలలోనే ప్రచారంలో ఉన్నా క్రమ క్రమంగా ఆంధ్రప్రాంతంలో కూడా మంచి ప్రచారానికి వచ్చినది. కఠిననియమాలు లేని యీ వ్రతం అందర్నీ ఆకర్షిస్తున్నది. ఈ వ్రతానికి కొన్ని నియమాలూ, కథాప్రధానాలు. పూజా విధానం వ్రతకల్పాలు వేర్వేరు రీతుల చూపుతున్నవి. కథ ప్రధానం కావడం వల్ల ఈ వ్రతకథను చెప్పే పుస్తకాలు వివిధభాషల్లో చిన్నవీ, పెద్దవీ వస్తున్నవి. అట్టి పుస్తకాలలో ఇది ఒకటి.

ఈ పుస్తకంలో మొదట సంతోషిమాత అష్టోత్తర శతనామాలు ఇవ్వబడినవి. వ్రతానికి ముందుగా గణపతి పూజ చెయ్యాలని చెప్పబడింది. తర్వాత సంతోషిమాత పూజకు సంకల్పం మాత్రం ఇయ్యబడింది. కాని ధ్యానావాహనాది పూజా విధానం చూపబడలేదు. తర్వాత, వ్రతనియమాలు. ఉద్యాపన పద్ధతీ ఈయబడినవి. ఆ తర్వాత కథ విపరంగా ఉన్నది. ఈ కథ వేర్వేరు భాషలలోనూ, పుస్తకాలలోనూ విభిన్నరీతులతో కానవస్తున్నది. మధ్యలో భేదాలున్నా, ఆద్యంతాలలో ఎక్కువ మార్పు ఉన్నట్లు తోచదు. ముఖ్యంగా పాడింపబడే మంగళహారతి ఇందులోనూ ఉన్నది.

రచయిత కథతోపాటు పూజావిధానం కూడా ఇస్తే ఎంతో బాగుండేది. పూజచేసేవారు కథకోసం దీనిని, పూజకోసం మరొక పుస్తకాన్ని దగ్గర ఉంచుకునే శ్రమ ఉండేది కాదు. ఇందులో నియమాల్లో కూడా కొన్ని మార్పులు కానవస్తున్నవి. సరియైన నియమాలేవో తెలుసుకోవడం శ్రమ సాధ్యమే.

పుస్తకం చివర త్రినాథవ్రతం గురించి కూడా ఉన్నది. ఈ వ్రతం ఒరిస్సాలోను. వంగదేశంలోనూ ప్రారంభమై తెలుగునాట కూడా తర్వాత ప్రచారానికి వచ్చింది. ఆ వ్రతం చెయ్య వలసిన పద్ధతి మాత్రం విపులంగా చెప్పబడిందే కాని పూజా పద్ధతి – ధ్యానాదిసహితంగా ఎలా చెయ్యాలో లేదు.

రెండు వ్రతాలను గురించీ, ఇందులో అసమగ్రంగానే ఉన్నది. దీని ఉపయోగాన్ని చదువరులే గ్రహించాలి.

"అంగీరస"

## పాపాయి – మొదటిభాగం

[రచన : ఎ. యూస్సీలక్ష్మి, మంజీరా ప్రచురణలు, 12-8 ఆర్. టి అమీర్‌పేట, హైద్రాబాద్– 500016, 92 పేజీలు, వెల : 10 రూ॥లు.]

కుటుంబ నియంత్రణ, గర్భవతి – ఆందోళన, ప్రసవ సమయపు జాగ్రత్తలు, తల్లిపాలు, పోతపాలు – జాగ్రత్తలు. పాపాయి ఆహారం, నీరు, విటమినులు, వ్యాధి నిరోధక పద్ధతులు, స్నాన, నేపవి కాలపు జాగ్రత్తలు, విరేచనాలు, అజీర్ణం, కడుపునెప్పి, జలుబు, తరచుగా వచ్చే జ్వరాలు, దగ్గు, అంటు రోగాలు, చర్మ వ్యాధులు మొదలయిన వాటిని గురించిన వ్యాసాలు ఈ పుస్తకంలో ఉన్నాయి. ఈవ్యాసాలు చాలా సులభశైలిలో వ్రాయబడ్డాయి.

వైద్యేతర వృత్తిలో ఒక విభాగమైన క్లినికల్ సైకాలజీ (మానసిక రోగ సంబంధాలు)లో పనిచేస్తూ, చాలా కాలంగా పిల్లల ప్రాపుతో ఏర్పడిన అనుభవం ద్వారా రచయిత్రి చాలా విషయాలు చదివే వారికి అర్థం అయ్యేలా తెలియజేశారు.

ఇటువంటి పుస్తకాల మూలంగా ప్రజలలోని మూఢనమ్మకాలు పోవటానికి అవకాశం ఉంటుంది. పై పుస్తకం పిల్లల పెంపకంలో తల్లులకి ఎంతో సహాయకారిగా ఉంటుంది.

"కనీసపు ఆరోగ్య సూత్రాలు తెలియక పాపాయిని సరిగా పెంచుకోవటం చేతగాని తల్లిదండ్రులు కొల్ల కొంటీ ఉన్నారు. మనదేశంలోని తల్లిదండ్రులు తమ బిడ్డల్ని సక్రమంగా పెంచుకోవటానికి కావలసిన జ్ఞానాన్ని అందించ గలిగితే నా ప్రయత్నం ఫలించిందనుకుంటాను" అనే రచయిత్రి వాక్యాలు నిజంకావాలి

## శిశుపోషణలో స్త్రీపాత్ర

[రచయిత – డాక్టర్ పి. వి. సుబ్బారావు, పబ్లిషర్ – విప్పర్ల వెంకటాచలపతిరావు – కనకపల్లి, వయా ఉయ్యూరు, కృష్ణాజిల్లా. పేజీలు : 70 వెల : ఆరు రూపాయలు]

ఈ పుస్తకంలో శిశుపోషణలో స్త్రీపాత్ర; సమాజము– స్త్రీ స్థానము; పసిపిల్లల వ్యాధులు– విరేచనాలు; పోలియో; ధనుర్వాతము; కోరింతదగ్గు; గజ్జి; బిడ్డలు– తల్లిపాలు; పసి మనసులు; సవాయి; డిఫ్తీరియా; రొంప; జలుబు; మశూచి; శిశువు- ఎదుగుదల; సదుపగాహన- సుఖమయ జీవితం అనే పదిహేను వ్యాసాలున్నాయి.

మన ప్రజలలో ఎన్నో మూఢనమ్మకాలు వున్నాయి. ఆరోగ్య సంబంధ మూఢనమ్మకాలు ప్రజలలో అధికం అనే చెప్పవలసి వుంది. చదువు లేని వారిలో ఈ నమ్మకాలు వున్నా సహజం అనుకోవచ్చు గాని, బాగా చదువుకున్న వారిలో కూడా సామాన్య విషయాలలో మూఢనమ్మకాలు వున్నాయి.

ఈ నమ్మకాలను పోగొట్టి, రోగాలను గురించిన విషయాలను, అందులోను, ముఖ్యంగా రోగాలు రాకుండా చూసుకోవటానికి తగిన విజ్ఞానాన్ని అందించటానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా చాలవు. అటువంటి ప్రయత్నాలలో ప్రస్తుత పుస్తకం ఒకటి. హెల్త్ ఎడ్యుకేషన్ కోసరం ఇట్టి పుస్తకాలు వెలువడటం ఎంతైనా అవసరం.

పిల్లలకి రాగల సాధారణ రోగాలను గురించి రచయిత సులభశైలిలో వివరించారు ఈ పుస్తకంలో అంటు రోగాల నిరోధానికి ఎక్కువ ప్రాముఖ్యం యివ్వబడింది.

మనదేశంలో పుట్టిన ప్రతి వెయ్యిమంది పిల్లలలో 128 మంది మొదటి సంవత్సరం నిండక ముందే చనిపోతున్నారు. ఈ మరణాలలో అధిక భాగం తగిన ముందు జాగ్రత్తతో నివారింప తగినవే!

ఇటువంటి పుస్తకాలు తల్లులకి మార్గదర్శకంగా వుంటాయి. శిశువుల పోషణలో తల్లిదే ప్రధానమైన, మరియు ఏకైక పాత్ర అని చెప్పాలి. తల్లే యింట్లో వుండే వైద్యేతర మనిషి (పారా మెడికల్ వర్కర్). పిల్లల బాగోగులను గమనించటంలో ఆమెకు మించినవారు లేరు. వారికి యిటువంటి పుస్తకాల ద్వారా విషయబోధ చేయటం ఎంతైనా అవసరం. రచయిత కృషి ఫలించాలని ఆశిద్దాం!

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

## ఇనుపతెర వెనుక

[రచన – రాహూరి భరద్వాజ; వెల– రు 8-00. ప్రతులకు విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ, 520004 విశాఖపట్నం, గుంటూరు, హైదరాబాద్, అనంతపురం, తిరుపతి, హన్మకొండ,]

'రోగుట్టు' అనే ఉపోద్ఘాతం, ఓ కట్టుకథ, "ఆదికాలమున" మానవులందరూ అన్నదమ్ములండి, బలవంతులు దుర్బలజాతిని బానిసలను కావించారు, తొలిసారి విన్నాను, శతాబ్దాల సత్యం బంధాలు ? సర్వజన సంక్షేమం కోసం శాస్త్రవిజ్ఞానం అనంతాకాశమే అవధిగరం. మొత్తం 17 భాగాలు, అనుబంధం ఉన్నయీ 172 పుటల పుస్తకంలో.

వీటిలో మొదటి మూడు భాగాలలోని అంశాలు అందరూ ఆమోదించినవే. ఈ రచయిత రష్యా పర్యటనకు ఈ అంశాలకు సంబంధమేమిటో వివరించలేదు. తను చెప్పబోయే అంశాలకు ఇవి నేపథ్యాలని అనుకోవాలా ?

"జ్ఞానంలో ఎన్నోరకాలున్నా" యని ఎవరు ఎప్పుడు, ఎక్కడ వ్రాశారుట "ఓకట్టుకథ" అనే భాగంలోని కథ అందరకూ తెలిసినదే. ఒకరు చేసిన శ్రమ ఫలితాన్ని మరొకరు అనుభవించడం అన్యాయమని చెప్పడం. రచయిత ఉద్దేశమైతే అందుకు ఈ కథను పుస్తకంలో చేర్చడమవసరమా ? అవన్నీ అలా వుండగా యీ పుస్తకానికి "ఇనుపతెర వెనుక" అని పేరుపెట్టడం ఎంత సమంజసంగా వున్నది. ఈ నాడు సోవియట్ రష్యాలో పర్యటించడానికి ఎవరయినా వెళ్ళవచ్చు. చూడదలచిన వాటన్నింటిని చూడవచ్చు. అటువంటప్పుడు ఇనుపతెర ఎక్కడ ఉన్నది. ?

ఆ కలి దారిద్ర్యం లో ప్రత్యక్ష పరోక్ష జ్ఞానాలు ఈ రచయితకు మాత్రమే కాదు. రచయితలలో చాలా మందికి ఈ జ్ఞానం ఉంటుంది. అజ్ఞానం వుండడం రచయిత ప్రత్యేకత అనగలమా ?

ఒక్కొక్క రచయితకు ఒక్కొక్క అన్యదేశమంటే అభిమానం వుండవచ్చు. ఆదేశం ఇంత అభివృద్ధిని సాధించింది.– ఈ దేశం ఇంత అభివృద్ధిని సాధించింది. అని వ్రాయడం ఆయా రచయితల సమదృష్టిని సూచించుతుందా ? వారి అనుభవాలనుంచి మనం యేమి నేర్చుకున్నాం? అనేది అసలు సమస్య. పెక్కు సందర్భాలలో భారతదేశానికి అండగా సోవియట్ యూనియన్ నిలిచినది చాలా మందికి తెలుసు. రెండు ప్రపంచ యుద్ధాల వల్ల సోవియట్ రష్యాయే కాదు ఇంకా పెక్కు దేశాలు చాలా నష్టపోయాయి. యుద్ధం వల్ల వచ్చే కష్టనష్టాలు సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ దేశాలకు మాత్రం తెలియకా ?

ఇక సైబీరియా, అజర్ బైజాన్ వంటి రాష్ట్రాలలో ఈ రచయిత పర్యటన విశేషాలలో కొత్త అంశాలేమీ కనిపించవు. రేపు ఎప్పుడో అమెరికా

సంయుక్తరాష్ట్రాలలో పర్యటనకు ఈ రచయితనో మరొక రచయితనో ఆహ్వానించితే వారు ఆ దేశంలో పర్యటించి ఇలాగే వ్రాస్తారేమో. గతంలో వ్రాసారు కూడా ? అంతమాత్రానికే ఈ పుస్తకం నిరుపయోగమయినదని ఈ విలేఖరి భావించరాదు. చాలా బాగా వ్రాశారు ఈ రచయిత, సంస్కృత శ్లోకాలను పుటం కించడం వల్ల ఈ పుస్తకం ప్రయోజనం అధికమయినదని అనగలమా ? డాక్టర్ రావూరి భరద్వాజ మంచి రచయితలలో ఒకరు. ఇంతకంటే మంచి పుస్తకాలు ఆయన వ్రాస్తారని ఆశించవచ్చునా ?

వి. ఎస్. అవధాని

## ప్రకంపనం

[పులిపాక శ్రీరామచంద్రమూర్తి, వెల : రు. 4-00లు, ప్రతులకు 1) నవోదయ పబ్లిషర్స్; ఏలూరురోడ్, విజయవాడ-2 2) పి. యస్. ఆర్ మూర్తి ; కేరాఫ్ ఎస్ సి. యు. పి. స్కూల్ ; మణుగూరు-507117 : ఖమ్మం జిల్లా.

ఈనాడు అనేక కవితా సంకలనాలు వస్తున్నాయి. అందులో చాలాభాగం 'వచనగేయ కవితా సంకలనాలే. ఈతరం వచనగేయాన్ని ఎన్నుకున్నది. కవిత్వానికి ఛందస్సు ఉండాలా ? అన్నేప్రశ్న త్రీకి విత్వం అవసరమా ? అనవసరమా ? అని ప్రశ్నించుకోవడంలేదిది. ఎట్లారాసినా కవిత్వం కవిత్వమే. ఏం రాశారన్నదే ఇవ్వాళ్టిప్రశ్న ఆ దృష్ట్యాచూస్తే ఈకవి ఈతరం కవే ; నిన్నటికవికాదు; రేపటి తరం కవీకాదు. ఇవాళ్టి కవి అందుకు అవసరమైన సంభారమంతా ఈ సంకలనంలో ఉందని చదివిన ప్రతి పాఠకునికి తెలుస్తుంది. నినాదాలో కవిత్వం ఉండదు అలాగే రాజకీయోపన్యాసాల్లోనూ కవిత్వంఉండదు. కవిత్వంలో ఇవన్నీ ఉంటాయి. పూర్వకవిత్వంలో బోల్నన్ని నీతులున్నాయి; ఈనాటి కవిత్వంలో కావలసినంత అశాంతి ఉంది. మనం అగ్నిపర్వతం మీద బతుకుతున్నాం. ఈ అగ్నిపర్వతం ఎప్పుడు బ్రద్దలవుతుందో తెలీదు. తెలుసుకునే ప్రయత్నం తెలివైనవాళ్లు చెయ్యనివ్వరు. ఒక్కొక్కడూ అగ్నికణమై రగిల్తేతప్ప ఈ దుష్టవ్యవస్థ అంతంకాదు. ఈ వ్యవస్థ అంతం అయి మరో మానవీయ వ్యవస్థ ఉద్భవించడానికి పుడమి తల్లి పడే పురిటినెప్పులకు పండితులూ, మేధావులూ, కళాకారులు మంత్రసాని తనం ఒప్పుకోవాలి. ఆ మంత్రసానితనమే మూర్తిగారు ఒప్పుకుని తమ కవితాయుధాన్ని ప్రయోగించారు.

మూర్తిగారి గొంతు విలక్షణమైనది. ఆయన కవిత్వం చదువుతున్నప్పుడు మరోకవి గుర్తురాకపోవటంలోనే ఆ విలక్షణత ఉంది. కవిగా ఆయన వ్యక్తిత్వం కలవాడు సామాజిక సిద్ధాంతాలదృష్ట్యా మూర్తిగారు ముందుచూపుగల కవి.

"ఎప్పుడో ఒక చైతన్య వటవృక్షం ఊడలు సాచినపుడు
ఎప్పుడో ఒక వీరుడి మరణంగాలిని ఊరితీసినపుడు
ఎప్పుడో ఒక నిరుపేదబాధ గుండెల్ని గాఢంగా తాకినప్పుడు
ఎప్పుడో ఒక ఆకలిప్రేగు కొండచిలువలా చుట్టేసినప్పుడు
అప్పుడు కొత్తరూపు
గ్రామీణ జనసంక్షోభంపైన
అప్పుడో కొత్తరూపు
సామాజిక చైతన్యంపైన"

ఈ పాదాల్లో కవితాదృష్టి, కవితాశక్తి ఎంత మహత్తరమైందో, ఎంత బలవత్తరమైందో ప్రతిపదార్థ సహితంగా వ్యాఖ్యానం చెయ్యనవసరంలేదు. 'ఉన్నహృదయ కవాటాలమధ్య గండి తెగగొడుతున్న కవి' మూర్తిగారు.

ఒకతరం మారుతున్నప్పుడల్లా విలువలు పడిపోతున్నాయనే గోల ఒకటి వింటాం. ముందుకు నడుస్తున్న తరంమీద వెనుకటితరం చేసే గోల ఇది. ఏ తరంలోనూ ప్రతిభాశూన్యత్వం ఉండదు. కాకపోతే వెనుకబడ్డవాళ్ళు ముందున్నవాళ్ళని అర్థంచేసుకోవటంలోనూ వారితో మమైక్యం చెందటంలోనూ కొన్ని చిక్కులు వస్తాయి. ఈ కవితాసంకలనాన్ని చదివిన ఏ పాఠకుడైనా వయస్సుతో పనిలేకుండా విత్వంలోఉన్న పరిపక్వతకు, సామాజిక అవగాహనలో ఉన్న ముందు చూపుకు తలవూపక తప్పదు.

"ఈ చేతులే.... ......
చర్మం చిట్లినా వేళ్లనొప్పెట్టినా
అసలు తమనే ఖండించినా
చలిలో ఎండలో
హృదయాల సాక్షిగా
సామాజిక మార్పుకోసం
మార్గాన్ని నిర్మిస్తూ........"

కవి లక్ష్యం, లక్షణం అర్థమయిందనుకుంటాను.

## ప్రేమచంద్ జీవితం

[శ్రీమతి శివరాణీదేవి ప్రేమచంద్, అనువాదం: వాసిరెడ్డి సీతాదేవి, వెల: రు. 6-00, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; చంద్రం బిల్డింగ్స్ విజయవాడ-520004.

భారతీయ సాహిత్య నిర్మాతలలో ప్రేమచంద్ ఒకరు. ఒక రచయిత రచనలను గురించి పాఠకులకు తెలిసినంతగా అతని జీవితాన్నిగురించి తెలియక పోవటం సాధారణమైన విషయం. రచయితపై రచయిత వ్యక్తిగత జీవిత ప్రభావం తనచుట్టూవున్న జీవితాల ప్రభావం తప్పనిసరిగా ఉంటుంది. ఒక రచయిత రచనలను అంచనా కట్టడానికి అతని సమకాలీన సామాజిక చరిత్ర అతని చరిత్ర బాగా ఉపకరిస్తాయి. శ్రీమతి శివరాణీదేవిగారు రాసిన ఈ పుస్తకంలో ప్రేమచంద్ జీవితం ప్రధానభూమిక అయింది. ఆయన రచనల ప్రస్తావన దీంట్లో ఏమీలేదు. అయితే సంఘంపట్ల మానవజీవితం పట్ల ఆయనకున్న గాఢమైన అభిప్రాయాలు ఈ పుస్తకంలో కొన్ని దొరుకుతాయి. ఆ అభిప్రాయాలే ఆయన నవలల్లో కథల్లో కళాత్మకరూపాన్ని పొందాయి. ఈ పుస్తకం చదివితే ఆయన రచనలను ఇంకా బాగా అర్థం చేసుకొనవచ్చు.

రచయిత ప్రేమ్‌చంద్ సాహిత్యంలోనూ జీవితంలోనూ పురోగామి వాది. జీవితంలోనూ సాహిత్యంలోనూ ఏకతను సాధించిన అభ్యుదయవాది మానవతావాది ప్రేమ్‌చంద్. మహారచయిత అయినవానికి దేశకాలావధులు లేవని గోర్కీని గురించి చెబుతూ ప్రేమచంద్ ఇలా అంటాడు. రచయిత దగ్గర పంచిపెట్టడానికి ఏముంటుంది? అతని దగ్గర ఉండేదల్లా ఒక్క తపస్సే. దాన్నే అందరిముందూ పెడతాడు. కాని తనకోసం ఏమీ మిగుల్చుకోడు. సాధారణ మానవుడు తనకోసమే తపస్సు చేసుకుంటాడు. రచయిత విశ్వమానవ కళ్యాణంకోసం తపస్సుచేస్తాడు. రచయిత స్వాతంత్ర్యాన్ని గురించి కూడా ప్రేమచంద్ అభిప్రాయం తీవ్రంగానే ఉంటుంది. ఎంచేతంటే అయనకిలాంటి ప్రలోభాలులేవు కనుక. "పబ్లిక్ గవర్నమెంటూ రచయిత తన బానిస అనుకుంటుంది. ఇతరులను సంతోషపెట్టేవాడు రచయిత ఎలా అవుతాడు? గవర్నమెంటు జెయిల్లో వేస్తామని బెదిరిస్తుంది. పబ్లిక్ కొడతామని భయపెడుతుంది ఏటన్నింటికీ భయపడేకంటే రాయటం మానుకోవటం ఉత్తమం"

ఈ చిన్న పుస్తకంలో ప్రేమచంద్ జీవితంలో ఒడుదుడుకులు వాటిని ఎదుర్కొని ఆయన గడిపిన జీవితం, శివరాణీ ప్రేమచంద్‌ల దాంపత్యం స్వాతంత్ర్యోద్యమాన్ని గూర్చిన వారి అభిప్రాయాలు, ఇతర మానవులపట్ల ఆయనకుగల దయ సానుభూతి పత్రికా నిర్వహణపట్ల ప్రేమచంద్‌కుగల శ్రీవాభిమానం మొదలైన అంశాలు పాఠకులకు తెలుస్తాయి. శివరాణీదేవిగారు ఇట్లాంటి పుస్తకం రాయటం వల్ల ప్రేమచంద్‌పట్ల ఆలోచనాపరుల అవగాహన ఇంకా పెరుగుతుంది.

**టి. యల్. కాంతారావు**

## ఈ దేశం నాదేనా ?

[మల్లాది సుబ్బమ్మ, ప్రకాస్వామ్య ప్రచురణలు (ప్రై) లి, హైదరాబాద్ రూ. 5-00]

ఇది వెంకన్న అని ఓ బీదవాని కథ. అతని పసితనంనుంచీ అకాలమరణం వరకు యీకథ సాగుతుంది. చావునుంచి వెనక్కి కథ వెళ్తుంది. అతడో ముష్టివాని మనుమడు. అనాథ. కుక్కలా బ్రతికి కుక్కలా చస్తాడు. 1956లో హైదరాబాదులోని ఓ పూరేగింపుకు అడ్డుగావెళ్ళి ఈ దేశం నాదేనా ? అని వారిని గద్దిస్తాడు. తిరిగి తిరిగి అదేప్రశ్న వేస్తూ వాళ్ళకాళ్ళకు అడ్డం తగులుతాడు. వాళ్ళు యితన్ని శాక్కి వాహనాలాతనిమీంది పోనిచ్చి చంపిస్తారు. అతని కథ తెలిసిన ఓ కృష్ణారెడ్డి అతనికథ తన స్నేహితుడు నారాయణరెడ్డికి చెప్తాడు.

ఇది ఒక చప్పని కథ. కథలో దేశభక్తిగానీ, దేశభక్తుడుగానీ చదువరికి దొరకదు. "ఆలోచన"లో శ్రీ. యం. వి. రామమూర్తి పేర్కొన్న ఉద్రిక్తత కథలో ఎంతమాత్రమూలేదు. వెంకన్న దేశభక్త్యానికి కథలో ఎక్కడా నిదర్శనాలు దొరకవు. కథలో బిగిగాని బిగిగాని లేదు. అతిసాధారణంగా వున్నది.

రచయిత్రి మాత్రం ఏవో చెప్పాలని సందేశాన్ని యివ్వాలని ఆరాటపడినట్లు కథలో కొన్నిచోట్ల కనిపిస్తుంది.

## తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర

[వేటూరి ప్రభాకరశాస్త్రి, ప్రచురణ: వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు, 2-2-18/15 డి. బాగ్ అంబర్ పేట్, హైదరాబాద్-500013, వెల: రూ. 10/-]

ఆంధ్రుల చరిత్రలో మరుగునపడియున్న అధ్యాయమిది. క్రీ.శ. పదునారవ శతాబ్దిలో శ్రీకృష్ణదేవరాయలు తంజావూరు, మధుర రాజ్యములు లోబరుచుకొని కొంతకాలమచట పూర్వరాజులనే సామంతులుగ నుండనిచ్చెను. కాని వారిలో తగవులు రాగా రాయలు నాగమనాయకుని పరిష్కరించమని పంపెను. నాగమనాయకుడు ఆ రెండు రాజ్యములను తన యేలుబడిలో నుంచుకొన జూచెను. కృష్ణదేవరాయలు అతనిని పట్టి తెమ్మని అతని కొడుకగు విశ్వనాథ నాయకునే నియోగించెను. రాయలవారి యందలి భక్తితో విశ్వనాథనాయకుడు తండ్రిని బంధించి తెచ్చెను. రాయలు సంతసించి విశ్వనాథనాయకుని ఆ రెండు రాజ్యాలకు సామంతాధిపతిగ నియమించెను. ఈ విధముగా తెలుగునాయకుని క్రింద తమిళ దేశమున తంజావూరు, మధుర రాజ్యము లుద్భవించెను. అచ్యుతదేవరాయలు తన మఱదలు భర్తయైన చెవ్వప్పనాయనికి తంజావూరు రాజ్యమును విడదీసి యిచ్చెను. ఇప్పటినుండి రెండు తమిళ రాజ్యములు ఇద్దరు తెలుగు నాయకుల క్రింద కొంతకాలము అనగా రక్షసితంగడి యుద్ధములో విజయనగర సామ్రాజ్య పతనము అగు వరకు సామంత రాజ్యములుగను, ఆ తరువాత స్వతంత్ర రాజ్యములుగను వర్ధిల్లెను,

వారు నిర్మించిన ఆలయ, గోపుర, ప్రాకారాది నిర్మాణముల ద్వారాను, సంగీత, సాహిత్య, నట విశారదుల ద్వారాను, విద్వత్కవుల రచనల ద్వారాను దక్షిణ దేశంలో ఆంధ్ర సంస్కృతి కొక ఉన్నతాసనం లభించెను. విజయనగర పతనానంతరము రాజాదరణము కోల్పోయి కాందిశీకులైన తెలుగు కళాకారులకు, శిల్పులకు, కవులకు, విద్వాంసులకు తంజావూరు, మధురలు నెలవులయ్యెను.

ఈ విస్మృత చరిత్రాధ్యాయమును మొదట వెలుగులోనికి తెచ్చిన మహనీయులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి అనవచ్చును. వీరి పుస్తకమును మొదట 1914లో రచించి కె. వెంకట శేషయ్యగారి ద్వారా మద్రాసులో ప్రచురించిరి. డెబ్బదేండ్ల తరువాత ఈ ద్వితీయ ముద్రణము వెలువడెను. ఇది తంజావూరి ఆంధ్ర రాజులను గూర్చిన చరిత్రయే. మధుర నేలినవారి చరిత్ర కూడా వేరొండు గలదు. కాని అది యింకను ఆంధ్రమున ఉద్ధరించవలసియున్నది. తంజావూరి ఆంధ్రరాజుల చరిత్రకు అసలు కథావృత్తాంతము చెన్నపురి లైబ్రరీలో కలదనియు, దానినే హెచ్చుతగ్గులు లేకుండా క్రొత్త చేసినట్లును, భాషాస్వభావమును పాడు చెయ్యలేదనియు శ్రీ శాస్త్రిగారు తమ ప్రథమ ముద్రణ పీఠికాంతమున జెప్పిరి. వారు ఆ ముద్రణకు విపులమగు పీఠిక వ్రాసిరి. అందు అసలు చరిత్రయందులేని ఆ యూరాజుల పోషణలో వర్ధిల్లిన కవులు రచించిన కావ్యములను, ఇతర గ్రంథములను సంక్షిప్తముగా వివరించిరి. దక్షిణాంధ్ర వాఙ్మయ చరిత్రను బరిశోధించు విద్యార్థులకు వీరి పీఠిక మార్గదర్శకముగ నున్నది. వీరి మార్గమును అనుసరించుచు శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులువారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, నేలటూరి వెంకటరమణయ్యగారు, మానవల్లి రామకృష్ణ కవిగారు పలు వ్యాసములు ప్రచురించిరి. నేలటూరి వారు 'మధుర తంజావూరు నాయకరాజులనాటి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' అను నొక పుస్తకము రచించి మల్లంపల్లివారికి కృతి సమర్పణ గావించిరి. అదియు అసమగ్రమైనదని వారే చెప్పుకొనిరి. అనాటి రచనలు కొన్ని యింకను అజ్ఞాతముగ నున్నవని యీ విద్వాంసులందరు చెప్పుకొన్నారు.

ప్రభాకరశాస్త్రిగారు ఉద్ధరించిన యీ తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర చెవ్వప్పనాయకుడు, అతని కొడుకు అచ్యుతప్పనాయకుడు, ఇతని కొడుకు రఘునాథనాయకుడు, ఇతని కొడుకు విజయరాఘవ నాయకుడు అను నలుగురు రాజులను గూర్చియు, కడపటివాని కాలములో తంజావూరి నాయక రాజ్యము పతనమొందుట తుదకు అంతఃకలహాలు కారణంగా శివాజీకి సోదరుడైన యేకోజీ 1674లో చోళరాజ్యానికి ప్రభువగు వరకు వివరిస్తుంది. ఈ అసలు కథావస్తువు రాయవాచకంవలె ఆనాటి తెలుగు భాషలో వ్రాయబడెను. కనుక అప్పటి తెలుగు వ్యావహారిక గద్యరచనకు మచ్చుగ నెన్నదగియుండును. చరిత్రకు, తెలుగు భాషకు ఈ గ్రంథము ముఖ్యమైనది. దీనినుద్ధరించి పరిశోధకులకు మార్గదర్శకులైన శ్రీ శాస్త్రిగారి మొదటి పయత్నము, డెబ్బదేండ్ల తరువాత దాని పునర్ముద్రణము మిక్కిలి ప్రశంసార్హములు.

పి. వి. పరబ్రహ్మశాస్త్రి



ముద్దు ఆర్ట్ మూవీస్

# ముద్దుల మనవరాలు

జంధ్యాల జయకృష్ణ



ముద్దు ఆర్ట్ మూవీస్

ముద్దుల మనవరాలు

జంధ్యాల జయకృష్ణ

ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం హరి గౌతంరాజు

SREE LAKSHMI ADS











# అమృతాంజన్‌కే
# తెలుసు
# ఒంటి నొప్పులు
# మరియు
# బెణుకుల బాధ



మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ








1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు.

# అమృతాంజన్

ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి

OBM 8777 TG